ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, ౨౪.

# భగ్నహృదయుఁడు

గ్రంథకర్త

బాలకవి, "చిలుక"

రచితము.



మొదటికూర్పు.

ప్రకాశకులు,

కవిరాజహంస

ఓలేటి పార్వతీశము

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము,

పిఠాపురము.

1932



[వెల రు ౧—౮—౦.



బాలకవి,

ఎ. కృష్ణస్వామిగారు,

బి. ఏ. తరగతి.

(Under "CHILUKA" Series.)

# రాజపోషకులు



మ. రా. రా. శ్రీ శ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మజగపతి
బహద్దరు జమీందారిణీవారు, తుని.

---

# రాజపోషకులు



మ. రా. రా. శ్రీ శ్రీ శ్రీరాజా ఇనుగంటి వేంకట సూర్యప్రకాశరావుగారు,
ఉండూరు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొప్పర్తి సూర్యనారాయణరెడ్డిగారు,
జమీందారు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ పసచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బుట్టల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఓరంగల్లు.

,, శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఓరంగల్లు.

,, శ్రీ నెలగిల గోవిందరాజుగారి కుమారులు వేంకటరెడ్డిగారు,
ఇతిహాసగ్రంథమాలాసంపాదకులు, ఆరవిల్లి.

,, శ్రీ హోతాప్రగడ బ్రహ్మానందశాస్త్రి పంతులుగారు, ప్రొప్రయి
టరు, సుజనరంజనీముద్రాక్షరశాల, కాకినాడ.

---

# పోషకులు



మ. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, కాకినాడ.

,, శ్రీ అద్దేపల్లి హరిశ్చంద్రుడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురం.

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజ వేంకటరమణారావుపంతులుగారు, ముఖాసాదారు, తణుకు.

,, శ్రీ బందా సూర్యానారాయణపంతులుగారు, బి. ఏ. ఎల్. టి. బెజవాడ.

,, శ్రీ పండ్రాజు వీర్రాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొవ్వూరి వేంకటరెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి వల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, పెనుగొండ.

,, శ్రీ అర్జి పెంటయ్యగారు, నరసాపురము.

,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మారుటేరు.

,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

,, శ్రీ పులగం వెంకన్నగారు, మారుటేరు.



# కృతజ్ఞతాభివందనములు.



ఇంతకుముందే నా రెండుగ్రంథములను దయతోఁ బ్రచురింప నియ్యకొన్న సరస్వతీగ్రంథమండలివారికిని, బ్రకాశకులగు లక్ష్మణస్వామి గారికిని నే నత్యంతకృతజ్ఞతాభివందనము లాచరింపవలసియున్నది. నా విషయమై ("Recommend") "రెకమెండు" చేయును,

"Dear Sir,

This is to introduce Balakavi Mr. A. Krishna-Swamy, talented brother of my young friend Mr. A. Yogananda Swamy, M. A; B. Sc; A. I. C , A. M. C. T., who is now in the Manchester University as Government of India Scholar... ... ... ... ... ... ... ... May I request you, if it is possible, to publish the novels in your 'Saraswati Grandha Mala' series and encourage an young scholar and a poet from the ceded Districts.

... ... ... ... ... ...

... ... ... .."

అని మిక్కిలి దయతో ఒక "ఇంట్రొడక్టరీ లెటరు" (Introductory letter) ను ప్రకాశకులగు లక్ష్మణస్వామినాయుఁడు గారికి వ్రాసిన రాజశ్రీ సర్వేపల్లి నరసింహులుపంతులు బి.ఏ.బి.యల్. గారికిని, మావృద్ధినిగోరుచు నాశీర్వదించి ప్రోత్సహించు నావకీలుగారి సోదరులగు రాయబహదూరు సర్వేపల్లి నరసింహారావు బి ఏ. గారికిని, మాసహాధ్యాయులై యున్నతవిద్యల నభ్యసించుచుండిన వారిపుత్రులకు మే మందఱము గృతజ్ఞతను దెల్పుచున్నాము.

తాను సీమదేశమందుండియే నాకవితాప్రదర్శనమున కమితము గాఁ బ్రోత్సహించుచు, నాకును మఱియొకతమ్మునకుఁ జెన్నపట్టణమున ప్రెసిడెన్సీకాలేజియం దున్నతవిద్యలను జెప్పించుచున్న మాయగ్రజుఁ డగు యోగానందస్వామి యం. ఏ., బి. యస్‌సి, ఎ. ఐ. సి., ఎ. యమ్. సి. టి. గారికిని, రామునకు లక్ష్మణునివలె నాభక్తిప్రేమలను వెల్లడించుచు శ్రీరామునివలెనే దేశయాత్రలు త్వరగా ముగించుకొని స్వదేశమునకు క్షేమముగా వచ్చి దిగంతఖ్యాతి నాచంద్రార్కముగ నిలుపుఁగాక ! యని యీశ్వరునిఁ బ్రార్థించెదను. నాప్రేమను వెల్లడించుచు నన్నవరుస యనినైనఁ బాటింపక, నాద్వితీయకావ్యకన్య నాతని కిచ్చియుంటిని. సంఘమువా రాక్షేపింపకుందురు గాక !

నే నింతకుముందు రచించిన రెండుగ్రంథములు సరస్వతీగ్రంథ మండలివారిచే నింకను బ్రకటింపఁబడకముందే, యిది వ్రాయఁబడుటచే దీని మిక్కిలి దయతో స్వీకరింప నియ్యకొన్న శ్రీ వేంకటపార్వతీశ్వర కవులలో నొకరగు కవిరాజహంస వోలేటి పార్వతీశముగారికి నే నెట్టి కృతజ్ఞతను జూపవలయునో తెలియకున్నాను.

ఆంధ్రనవలాపితామహులనఁదగు శ్రీ కవులయెదుట నాయీ యల్పప్రయత్నమునకు సిగ్గుపడియు, వారి యాదరణముక్రిందట నా భాషాసేవను జూపుచు, వంటివారు ప్రకాశకులుగా నాగ్రంథము ప్రకటింపఁబడుట కెంతయు మురియుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.

*

# ఒక మాట

పాఠకమహాశయులారా!

నవీననాగరికపాఠకులగు మీలో నూటి కొకరైన నాంగ్ల భాష రానివారుండరు. నానానవలాగ్రంథపఠనకుతూహలులరగు మీర లేగ్రంథకర్త "ఒరిజన"లో, ఏగ్రంథకర్త „కాపీమాస్టరో" యని తెలిసికొనఁగలయంతటి విమర్శకాగ్రగణ్యులరై యుందురని, నేను నట్టివారిలో నొకఁడనౌటచేఁ దలంచుచున్నాను. కొందరు కీర్తికొఱకో, తమచాతుర్యము చాలకనో, ప్రసిద్ధగ్రంథకర్తల ననుసరించుచున్నారు. అట్లనుసరించువారు „మేము వీరిని వీరిని అనుసరించితి" మని చెప్పుకొన్నచో వారి గంటేమిపోయినది? అంతటితోనైన నూరకుండక లేనిపోని "ఒరిజినాలిటి"ని తమకుఁ గూర్చుకొని „నాది నాది" యని నటించుట యిప్పుడు ప్రబలమైయున్నది. ఎవరిదైన నిట్టివారిపుస్తకమునుగూర్చి నామిత్రులతో ముచ్చటించునప్పుడు „ఇదొక 'ఇమిటేషన్ సిల్కు'" అని నవ్వెడివాఁడను. ఇట్టివికారములనే యనేకములను జూచి „నేటికాలపుకవిత్వం" అను విమర్శకగ్రంథములో శ్రీ అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరుఁడు పలుమారు నవ్వుచున్నాఁడు.

ఇది యొక గొప్పనేరము కానేరదని యిప్పుడు గ్రంథచౌర్యమునకు నేనును గడంగుచున్నాను. కాని యీ నేరమునకుఁదోడుగా „ఒరిజినాలిటి"ని నటించుటకై యసత్యమాడి నాదోషమును ద్విగుణీకృతము

చేయఁదలఁపలేదు. అసత్యమాడినను విమర్శకులకంటఁ బడక తప్పించు కొనలేను.

ఆన్థొని హోప్ (Anthony Hope) అని ప్రసిద్ధాంగ్లనవల కారులతో నొకఁడు. ఈవాఙ్మయోద్ధారకుఁడు సృష్టించినగ్రంథరత్న ములలో "The Prisoner of Zenda" అను నవల సుప్రసిద్ధమైనది. దీని నిదివర కెవరైన నాంధ్రీకరించినారో లేదో నేనెఱుఁగను. నేనైనను దీని నిప్పుడు క్రమముగా నాంధ్రీకరింపఁదలఁపలేదు. ప్రధాన కథను మాత్రము గైకొని యిచ్చవచ్చినట్లు మార్పులుచేసి వ్రాయనెంచితిని. ఎట్టి సమర్థుఁడైనను మూలమునందువలె తర్జుమాలో రసమును బోషింప లేఁడనుట నిర్వివాదాంశము. ఇఁక నల్పజ్ఞులగు నాబోటివారలు రెంత కృతకృత్యులు కాఁగలరో ప్రగల్భములకుఁ బోక, దాపరికములేక తథ్య మునే ఒప్పుకొనుచున్నాను.

ఈమహాత్ముఁడు రచించిన యీనవల హాస్యముతప్పఁ దక్కిన యెనిమిదిరసముల నోలలాడుచున్నది. అంతమాత్రమున నిది "Serious book" అని తలఁపరాదు. నిద్రాహారములను మఱచి చదువనుత్సాహ ముఁ, జదువఁ జదువ నాశ్చర్యము, నాశ్చర్యములో భయము, భయ ములోఁ గ్రోధముఁ, గ్రోధములోఁ గరుణఁ గల్గించి కడకీభావములన్ని యుఁ బిచ్చియనియు, మిక్కిలి ప్రాపంచికమనియు, నీచిత్తచాంచల్యము దుర్బలులకే యనియు, మనస్థైర్యముగల ధీరులు నిశ్చంచలులనియుఁ దుదకీగ్రంథము మహార్థమైన ప్రపంచతత్వమును దెలుపుచు వైరాగ్యము నుపదేశించును.

ఇట్టిభావములను నాప్రియపాఠకులహృదయములలోఁ బాదుకొల్పఁ గలనో లేనో శక్తి వంచనలేకుండ మనసార ప్రయత్నించి చూచెదను.

కృతకృత్యుఁడను గాలేకపోవుచు నమూల్యమైన మూలగ్రంథమును మనభాషలో స్థిరపఱుపఁదలఁచి వజ్రమునకు మెఱుగుపెట్ట వహ్నిలోవైచినట్లు విఫలమనోరథుఁడనైనను బాఠకులు మన్నించి పునః ప్రయత్నమున కుత్సాహపఱతురుగాక !

ఇట్లువిధేయుఁడు,

గ్రంథకర్త.

# అమ్మపదపద్మముల కిద్ది యంకితంబు.

శ్రీ మొదలు గాఁగ ముగురమ్మ • లీమె యని
పొగడ లోకులు లోకసం•పూజ్య యయ్యెఁ;
"దల్లికంటెను దైవంబు • ధరణిఁ గలదె?"
యనుచు మేమొనర్చెడిపూజ • లందె నామె.

లోకపూజితయై యయ్యె • లోకమాత,
లోకమాతయె మాకిష్ట • మాత యయ్యె,
తల్లియందు దైవంబందు • నుల్లసిల్లు
భక్తి నొక్కెడఁ గూర్చెడు • భాగ్య మొదవె.

అట్టిభాగ్యంబు గ్రహియించి • యమ్మ నొక్క-
పూటయైనను గొలువక•ముందె మృత్యు
దేవతకు నామెబలిపెట్టె • దేవుఁడకట!
ఈశునకుఁ దల్లిఁబూజింప • నీర్ష్య తగునె?

తల్లి మరణించుసమయానఁ • దప్పటడుగు
లిడెడుపసిబాలురము మేమి•సీ! విధాత!
జననిఁ జూచినట్లైనను • జాడ లేదు,
తల్లిబిడ్డల నెడఁబాపఁ • దగునె నీకు.

ఏది యెట్లున్న మాభాగ్య • మింతె యనుచు,
సుస్వరూపము తల్లిది • శూన్య మైన,

నా జ్ఞాపకమే యెద ♦ నవధరించి,
పూజ లిడెదము మేము సం♦పూర్ణమతుల.

*　　　*　　　*　　　*

*　　　*　　　*　　　*

సంతానవాంఛచే ♦ సద్భక్తిఁ బలుదేవు
　　　లను గొల్వఁ మోదంబుఁ ♦ గనినతల్లి
ఆ దేవునందు నా♦యాతీర్థములయందు
　　　నన్నృతసత్యముల గ♦న్గొనినతల్లి
తనయులు గలుగ లే♦దని వంతఁ గుందుచుఁ
　　　గ్రితువుల వ్రతములఁ ♦ గన్నతల్లి
ఇది కర్జమా కాద? ♦ యెద్దాన సంతాన
　　　పీడయో యని దేవు ♦ వేఁడుతల్లి—

కాదు కేవలనుతులు, వి♦ఖ్యాతయశులు
ధీరులు సకలవిద్యావి♦శారదులును
నిట్టి మాముచ్చటను జూడ ♦ నెంచ కపుడె
యమరపురిఁ జేరె మమ్ము దుః♦ఖాబ్ధి ముంచి.

ఆమె పుత్రిలమై పుట్ట ♦ నఖిలజన్మ
ఫలముచేతనె యని మేము ♦ పలుక నిచట,
నిట్టిసత్పుత్రిలను బొంద ♦ నేమినోచి
తినో యనుచు నామె తనవారి ♦ కనునో యచట!

తల్లి విడలిపోయిన మేము ♦ తలఁచుకొందు
మమ్మ యమ్మ యటంచు, న♦ట్లమ్మ మమ్ముఁ
దలఁచుకొనుచుండు నని యెంచి ♦ ధైర్య మూని
చింతలను దోలి యెపుడుఁ బ్రా♦ర్థింతు మామె.

ఇంతమాత్రాన మాతౄణ ♦ మెట్లు దీరుఁ;
చాలునే వేయికోట్లజ♦న్మాలు, గాని
కొండ నర్పింపఁ గొండంత ♦ కుంకుమేల ?
కానఁ జేతుము మాశక్తి ♦ గలకొలంది.

ఆతలఁపువలపుచేతను
జేతంబు ముదంబు నందఁ ♦ జేతున్ దీనిన్
మాతృవరచరణసరసీ
జాతంబుల కంకితముగ ♦ సద్గతికొఱకై.

" సప్తసంతానములలోఁ బ్ర♦శస్తిఁ గాంచి
ఫలము గాకుండునది ధాత్రిఁ ♦ గృతియ కానఁ"
గృతి సమర్పింతు మాతృపం♦కేజపాద
ములను దాచి మదీయహృ♦త్తలబిలమున.

మాతృదేవతకు లభించుఁ ♦ గాత శాంతి !
మాతృదేవత యానంద ♦ చేత యగుత !!
మాతృదేవత జన్మసా♦ర్థత యగుత !!!
మాతృదేవత పరివిమల ♦ జ్యోతి యగుత !!!!

---

ఓం

# భగ్నహృదయుఁడు



## మొదటి ప్రకరణము



"పరులతల్లి పోయి - పరమాన్నమునకన్నఁ
గన్నతల్లి పోయి - గంజి మేలు." (ఒకకవి.)

"రమణిచూపులు తూపు - లమరులె మరణింతురి,
యముఁ డంగజుఁడె కాఁడ చిలుకా?
మము నిట్లు బాధింపఁ గడకా
యముఁ డంగనయె చూవె చిలుకా!
విమలముఖాలె గా - వించుదుర్మాయల!
వెఱ్ఱిపురుషుఁబట్టఁ జిలుకా!
విమలలే రమణులు చిలుకా?
విలయస్వరూపలేచిలుకా!

* * * * "

అని పాడుచు నొకయావనపురుషుఁడు రమణీయోద్యానవనము ధ్యమున హంసతూలికాడోలికయం దూగుచు, నానాపక్షి[illegible] ములఁ జూచి యసూయపడుచుఁ దపించుచుండెను. [illegible] నుం డలికొమ్మలనుండి వ్రేలాడువనుపు బంగా[illegible] ర్పఁబడిన మఃశినయహంసతూలికాడోలికయు [illegible]

చ్చుచు, మహేంద్రుఁ డిచ్చట విహరించుచుండె నోకో యని భ్రమింపఁ జేయుచుండెను.

ఆపురుషుఁ డించుమించుగ నిరువదియైదేండులవాఁడై యుండును. అతనిముక్కు చక్కఁగా నెత్తుగా పొడవుగాఁ, గొనయం దించుక వంకరగా రక్తవర్ణముగా నుండి చూచువారికి మనిషియంతచిలుకముక్కెట్లుండునేమో యని యాశ్చర్యము గల్గింపఁ జేయును. అతనిముక్కు మాత్రమే కాదు. అతనిశరీర మంతయుఁ గడకతనిచెంద్రుకలుసైతము రక్తమం దద్ది తీసినట్లుండెను. అంతమాత్రమున నతఁడు వికారాంగుఁ డని తీర్మానింపలేము. అతనిముఖము ధైర్యము, గాంభీర్యము, శమము, దమము, ప్రసన్నత్వము, సాధుత్వము, సద్గుణరాసు లన్నియు నందుఁ గుప్పింపఁబడినట్లు నిరంతరము వికాసవంతమై యెంతయు నాకర్షణీయముగ నుండెను.

అతనిపేరు విక్రమసేనుఁడు. ముక్కునుబట్టి శుకముఖుఁ డనియు వ్యవహరింపఁబడుచుండెను. అతఁడు లంకాధిపతి యగుఘోరసింహుని తమ్ముఁడు. ఘోరసింహుఁడును, విక్రమసేనునకువలె ముక్కంతగా వంకర లేకుండినను శుకముఖులసంఖ్యలోఁ జేర్పఁదగినవాఁడే. ఘోరసింహుఁ డించుక కందికాంతిహీనమైన రక్తవర్ణముగలిగి యుండును. అతని వెండ్రుకలుమాత్రము తమ్మునివలెఁ గాక నల్లగానే యుండును. ఘోరసింహుఁ డైదున్నర యడుగులెత్తుండును. విక్రమసేనుఁ డాఱడుగుల రెండంగుళముల పొడవుండును. ఆయన్నదమ్ములరూపములో భేదమింతే.

అదేమిచిత్రమో గాని వీరి తండ్రియుఁ దాతయు నంతకు రెండుతరములపూర్వులును నిట్లే శుకముఖులై యుండినట్లు లంకాపురరాజసౌధమందలి తద్ద్వీపపాలకులచిత్రపటములు చూపుచుండెను. లంకాద్వీప

రాజపుత్రులలోఁ దరతరమున కొకరిద్దఱిట్లు పుట్టుటకుఁ గారణము చెప్పుచిత్రకథ యొకటి కలదు.

సుమారు నూఱేండ్లకుఁబూర్వ మమరసింహుఁ డనునాలంకాపట్టణపురాజు రాజకార్యములకొఱకుఁ గాశ్మీరదేశమున కేఁగియుండి యాదేశపురాజకుమారిని మోహించెను. ఆమెయు నితనిమోహించెను. ఆమెపేరు ప్రభావతి. ఆమె తలిదండ్రులామెను గౌడదేశరాజపుత్రున కీయఁదలఁచి సుముహూర్తముకూడ నిర్ణయించి యుండిరి. నిజమైన రాజపుత్రి యగునామె, మనమును హరించినమనోహరునే స్వయంవరమున వరింపఁ దలఁచి, తనకు వ్యతిరేకులై యున్న తలిదండ్రులు తనకొరికను గొనసాగనీయ రని యెఱిఁగి, యమరసింహునివెంట లంకకుఁ బలాయన మయ్యెను. అచ్చట వారిరువురును పెండ్లి చేసికొనిరి. కాశ్మీరదేశపు రాజసంతతిలోఁ దరతరము నొకొక్కరైన శుకముఖులు పుట్టుట తప్పకుండె నఁట. ఆశుకముఖులలోఁ బ్రభావతి యొక్కతె. ఆమెను పెండ్లియాడుటచేత నమరసింహునిసంతతియందును శుకముఖులు ప్రభవించుచు వచ్చిరి. ఇది కథగాఁ జెప్పఁబడుచున్నను గాశ్మీరరాజసంతతియందును, లంకాధిపతిసంతతియందును శుకముఖులను దఱచుగాఁ జూచుచుండుటవలన మనము దానిని విశ్వసింపవలసివచ్చును. లంకాపట్టణమందలి రాజసౌధమందుఁ గలపూర్వులచిత్రపటములలోఁ బ్రభావత్యమరసింహులకు ముందు శుకముఖులు లేరు. చిలుకముక్కుప్రభావతితో మొదలు రక్తవర్ణశుకముఖులు తరతరమునకు వెలువడుచుండిరి. ఆకథాలథ్యమున కిది యొకప్రబలనిదర్శనము.

ఆకారణముచేత లంకాపురరాజసంతతియందలి శుకముఖు లందఱుఁ దమకు మూడినవికారమునకు మూలమగుప్రభావతిని నిందించి ద్వేషించుచుండిరి. వా రామెను ద్వేషించుటకు మఱియొకకారణ మామె

తమమూలపురుషుని వెన్నంటి వచ్చినకారణమున వారిపాపము సంతతి కంతకు నలముకొనెననియే. కాని యింతవఱకు శుకముఖులలో విక్రమసేనుఁ డొక్కఁడే తమమూలపురుషులను ద్వేషింపనివాఁడు. మీఁదు మిక్కిలి ప్రభావతీపటము నాతఁడు ప్రతిదిన మర్చించుచుండును. శుకముఖు లందఱు మూలమూర్తియగు ప్రభావతి కింతో యంతో మారి పుట్టుచుండిరి గాని విక్రమసేనుఁడు పురుషవేషమున నున్న ప్రభావతియే. అందుచే నాతఁడు మూలమూర్తిపై నంతభక్తి గల్గియుండనోపు. ఏది యెట్లున్నను నాతఁడు అమరసింహు నంతటిధీరరాజును మోహపెట్టిన ప్రభావతివంటి రూపముగల విక్రమసేనుఁడు. భిన్నరూపుఁడు కాఁడు, రూపహీనుఁడుకాఁడు—సర్వాంగసుందరుఁడు కాకపోయినను మనోహరుఁడే యని మన మొప్పుకొనవలయును.

ప్రభావతిని సూర్యప్రభకంటె నెక్కుడుగా ద్వేషించినవా రుండరు. సూర్యప్రభ లంకకు రాణి. ఘోరసింహునిభార్య. విధివశమునఁ దాను లంకాపురరాజ్ఞియగుటచేఁ బ్రభావతికతమునఁ దనకుఁ గల్గు సంతానమందును, శుకముఖులు తప్పక కల్గుదురు కదా యని యీమె ద్వేషమునకుఁ గారణము. ప్రభావతి పోలికలుగల తనభర్తనే సూర్యప్రభ యేవగించుచుండెను. అట్టిచో విక్రమసేనునిపై నామెకుఁగల యసహ్యాభావమును వేరుగా వర్ణింపనక్కఱలేదు. సూర్యప్రభ సూర్యప్రభవలెఁ దీక్ష్ణమైనది. విధికార్యమునకు వారిపై వీరిపైఁ గోపించుకొన్ననేమి లాభము? తాను ప్రబలముగా ద్వేషించి యసహ్యించుచుండిన ప్రభావతీపటమును విక్రమసేనుఁడు ప్రేమదృష్టులఁ జూచుచు నర్చించుచుండుట సూర్యప్రభను మండించుచుండెను. కారణములేక యీయమాయకునిపై నీమెకు జనించినయసహ్యాభావ మీకారణమున ద్విగుణీకృత మయ్యెను. ఆమె విక్రమసేనునియెడఁ గ్రపముగా దుర్నీతిమై

పోవుచుండెను. కారణ మేమి ? నీచులు కారణములేని పగవారుకదా ?
నేనితని నెందులకు ద్వేషించుచున్నా నని యామె తన్నుఁ దాఁ బ్రశ్నిం
చుకొన్న, నామెయుర్మతి యామె యంతరాత్మ కెట్టిసదుత్తరమును నీయఁ
జాలదుకాఁబోలు !

భర్తకు లేనిపోనికొండెములు చెప్పి, యన్నదమ్ములకు విరో
ధముఁ గూర్చి విక్రమసేనునిఁ దుదముట్టింపనో, యిలువెడలఁగొట్టిం
పనో యోచించుచుండెను. ఆహా ! రాక్షసక్రౌర్యవహ్నిలోఁ బడియు
బ్రతుకవచ్చుఁ గాని, నారీపిశాచక్రౌర్యమునుండి విమోచనమే లేదు.

విక్రమసేనుఁడు మహారాజసూనుఁ డైననేమి? రాజసోదరుఁడై
నేమి? సౌధాంతర్భాగమున నివసించిననేమి ? దివ్యవనముల విహరించిననే
మి? మృష్టాన్నము భుజించిననేమి? ఇన్ని యుండియు నతనిమనసునకుశాం
తము లేక సౌఖ్య మెక్కడిది ? ఐనను గల్లోలవిజృంభితం బయ్యుఁ
బ్రశాంతముగా గంభీరముగా నుండు సముద్రునివలె నతనిముఖము కల
కలలాడుచుండెను. ఎంత శాంత మూనినను నిట్టిపరిస్థితు లెట్టిధీరచిత్తుని
కైన, నెట్టిలౌకికునికైన వైరాగ్యమును బుట్టింపక పోవు. తండ్రి మర
ణించి యెదేండ్లైనది. తల్లి యెప్పుడు గతించెనో యాతఁ డెఱుఁగఁడు.
రాజైన అన్నయు, రాణియైన వదినెయుఁ దప్ప నాతనిబాగుకొఱ కాలో
చించువా రెవ్వరును లేరు. అట్టివారే యతని ద్వేషించుచుండిరి. రాజ్య
మును దుచ్ఛముగాదలఁచు విక్రమసేనుఁడు రాజ
గలహించువాఁడు కాఁడు. ఐన నాతనిగతి
విక్రమసేనుఁడే యోచించుకొనలేదు.

,, శాంతినికేతన మగుకుటీరమైన
తల్లియొడిలో శాంతి ననుభవించుచు

లియో త్రాగి నిశ్చింతులై యుండు బీదలే వేయిరెట్లు సౌఖ్యవంతులు. ప్రపంచమందు సుఖించి చింతలేనిజీవనము చేయవలె నన్నఁ దల్లియో భార్యయో యుండవలెను. నన్ను నేనే భరించుకొనలేను. భార్య నెట్లు భరింపఁగలను? ఆహా! మనుష్యజన్మమే నీచమైనది. మూర్ఖులెవరో మానవజన్మ ముత్తమ మనిరి కాని యది యసత్యము. ఇంకను నీచులైనవారు స్త్రీలు. తల్లి నీచురాలైనను బిడ్డలను ప్రేమించునదియే. నిజముగాఁ దన్నుఁ బ్రేమించు నర్ధాంగిని బొందుట పురుషుని పుణ్యఫలము" అని యాతఁడు యోచించుచుండును.

"అఖిల దుఃఖరోగార్తున • కౌషధంబు
సురుచిరంబుగ భార్యయె • చూపె నెందు"

అని తలఁచి సద్గుణవతి యగుసతి "అర్ధంభార్యామనుష్యస్య భార్యాశ్రేష్ఠతమాసఖా" యని పూజ్యు లన్నట్లు తనమనోవేదన నుపశమింపఁజేయ సమర్థయె భార్య శాంతి నొసఁగు నేమో యని యాతఁ డాశించుచుండెను. అందుచే నతఁ డనేకరాజపుత్రికలపటములను జూచెను. యువకుఁ డగునాతనికిఁ గన్యలందఱు మనోహరముగానే కన్పట్టిరి. కాని వెన్వెంటనే కోమలముఖులకుటిలహృదయములను దలంచుకొని యాతఁడు కంపించెను. "వదినె యెంత సుందరియో యంతనీచురాలు.

యతఁడు దృఢమైన తీర్మానమునకు వచ్చెను.

గాని రెండుకారణములచే నతఁడు సాహ

ముల ననుభవించిన యాతఁడు కఠోరస

? రెండవది యువకుఁ డగునతఁ డింద్రి

ఖముల రుచియైనఁ జూడకయే యెట్లు

కాని యతఁడు మనుష్యుల నంతటిని, గడకుఁ దన్నుఁ దానే యసహ్యించుచుండెను. స్త్రీలమనోహరాకృతికిఁ బట్టుబడును గాని యాతఁడు వారి నంతకంటె నసహ్యించుచు నమ్మఁజాలకుండెను. వివాహ మాడినను భార్యతో నాతఁ డేమిసుఖ మనుభవింపఁగలఁడు? తనమూలమున భార్యను గష్టపెట్టుట తప్ప మఱేమియు ప్రయోజనము లేదు. ఇట్టిసందర్భములందుఁ గానున్నది కానిమ్మని విధిపై భారము వైచి, తనదుఃఖమును విహారములందును, సంగీతమునందును, ప్రకృతి పరిశోధనలందును మఱవ యత్నించుచుండెను.

మనము ప్రకరణారంభమున విన్నగానము నాతఁడు వీణెయపైఁ బాడుచుండెను. అశుకముఖుఁడు తనకు భార్యకాబోవు చిలుక నుద్దేశించి తనచపలత్వము నొప్పుకొనుచు, నట్టిండియు స్త్రీవైముఖ్యమును బ్రకటించుచుండెను.

అతఁ డట్లు పాడుకొనుచుండఁగా సూర్యప్రభ వచ్చెను. వది నెను జూచి విక్రమసేనుఁ డుయ్యెల దిగి నమస్కరించెను.

సూర్యప్రభ తనసహజతీక్ష్ణదృష్టులను బఱపుచు "గవ్వకువిలువ యైనపనినైన నీవెప్పుడు చేయఁగలవో యని యాలోచించుచున్నాను" అనెను.

"అక్కా! ఆయీపనిని గల్పించుకొను నంతటియవసరము నాకేమి వచ్చినది? రాజద్రవ్యమునుండి నాకు తగినంతధనము వచ్చుచున్నది. రాజైన ఘోరసింహునితమ్ముఁడను. రాణియైన సూర్యప్రభాదేవికి మఱఁదిని. ఇంత చాలదా?" అని విక్రమసేనుఁడు సవినయముగాఁ బలికెను.

"ఇరువదియైదేండ్లవాఁడ వయ్యు సోమరిగా నుండుట తప్ప నొక్కపనియైనఁ జేయనేరవలేదు."

" లంకాద్వీపరాజసంతతివారేవనియుఁ జేయునక్కఱలేదు"

" భార్యల నపహరించుపని తప్ప వేరుపని లేదుకాఁబోలు. మీకాదిపురుషుఁడు తప్పక రావణుఁడే యైయుండవలెను. అతఁడు సీత నపహరించెను. మీపూర్వుఁడగు వమునసింహుఁడు కాశ్మీరరాజపుత్త్రి యగుప్రభావతి నపహరించెను. నీవును నట్టిచేఁతకే యోచించుచున్నావు కాఁబోలు. "

తనవంశమును నిందించుచున్న యామె పలుకులను సహించుకొని విక్రమసేనుఁడు తల వాల్చి యూరకుండెను.

" అదృష్టవశమున నాకొఱవిదయ్య మగుప్రభావతివలెఁ గాక మీయున్న వెండ్రుకలు నల్లగానుండుట కెంతయు సంతసించుచున్నాను." అని యామె పలికెను.

" ఏన నా వెండ్రుకల నసహ్యించుకొంటివా ?" అని విక్రమసేనుఁ డనెను. ఇంతలో ఘోరసింహుఁడును వచ్చి " ప్రేయసీ ! ఏమిసమాచారము ? " అని ప్రశ్నించెను.

"నాకెఱ్ఱవెండ్రుక లున్నవని యాక్షేపించుచున్నది." అని విక్రమసేనుఁడు నుడివెను.

" పాప మతఁ డేమిచేయఁగలఁడు ? తరమున కొకనాఁటైన నెఱ్ఱవెండ్రుకలు, నిట్టిముక్కు మొలకెత్తుచుండును. నాకంటె, నిట్టివారి కందఱికంటె నెక్కుడుగా మూలమైన మొలకరీతిగానే యితనిముక్కును వెండ్రుకలును ముద్రితమై యున్నవి. " అని ఘోరసింహుఁ డనెను.

" అవి తిరిగి మొలకెత్తరాదని ప్రార్థించెదను " అని సూర్యప్రభ యసహ్యభావముతో ననెను.

" నేనుమాత్రి నిట్టిముక్కును వెండ్రుకలను మిక్కిలి ప్రేమిం

చుచున్నాను. ” అని పలుకుచు విక్రమసేనుఁడు తానర్చించుచుండిన ప్రభావతీపటమును దీసి నమస్కరించెను.

" ఆపటమును తత్క్షణమే తుక్కులోఁ బాఱవేయవలెనని నాకోరిక. ” అని సూర్యప్రభ పలికెను. ఆదిమూర్తియగు ప్రభావతిని నిందించినందుకు విక్రమసేనుఁడు నొచ్చుకొనెను. ఘోరసింహుఁడును నించుక కోపగించుకొనెను. కాని యిరువురు నేమియు ననలేక మౌనముతో నుండిరి.

" మాతండ్రియైన విదేహదేశాధిపునికడ నుద్యోగ మిప్పింతును పోయెదవా ? ” అని సూర్యప్రభ విక్రమసేనుని బ్రశ్నించెను.

" మహారాజసంజీవనసింహతనూజుఁడ నయ్యు, రాజాధిరాజ ఘోరసింహుని సోదరుఁడ నయ్యుఁ బరుల సేవింపవలయునా ? ” యని విక్రమసేనుఁడు కన్నీటితోఁ బలికెను. విక్రమసేనుఁడు తనతండ్రిని దిరస్కరించి యంతగొప్పవాని సేవించుభాగ్యమైనఁ దలఁపకుండె నని సూర్యప్రభ కోపానలకషాయనేత్రయై,

" అట్లైన నెట్లు బ్రదుకఁదలఁచితివి ? ” అనెను. విక్రమసేనుఁ డదరిపడి యామెవంకఁ జూచెను. ఇట్లామె మాటాడు నని యాతఁడు కలనైనఁ దలఁపలేదు.

" నాసోదరుఁడు నన్ను భరింపలేకపోఁడు. ” అని యతఁడు మెల్లగాఁ బల్కెను.

" ఇఁక ముందు నీసోదరుఁడు నీకొకకాసైన నొసఁగడు ! తెలిసినదా ?”

మానవంతుఁడగు క్షత్రియకుమారుఁ డాఁడుది యొకర్తుక యిట్లు తన్నుఁ బరాభవించుచుండ నెంతని యోర్చుకొనఁగలఁడు ? విక్రమసేనుఁడు గంభీరముగా " అట్లైన మాయన్నరాజ్యమం దర్ధభాగ మివ్వ

వలసివచ్చును." అనెను. ఇంతవఱకూరకుండిన ఘోరసింహుఁడు, ,, ఓరీ! నాయెదుటనే యిట్లు మాటాడుచుంటివఁటరా?" యనెను. ,, ఏయపరాధ మెఱుఁగనినన్ను భార్య పరాభవించుచుండ నింతవఱ కూరకుండి యామెకుఁ దగినప్రత్యుత్తరము నేనియ్య నీవు నాపైఁ గోపించుచుంటివి. అన్నయ్యా! ఇది నీకుఁ దగదు. స్త్రీమాయలోఁ బడిపోవుచున్నావు. చక్కఁగా యోచింపుము" అని యట నిలువనేరక యశ్రులు రాల్చుచు విక్రమసేనుఁడు వెడలిపోయెను.

---

*

# రెండవప్రకరణము

"కారణములేని పగవారు గారె తలఁప ?" (భర్తృహరి)

"నాకేమోకాని మీతమ్ముని జూచిన నొడలు మండిపో వుచుండును." అని సూర్యప్రభ నాథుఁ డగు ఘోరసింహునితోఁ బలికెను.

"పాప మాతఁ డేమియపరాధ మొనర్చెను ? అతఁ డచ్చముగ ప్రభావతిని బోలియుండుటేనా నీయసహ్యాభావమునకుఁ గారణము ?" అని ఘోరసింహుఁ డామెను బ్రశ్నించెను.

"రూపమునఁ బ్రభావతిని బోలియుండుటమాత్రమే కాదు? గుణమునందును నామెను బోలియున్నాఁడనే నాకుఁ గోపము."

"ప్రభావతిగుణమందు లోప మేమైనది యెవ్వ రెఱుం[illegible] అది రమారమి నూఱుసంవత్సరములమాట క[illegible] !"

"ఆమెగుణలోపము జగద్విఖ్యాతమే యైయున్నది. తనకు నిర్ణయించినపతిని విడిచి మీపూర్వుఁ డగు నమరసింహునితో లేచి వచ్చుట మీ రెఱుఁగనట్లు చెప్పెద రేమి ?"

"అది యామెగుణమున కెట్టిలోపము నాపాదించుచున్నది ? అది స్వయంవరధర్మము కదా ? మనక్షత్రియులలో నది క్రొత్త కాదు. తప్పైనను నది విక్రమసేనున కెట్లన్వయించుచుండె నని తలఁచెదవు ?"

"అతఁడు రాత్రి పగలు "చిలుకా ! చిలుకా !" యని స్త్రీ స్మరణనిమగ్నుఁడై యున్నాఁడు."

"అతఁడు సంగీతప్రియుఁడు. పాటలు పాడుకొని యుండిన

చ్చెను. నీవు చెప్పిన ట్లనుకొన్నను నాతఁడు యువకుఁడు కాఁడా !”

“యువకుఁడైనఁ బరకాంతలను గలవరింపవలయునా ?”

“అట్లని నీ వెట్లు చెప్పఁగలవు ?”

“తగిన యాధారముతోడనే.”

“అట్లైన నతనికిఁ ద్వరలో వివాహము చేయవలయును.”

“అంత పనికిమాలినవాని కెవ్వరు పిల్ల నిత్తురు ?”

“ఏమి ?”

“ఒక పైసయైన సంపాదించుయోగ్యత వానిముఖమున లేదు. కడకు ఖడ్గాశ్వారోహణాదిరాజోచితవిద్యలును వానికి రావు. ఎప్పుడు నాపేడివిద్య లగుపించు, పాట తప్ప మఱేమిటుకిఁ గొఱగాఁడు.”

“ఏమైనను నతఁడు నాసోదరుఁడు కదా !”

“అంతమాత్రమున వానికేమిలాభము ? మాసామ్రాజ్యములో నొక కాసైనను ననుభవించుట కాతనికి హక్కు లేదు. చూచితిరా ! వాఁ [illegible]ంకాలము మారాజ్యము దర్ధభాగముఁ గొందు నని యెంత నిష్ఠురముగా మాయెదుటనే యనెనో. అతనిని మనకడ నుంచుకొనుట విషసర్పమును బెంచుకొనుటయే. నేననేకగూఢచారులమూలమున నీసంగతిఁ గనుఁగొనుచున్నాను. లేకున్న నాకాతనిపైఁ గినుకయేల ? సవతి కొడుకనియా ?”

ఘోరసింహుఁడు ప్రత్యుత్తర మియ్యక యోచించుచుండెను. సూర్యప్రభ యీసునకుఁ గారణము విక్రమసేనుఁ డిప్పు డడుగకున్న మఱెప్పుడైన రాజ్యభాగ మడుగవచ్చు ననియు, నతఁ డడుగకున్నను నతనికి సుతులు జనించినప్పుడైనఁ జిక్కు సంభవింపవచ్చు ననియు, నాకారణముననుండిన స్వల్పరాజ్య మిప్పుడే వీరిమధ్యనే భిన్నభిన్నమైనఁ దనసుతులకేమి మిగులు ననుసవిస్తృతదురాలోచన మగుదురాలోచ

నము. అందుచే నింతవఱకు విక్రమసేనునిఁ దన యెదుటనుండి తొలఁగింప నెంచుచుండిన సూర్యప్రభ యిప్పు డాతనిఁ దుదముట్టింప యోచించుచుండెను. విక్రమసేనుఁ డిప్పుడు వెడలిపోయినను మఱెప్పుడైన నతఁడో, యతనిసంతతియో మఱలఁ బిశాచములవలె దండెత్తి రావచ్చునని యామెభయము. ఆహా! దుశ్శీలలగు స్త్రీలమనస్సు లధోలోకపర్యంతము వ్యాపించియుండును.

తనమాయ ఘోరసింహునిపైఁ బ్రాకుచుండె నని యామె యసహ్యానమిధల నింకను రగుల్చుచుండెను.

„ఇంతవఱ కాతఁడు కేవల దుర్మార్గుఁ డని యెంచి యిచటినుండి వెళ్లఁగొట్టినఁ జాలు నని యనుకొనియుంటిని. కాని యతఁడు పరమదుర్మార్గుఁడై యున్నాఁడుసుమండీ! మిమ్ముఁ జంపి రాజ్యముఁ బట్టుకొని నన్నుఁ జేపట్ట నెంచుచున్నాఁడు. ఇది పరమరహస్యమైనవార్త."

ఆమాటకు ఘోరసింహుఁ డదరిపడెను. "చాడీ' మాట లెంత నఖ్యములైన బద్ధవైరమునకుఁ దీసికొని పోవునుగదా! సూర్యప్రభ యంతటితో నూరకుండ లేదు.

„నామాట కాధార మేమందురా? నిన్నరాత్రి యతఁడు 'హా! ప్రేయసీ! సూర్యప్రభా!' యని నన్నే కలవరించుచుండెను. నేవింటిని. ఇంతకంటె నీచమున్నదా?"

ఘోరసింహునితల తిరిగిపోయెను. తనమందు పనిచేసె నని యామె మరల నిట్లు చెప్పసాగెను.

„అతఁడు చోరుఁడుకూడను! నాయమూల్యాభరణములను గొన్నిఁటిని దొంగిలించి ధనగుప్తుఁడను వణిజున కమ్మినాఁడు. ధనము లేకపోయిన, నేను వెడలఁగొట్టెద నని భయపెట్టినను నిట్లు నిశ్చింతుఁడై

యుఁడునా ? ఇచ్చవచ్చినట్లు విచ్చలవిడిగా వెదచ్చించునా ? ఇంత ద
గా నింతకులాసాగా రాజైన మీరుకూడ నవలంబించునని యెవ్వ
వచునా ? ''

ఆమె కొండెపుమాటలు రాజున కుదు కెక్కించెను. అతఁడు
భార్యమాటలను బూర్తిగా నమ్మలేకపోయినను సందేహాస్పదమైన నిజ
యుండు ననియుఁ, గాకుండిన నిష్కారణముగా నెట్టిపగవానిపై నైన
నిట్టినింద లేల యారోపింపఁబడు ననియుఁ దలఁచి వెంటనే దానితత్త్వ
మును విమర్శింపఁ బూనెను.

ఈనిశ్చయముతో ఘోరసింహుఁడు ధనగుప్తుని రావించి త
తమ్ముఁ డతని కేమైన నమ్మెనా యని ప్రశ్నించెను. రాణిచే నింతకు
ముందే బోధింపఁబడినయాతఁ డౌననెను. అతఁడు మంచివాఁడే యైనను
రాణి కెదురునడిచి జీవింపఁగలఁడా ? అందులో, నిప్పుడే ప్రయోజకుఁ డగు
విక్రమసేనునికోపమునకు గురియైనను నతని కేమినష్టము ?

'' ఆయాభరణము లిప్పు డెవరియొద్ద నున్నవి ?'' అని రాజు
ప్రశ్నించెను.

'' మహాప్రభూ ! అవి రాణిగారికి ప్రియములైన వగుటచే
వారు బహుమానముతోసహా నేను కొన్నమూల్యము నిచ్చి పుచ్చుకొ
నిరి. '' అని వణిజుఁడు బదులుచెప్పెను.

'' ఆసొమ్ముల నమ్ముటకు నీయొద్ద కెవరు తెచ్చిరి ?''

'' విక్రమసేనునియనుచరుఁ డగుభయంకరుఁ డనువాఁడు. ''

'' విక్రమసేనుఁడే వాని నమ్మించెనని నీ వెట్లు చెప్పఁగలవు ?''

'' 'ఇవి విక్రమసేనమహారాజువి. ధర చక్కఁగా చూచి యిమ్ము'
అని భయంకరుఁడే నాతో చెప్పెను.''

'' నీకడ కాసొమ్ములు వచ్చె నని రాణిగారి కెట్లు తెలియును?''

"సొమ్ములు కనఁబడకపోవుటచేతనే రాణిగారు నన్నుఁ బిలువ నంపి, 'సొమ్ములు దొంగిలింపఁబడినవి. అవి తప్పక విక్రయమునకు వచ్చును. వర్తకుఁడు నీకడకే యవి వచ్చును. నీవు తప్ప వానిని కొనఁగలవాఁడు లేఁడు. అవి వచ్చినంతనే నాకుఁ దెలియఁజేయుము.' అని యాజ్ఞాపించినారు. నేనంత 'గొప్పవిలువఁగల యాభరణములు నిన్న విక్రమసేనమహారాజు అమ్మించెను. అవితప్ప నట్టివేవియు రాలేదు' అని చెప్పితిని. రాణిగారు వానిని తెప్పించి యవి తనవిగా గుర్తించెను"

ఘోరసింహమహారాజు రాణిని భయంకరుని బిలిపించెను.

"నీయాభరణములు పోయినప్పుడు వెంటనే నాకేల తెలుపరాదు?" అని రాణిని రాజు ప్రశ్నించెను.

"విక్రమసేనుఁడు నాయాభరణములను దొంగిలించెనని భయంకరుఁడు చెప్పువఱకు నాసంగతి నాకుఁ దెలియదు."

"భయంకరుఁడు చెప్పినపిమ్మటనైన నాకుఁ దెలుపలేదే?"

"దానితథ్యమును గనుఁగొనకుండగనే విక్రమసేనునిపై మీకుఁ గోపము గలిగించుమాట లేల చెప్పవలెనని యట్లు గావింపలేదు."

"ధనగుప్తునికడ నాభరణములను దీసికొన్నపిమ్మటనైన నాకా సంగతి తెలుపలేదే?"

"ఇట్టిదొంగను వెలికిఁ దెచ్చి రాజకుటుంబమునకుఁ దలవంపులు తేనాహాసింపలేనైతిని. కాని"

అని రాణి రాజుచెవిలో "ఆతఁడు నాధనమే కాక నన్నును మీరాజ్యమును నపహరింపఁదలఁచినప్పుడు భయముతో వడఁకి, పోక ముందె 'జోక' యని మీతోఁ జెప్పకొంటిని." అని చెప్పెను.

రాజు పట్టరానికోపముతో భయంకరుని బ్రశ్నించెను. వాఁడు భయమును నటించుచు, "మహారాజా! ఈవిషయము నానోట నేమా

త్రిము వెడలినను మాప్రభువు నాప్రాణములు దక్కనీయఁడు. పెద్ద ప్రభువుల రగుమీదగ్గఱ అసత్య మాడరాదు. మారాజుగారు కొన్ని సొమ్ములను నాచే నమ్మఁబంపిరి." అనెను.

నిరపరాధియయ్యును విక్రమసేనుఁడు భయంకరునివంటి భయంకరుల కాశ్రయ మిచ్చి యపరాధియయ్యెను. అహో! "క్రూరమన స్కులౌపతులఁ గొల్చి వసించెదు మంచివారికిన్, వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు" నను వాక్య మెంతతథ్యము! అధిపతులే కుటిలవర్తనకు రేపెట్టినప్పు డనుచరులు భయపడియు, భయముకంటె బహుమానమున కాశించియు దురాచారు లగుచుందురు. ఇట్టివారందఱు సత్పురుషులకుఁ గారణములేనిపగవా రగుచుందురు. భయంకరుఁడు యజమానునకు ద్రోహియై భయపడియు, ధనమున కాశపడియు రాణికి లొంగెను. విక్రమసేనునిపై రాణి మోపిననింద లొక్కటియు సత్యము కాదు.

రాజు మఱి విమర్శన మవసరము లేదని తలఁచెను. రాణిమాటలను బలపఱచునాతులను జూడఁగానే యాతని కామెమాటలందు సంపూర్ణమైన నమ్మకము కలిగెను.

కారణమును దెలుపకయే, విక్రమసేనుఁడు దేశభ్రష్టుఁ డగునట్లును, అట్లు దేశాంతరవాసియై పదేండ్లు గడుపవలెననియు నాజ్ఞాపత్రము విక్రమసేనున కందెను. అతఁ డించుక దిగ్భ్రమఁ జెందినను నాశ్చర్యపడలేదు. అది యెవనిపనియో తెలిసికొనెను. విక్రమసేనుని జంపినఁగాని సంతోషపడనిరాణి కీయల్పశిక్ష పూర్ణతృప్తి నియ్యలేదు.

# మూఁడవ ప్రకరణము



"ఒక్కొకతఱిం బువుఁబోండ్లు మటారికత్తియల్." (పింగళిసూరన్న)

విక్రమసేనుఁడు జన్మభూమి విడిచిపోవుట తప్ప గత్యంతరము లేదు. తన దేశభ్రష్టత్వమునకుఁ గారణము తెలిసికొనవలయు ననియు నతని కిష్టము లేకపోయినది. ధర్మమే జయ మని యతనిసంకల్పము. సత్యము తనంతనే తెలియవచ్చు నని యతనినిశ్చయము. ఆసత్యమే యాధర్మమే తన్నుఁ గాపాడు నని యతని నమ్మకము. అదే చిఱునవ్వు, అదే శాంతము, అదే గాంభీర్యము విక్రమసేనునియందు వెలుఁగుచుండెను. అతనికి మనుష్యులచేఁతలు విరక్తిఁ గలిగించుచుండెను గాని కోపమును జనింపనీయలేదు. తననిరపరాధిత్వము స్థాపించుకొని మఱల నీనీచులమధ్య నాతఁడు నివసింపఁ దలఁపలేదు. తనకా దేశభ్రష్టత్వమును గూర్చుటలో భగవంతునియాశయ మేమో యున్నదని యాతఁడు తలంచెను. అందువలన లోకులు తన్ను నిజముగా నపరాధి యనియే తలంచినను బవిత్రుఁడై యున్నంతవఱ కాతని కేమిభయము? సర్వవ్యాపారములను ధర్మసత్యములతో సంబంధించుకొన్నయాతనికి మనుష్యులనిందాస్తుతులతోఁ బ్రయోజనమేమి?

శత్రుసింహుఁ డనుసుక్షత్రియుఁడు లంకాద్వీపసర్వసేనాధిపతి. అతఁ డెంతవీరుఁడో యంతధర్మపరాయణుఁడు. అతఁడు తనవలెఁ గుటిలుఁడు కాకపోవుటచే రాణి యెల్లప్పు డాతని ననుమానదృష్టులతోఁ జూచుచుండును. శత్రుసింహుఁ డది గ్రహించి, రాణి తాను దేవతగా భావించి యెల్లరు తనపదసేవకు లనుగ్రహముతో నితరులను నిరాదరణ

ముతోఁ జూచుచున్న దని తలఁచెనే కాని, యామె యొకకుటిలదేవత యనియు, నెల్లరు నట్లు కుటిలురు కాకపోవుటయే తనవంటివారిపైని నిరాదరణమునకుఁ గారణ మనియు నాతఁడు గ్రహింపలేకపోయెను.

విక్రమసేనునిపై విధింపఁబడిన ఘోరశిక్ష శత్రుసింహుని చెవిఁ బడెను. తనకుఁ దెలిసినంతమట్టునకు విక్రమసేనుఁడు కడుంగడు సచ్చరిత్రుఁడని యాతఁ డెఱుఁగును. ఇట్టి దేశభ్రష్టత్వశిక్ష విక్రమసేనుఁ డనుభవించునంతటి యపరాధ మేమో యతఁ డూహించుకొనలేకపోయెను. ప్రాప్తిగా నెఱిఁగి నిర్ణయింపలేకపోయినను అప్పుడప్పుడు రాణి ననేకవిధములఁ ననుమానించుచుండిన శత్రుసింహుఁడు తత్క్షణమే విక్రమసేనునిఁ జూడఁబోయెను. విక్రమసేనుఁడు బయలుదేరుటకై తగినప్రయత్నములలో నిమగ్నుఁడై యుండెను. విక్రమసేనుఁడు సేనాధిపతివచ్చుటను జూచి యతనికంటె ముందు తానే సమస్కరించి కుశలమును బ్రశ్నించెను. విక్రమసేనుని యిట్టివినయాదిసద్గుణముల నింతకుమున్న యెఱుఁగియుండినశత్రుసింహుఁడు విక్రమసేనుని ప్రేమపూర్వకముగఁ గౌఁగిలించి ,, రాకుమారా! లంకాద్వీపరాజపీఠము నధిష్ఠించినరాజులసంతతిలో విభీషణుఁడును, నతనితర్వాత నీవును దప్ప మఱెవ్వరు నింతటిమహామతులై, యింతటిసచ్చరిత్రులై, యింతటి వినయాదిగుణప్రపూర్ణులై యుండలేదు. కాని నీయాకస్మికవిపత్తునకుఁ గారణ మూహింపలేకున్నాను. నాయనా! నిన్ను నేనే యెత్తి పెంచినది. పుత్రహీనుఁడనగు నన్నుఁ జూచి మీతండ్రి యప్పుడప్పుడు, 'సేనానీ! నా రెండవబుడుతని నిత్తును. పెంచుకొనెదవా?' యని పరిహాసించుచుండెడివారు. అట్టి నిన్నుఁ జూచుచుండుటచేతనే పుత్రవాంఛను బాపుకొనుచు నిట్లే వృద్ధుఁడనైతిని. నీవు శైశవమంతయు మాయింటనే గడపితివి. నీవు మఱచియుండవు. నీవలన నట్టియత్యాచారమైనఁ గలిగిన దో పితృసమానుఁడ

నగు నాచేంతనైన వచింపుమా.” యని బహుభంగులఁ బ్రార్థించెను.

“కాకాజీ! నీప్రేమకుఁ జిన్నప్పటినుండియుఁ గృతజ్ఞుఁడను. నీమాట, నీహితము నెన్నఁడైన జవదాటి యెఱుఁగుదునా? కాని యిప్పుడుమాత్రము మన్నింపవలె నని నావిన్నపము. ఇప్పటిసంఘటనములనుగూర్చి యొక్కటియుఁ బ్రశ్నింపఁగూడదు. అందుమూలమున జోక్యముచేసికొన్నవారికిఁగూడ ముప్పువచ్చునుసుమా! అఘటనఘటనాసమర్థుఁడు సర్వేశ్వరుఁ డొక్కఁడే. ‘వీఁడు దుష్టుఁడు, వీఁడు శిష్టుఁడు’ అని నరుఁడు నిర్ణయింపలేఁడు. సర్వాంతర్యామి యొక్కఁడే సూక్ష్మదృష్టితో సర్వసాక్షియై దుష్టులను శిక్షించుచు, శిష్టులను రక్షించుచు నుండును.” అని విక్రమసేనుఁడు సహజగంభీరభావముతో, నెప్పటిదరహాసముతో సవినయముగాఁ బలికెను. ఇట్టిస్థితియందు దానినిశ్చలభావమునకు శతృసింహుఁడే యాశ్చర్యపడి యాపదలందు ధైర్యగుణము సజ్జనాళికి సహజముగదా యని తలఁచెను.

“ఐన నిప్పు డేమిచేయఁదలఁచెదవు?” అని శతృసింహుఁడు ప్రశ్నించెను.

“ఆజ్ఞకు బద్ధుఁడను గానలసినదే.” అని విక్రమసేనుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

“ఐన నీవపరాధివేనా?”

“ఐనను, గాకపోయినను రాజాజ్ఞకదా?”

“ఆరోపింపఁబడిననేరమైన నెఱుఁగుదువా?”

“శిక్షాపత్రములో నవేమియుఁ దెలుపఁబడలేదు. నేనెఱుఁగఁ దలఁచుకొనలేదు.”

“అట్లైన మేమందఱము నిన్నపరాధిగానే గణింపవలెనా?”

“ఆహా. దూషించినమాత్రాన నేను దోషినిగాను,”

"నీవు మారుపలుకక శిక్షాబద్ధుఁడవై పోయిన జనులలో నీపై దురభిప్రాయము వొడమును."

"అంతమాత్రాన నాకేమియు నష్టము లేదు."

"నీనిర్దోషత్వము నేల స్థాపించుకొనఁగూడదు?"

"నాపై నారోపింపఁబడి సమర్థింపఁబడిన ఘోరాపరాధములఁ దెలిసికొని చింతించుట తప్ప నందుమూలమున మఱేలాభమును కలుగదు. కారణములేని పగవారి నొప్పించుట చాల కష్టము. తోడేలు మేకపిల్లకథను నీవెన్నఁడును వినలేదా?" యని విక్రమసేనుఁడు దరహాస మొనర్చెను. సంగతు లొక్కటియు శత్రుసేనునకు బోధపడలేదు. విక్రమసేనునియగాధహృదయ మాతనికి గోచరింపలేదు. అతఁడు మౌనముద్రాధారుఁడై స్వయముగా రాజుకడ కేఁగి "విక్రమసేనకుమారునిపై నారోపింపఁబడిననేర మేమో తెలిసికొనవచ్చునా?" యని వినయముగా నడిగెను.

ఘోరసింహుఁ డేమియుఁ బ్రత్యుత్తర మియ్యకముందే రాణి "అపరాధియే యడుగఁ దలఁపక, సిగ్గుతోఁ దననేర మొప్పుకొనుచు నప్రతివచనుఁడై శిక్షాబద్ధుఁ డగుచుండ వానిగోడవ నీకేల? క్రమముగా నీవే యెఱిఁగెదవులే" యని గద్దించి పలికెను.

శత్రుసింహుఁ డవనతవదనుఁడై విచారభారమున మహేంద్రజాలములోఁ బడి తికమకపడువానివలె తిరిగిపోయెను.

ఆనువార్త దేశమంతటను నిప్పంటుకొన్నట్లు నలుదిక్కులఁ బ్రాఁకెను. ఆరోపింపఁబడిననేరము లతిశయోక్తులతోఁ గల్పనలతో నాయానోటిసామర్థ్యముకొద్ది ఘోషింపఁబడుచుండెను. సేనాని సంశయాకులుఁ డయ్యు, విక్రమసేనునిఁ జిన్ననాటఁగోలె నెఱిఁగి పెంచినవాఁ డగుటచే నతనిప్రవర్తనల ననుమానింపలేకుండెను. విక్రమసేనుఁడు

పుట్టించెదవు ?—అహా ! అల్పజ్ఞుఁడ నగు నేను నీయమోఘచర్యలను దర్శింపలేను. నీతత్త్వమును నీవే యెఱుఁగవలెను. ”

అని యాతఁడు నిమీలితలోచనుఁడై యీశ్వరుని స్తుతించెను. పవిత్రుఁ డగునాపురుషుని గనలేక నీచమానవమధ్యమున నివసించుటకుఁ దన్నుఁదానే నిందించుకొనుచుఁ జింతిల్లి నిట్టూర్చెను. అతఁడఁట్లేకన్నులు మూసికొని పరమేశ్వరుని చిత్రచరిత్రము ననేకవిధముల భావింపఁదొడంగెను. ఆభావావేశముచే నాతనికిఁ గన్నీరు మున్నీరగుచుండెను. కొంతసేపటి కాతఁ డశ్రుపూరితనేత్రములను దెఱచెను. అహా ! ఆభయంకరదృశ్యమేమి ? కలయా ? ఒకకంపితఖడ్గహస్త మాతనికంఠముపైఁ బడనుండెను. అతఁడు తటాలున నాహస్తమును బట్టుకొని “ ఏమిది ? శుకవాణీ ! ” అని యాశ్చర్యముతోఁ బలికెను. శుకవాణి కంపించుచు “ రక్షింపుఁడు, రక్షింపుఁ”డని కేకలువైచెను. అది విని శత్రుసింహుఁడును గొందఱుభటులును వడివడిగా నరుదెంచిరి. “ రక్షింపుఁడు. ఈదురాత్ముఁడు నాపడకనుండి నన్నెత్తుకొని వచ్చి బలాత్కరించుచున్నాఁడు. ” అని శుకవాణి మొఱలిడెను.

విక్రమసేనుఁ డద్దరి పక్షి యాకసమువంకఁ జూచుచు “ సర్వేశ్వరా ! ఇంకను నీకుఁ దృప్తి కలుగలేదా ? ” యని వేఁడినిట్టూర్పు పుచ్చెను.

“ ఓరీ ! కృతఘ్నా ! పామును పెంచరాదనుపలుకు నిజమైనది. నీకే యియ్యఁదలఁచుచుండినబిడ్డపై నాత్రపడి ద్రోహము చేసితివి. కుటిలునకు గొప్పబుద్ధి పుట్టుకతో లేని దెట్లు వచ్చును ?” అని చుఱచుఱఁజూచుచు శత్రుసింహుఁ డురిమెను.

“ ఇట్టిచిక్కులు సంభవించు ననుదూరాలోచనము లేకనే, నేను

నుండనంటిని. కాకాజీ ! నీబలవంతముచేతనే నిలువవలసి యిట్టిమాట లనిపించుకొనవలసివచ్చినది." అని విక్రమసేనుఁడు శాంతముతో ననెను.

,, దురాలోచనముచేత ననుము ! నీదురాలోచనములు తెలియక నిన్నింటఁ బెట్టుకొన్నతప్పిదము కడకు నాదే యైనది. నీచా ! నీపాపఫలము ననుభవించుటను దప్పింపఁదలఁచి నేనును నీమూలమున నిట్టిమనోవ్యథను బొందవలసివచ్చినది. దుష్టులకు మేలు చేయరాదని తలఁపక పోయితిని. వెళ్లుము. నీతొల్లిటిగతి ననుభవింపుము. నిన్నుఁ బెంచిన వ్యామోహముచేత నీయవమానమును సహించి నిన్నుఁ బ్రాణములతో విడుచుచున్నాను. " అని శత్రుసింహుఁ డుగ్రుఁడై యదలించెను.

ములుకులవలె నొప్పించునతనిపలుకుల కోర్చుకొని విక్రమసేనుఁడు విధి తనయెడ నప్పుడు వైరభావముతో నుండె నని మారుపలుకక యెప్పటిగభీరప్రశాంతదరహాసవిలాసముతోడనే సవినయముగా శత్రుసింహునకు నమస్కరించి, శుకవాణికాకసముచూపి "అదిగో ! సర్వేశ్వరుఁడును సర్వసాక్షియు నైనదుష్టశిక్షకుఁడు " అని పలికి,

,, విమలలే రమణులు చిలుకా
విలయస్వరూపలే చిలుకా ''

అని పాడుచుఁ జీకటిలో నంతర్ధాన మయ్యెను. అతనిశాంతభావమునకు నతనిచర్యలకు నందఱు నక్కజపడిరి.

అతనిప్రశాంతభావమును గన్నారఁ గాంచినశుకవాణి తనలోఁ దానే భయపడుచు ,, ఆహా ! నిర్మలహృదయము లెప్పుడును నిశ్చలములుగదా ! నేనెంతో యాశపడి యిప్పుడు చేసినపని నాకనుకూలమో ప్రతికూలమో బోధపడుట లేదు. అక్కటా ! అట్టిదుర్ముహూర్తము నందుఁగూడ నాతఁడు ప్రశాంతగంభీరవదనముతోఁ; బ్రిసన్నమధురము

దహాసముతో నన్నుద్దేశించి నాకాకసమువంకఁజూపిన చూపును, మధురకంఠముతోఁ బాడినపాటయుఁ గన్నులయెదుటను, మనంబునను దట్టినప్పుడెల్ల నాసర్వాంగకములును గంపించిపోవుచున్నవి. ఆతఁడసాధారణ దివ్యచరిత్రుఁడగుమహాపురుషుఁడనుట కెట్టిసంశయమును లేదు. ఆతనియెడఁ గ్రూరమతినై, యకారణవైరముం దెచ్చికొని, యసహ్యక్రూరకృత్యముం గావింపసాహసించిననేనే యగాధదుఃఖకూపమునఁ బడిపోవుచున్నాను ” అని భావించుకొనుచుఁ దహాతిహాపడిపోవుచుండెను.



## నాలుగవ ప్రకరణము



'కలరో నాకు సృజింపఁబడ్డచిలుక లేకాలాన లోకంబునన్'
("చిలుక")

"కోమలముఖులయ్యు-గూఢస్వభావలు,
గోముఖవ్యాఘ్రముల్ చిలుకా!
కొమ్మ నమ్మఁగ నెట్లు చిలుకా?
కొఱవిదయ్యముఁగాదె చిలుకా!
ఏమని వెదకుదు - నేమాత్రమును నమ్మ
రాము, నీజాతినిఁ జిలుకా?
భామలు బాకులే చిలుకా!
భీమవిషాత్మలే చిలుకా!"

అను మృదుగానము లంకాద్వీపోత్తరారణ్యభాగములందుఁ బ్రతిధ్వనించు చుండెను. ఎచ్చటి కేఁగవలయునో, భావికాలము నెట్లు గడపవలయునో తెలియకే కాళ్లీడ్చినట్లుగా విశ్రమసేనుఁడు పోవుచుండెను. అతనియందు విరక్తిభావము మితిమీఱిపోవుచుండెను. ప్రపంచములో సజ్జనులే లేరా యని యాతఁ డాశ్చర్యపడుచుండెను.

"ప్రపంచమతినీచభావవిశిష్టమనుతీర్మానమునకు నన్నేల విధాత తెప్పించెను? స్వగృహమునుండియు, స్వదేశమునుండియు, నన్నేల వెడలించెను? నాకుఁ గలిగినవిరక్తికి సహాయముగా నిట్లుదేశములవెంబడి గుప్తమృతుటను జూడ, విధాత నాకు సన్యాసము నిప్పింపఁదలఁచుచున్నాఁడా? పురుషులలో నావంటివారున్నట్లే స్త్రీలలోఁగూడ నుండరా?

అన్నివిధాల నాతో నేకీభవింపఁగల స్వభావము గలవారు స్త్రీలలో నుండరా? శుకవాణి నాకుఁ దగినభార్య కాఁజాలదనే విధి నన్నామెయింటి నుండి వెడలఁగొట్టెను. నేనిట్లు దేశదిమ్మరినౌచు నేదో మహార్థమును నెఱవేర్పవలసియున్న ట్లున్నది. కాకుండినచో నవ్యాజానుగ్రహముచే నాకాశ్రయ మిచ్చినశత్రుసింహుఁడు నన్నకారణవైరియై యేల వెడలఁగొట్టును?

ఇట్లు దేశముల వెంటఁ దిరుగుచుఁ బ్రపంచమంతయు నిట్లే నీచజనమయముగా నున్నదేమో కనుఁగొనవలెను. ప్రపంచతత్వవిమర్శకుఁడ నగుట కిదే సమయము. స్త్రీలందఱుఁ బిశాచములేనా? లేక నావంటివారికిఁ దగినవారిని స్త్రీలలోఁగూడ బ్రహ్మ సృజించినాఁడా? మానవజాతిని గర్హించు నాకు వివాహాపేక్ష దూరీకృత మగుచున్నను సాధుస్వభావలగువధూమణులను దర్శించి యింతకుముందు స్త్రీజాతివలనఁ బడినపాట్లను మఱచిపోవ యత్నించెదను. అట్టిపవిత్రస్వభావయైన కన్యారత్నము లోకమందున్నను లేకపోయినను నట్టిదానిని మనశ్శక్తిచేనైనఁ గల్పించుకొని యేకలవ్యునివలె నొకవిగ్రహమును సృజించి నిజమైన స్త్రీలిట్లు పవిత్రముగా నుందు రనియు, నట్టివారి నర్చింపవచ్చు ననియు లోకమునకు బోధించుచు నాస్త్రీవిగ్రహమును బూజించుచు లోకసంచార మొనర్చెదను. నావలెఁ గష్టపడువారికి నాచేతనైనసాయ మొనర్చి యిఁక నీచమానవసంఘవిముక్తుఁడనై మనుష్యునిముఖము చూడక వనవాసి నయ్యెదను"

ఇట్లు యోచించుకొనుచు విక్రమసేనుఁడు సముద్రతీరమును సమీపించెను. అప్పటి కాతఁడలసిపోయి యిసుకలోఁ జతికిలఁబడెను. పండువెన్నెల గాయుచు నతనితప్తచిత్తమున కొకించుక శాంతి నొసఁగుచుండెను. నర్వకళానిధియగు నాతఁడప్పు డించుక తేరుకొని గొంతమనో

హారస్త్రీవిగ్రహమును జతిగించెను. దానిక్రింద ,, నాచిలుక '' యను నక్షరముల లిఖించెను. ,, ఈమెపవిత్రతను జూచి లోకమందలిస్త్రీ నేర్చుకొందురుగాక. '' యని దానిక్రింద వ్రాసెను. బ్రహ్మదేవునిచే నాబొమ్మ కాతఁడు ప్రాణమియ్యఁగలిగియుండినచోఁ దప్పకుండ నాఁ తూర్తమందే యాతఁ డాసజీవచిత్రమును వివాహమాడి యుండును. అట్టిశక్తి తనకు లభింపకుండుటచే భావనిర్మితంబగు నానిష్కల్మషస్త్రీ చిత్రము నిలువెల్పుగాఁ జేసికొని యాతఁ డప్పుడే యనేకవిధముల నర్చించెను.

,, కోమలముఖులయ్యు - గూఢస్వభావలు
గోముఖవ్యాఘ్రముల్ చిలుకా!
కొమ్మల నెటు నమ్మఁ జిలుకా?
కొఱవిదయ్యాలె పో చిలుకా!

ఏమని వెదకుదు-నేమాత్రమును నమ్మ
రామి నీజాతినిఁ జిలుకా?
భామలు బాకులే చిలుకా!
భీమవిషాత్మలే చిలుకా!

తరుణిలోకమున నీ-కరణి సచ్చరితలై
పరగువా రరుదయ్యెఁ జిలుకా!
వరియింప నినుఁ దప్పఁ జిలుకా!
మఱి యెవ్వరిని గాని చిలుకా!

విరహసాగరవారి - వెడలింపఁ దరణివై
తరుణి నీవుండంగఁ జిలుకా
వెఱపేల మరునకుఁ జిలుకా?
నేఁ బ్రొక్క చెలి యేల చిలుకా? ?''

అని విక్రమసేనుఁ డాబొమ్మను హృదయమునఁ జేర్చుకొని యానందించి, పెదవులఁ జేర్చి ముద్దిడెను. అతనికిఁ బిచ్చియెత్తిన దని యెవ్వరును నవ్వఁబోకుఁడు. పవిత్రప్రేమబీజస్థాపనకుఁ దగిననెలవు లేదని యాతఁడు దృఢనిశ్చయుఁడై యున్నప్పు డంతకంటె నేమిచేయఁగలఁడు? అతని కాచిలుకతోడిదే లోక మయ్యెను. అదే యాశుకముఖుని కేడుగడ యయ్యెను. గార్హస్థ్యము నవలంబింపనిదే మోక్షము లేదందురు. భావస్త్రీ నతఁ డిప్పుడు గాంధర్వవిధిని బెండ్లియాడి పవిత్రప్రేమను బ్రతిపాదించి సంసారవాంఛలను దీర్చుకొనుచుఁ బవిత్రతను బరమపురుషునిఁ, దత్త్వమును నన్వేషింపఁ గడంగినాఁడు. సరికదా !

---

# అయిదవ ప్రకరణము



"The will of Heaven my will shall be,—
I bow to the divine decree,
To God's behest." (Longfellow.)

విధితోఁ బోరాడుటవలనఁ బ్రయోజనములేదని, కాఁగలదాని నెవ్వరు నాఁపలేరని, భగవదాదేశమును శిరసావహించి, కాలచక్రము ననుసరించి విక్రమసేనుఁడు దేశములవెంబడిఁ దిరుగ నెంచెను. అట్టిదృఢవిశ్వాసముతో నతఁడు సముద్రమును దాఁటి భరతఖండమునఁ బ్రవేశింప నిశ్చయించుకొనియెను. ఆనాఁడు స్త్రీయగుసవతితల్లిచే వెళ్లఁగొట్టఁబడి వనవాసియై రాముఁడు దక్షిణముగా వచ్చి కడకు లంకఁ జొచ్చెను. ఇప్పుడు విక్రమసేనుఁ డట్లే స్త్రీయైనవదినెచేతఁ దరుమఁబడి లంకనుండి యుత్తరముగా నారాముఁడుపాలించిన రాజ్యములవంక కే పోవుచుండెను. రాముఁడు వనవాసియై మహాకార్యములనేకము లాచరించెను. అట్లే తానును వనవాసియై యెట్టిమహాకార్యములను జేయువలయునని జగన్నాథుని యాజ్ఞయో యని యతఁ డాలోచించుచుండెను.

కొందఱువణిజు లాయుదయమున నొకనావలో వివిధములైన సరకులతో భరతదేశమునకుఁ బ్రయాణమగుచుండిరి. విక్రమసేనుఁడు వారితోఁగూడ నానౌకయందే బయలుదేఱెను.

---

* ఇచ్చటినుండి పదునేడవప్రకరణమువరకు "The Prisoner of Zenda" అను మూలకథ నించుక "క్లోను" గా ననుసరించి, కడపటి రెండుప్రకరణములలో నీమూలకథకు రెండవభాగమగు "Rupert of Hentzau" ననుసరించి పూరించుచున్నాను.

అదృష్టవశమున నానావయం దందఱుఁ బరదేశవర్తకులే యుం డిరి. ఉండినకొందఱులంకాద్వీపస్థు లేమూలలనుండివచ్చినవారో యగు టచే నాతనిగుర్తింపలేరైరి. కాని యొకస్త్రీమాత్ర మాతనిఁ బరిశీలించి చూచెను. విక్రమసేనుఁడు తమతో నేలప్రయాణముచేయుచుండెనో యామె తెలిసికొనఁగలిగెను. కాని విక్రమసేనుఁడు రెండునెలలకు ముందే పోయియుండవలసిన దనియు నతఁ డిప్పు డేలపోవుచున్నాఁడో యనియు నామె యాశ్చర్యపడియెను. ఆమె తనదేశవాసినియే యనియు విక్రమవర్మయనుధనవంతుఁడగు గొప్పజమీందారునితనయ యనియుఁ బేరు చక్రసేన యనియు విక్రమసేనుఁడు తరువాత నొకనివలనఁ దెలిసి కొనఁగలిగెను. ఆచక్రసేన తన్ను దుర్మార్గునిగను, దేశభ్రష్టునిగను భావించి నిర్లక్ష్యభావముతోఁ జూచుచుండె నని కనిపెట్టి యాతఁ డొక దరహాస మొనర్చెను.

వారిసముద్రయాత్ర క్షేమముగా నే కొనసాగెను. కతిపయదిన ములలో నావ యవతలియొడ్డు చేరెను. దేశభ్రష్టుఁడై వచ్చినతన కా శ్రయ మిమ్మని మహాపురుషులచేఁ బాలింపఁబడి, మహామతుల కాటపట్టైయుండిన భారతమాత నుద్దేశించి విక్రమసేనుఁడు నమస్కరించెను.

విక్రమసేనుఁడు మహారణ్యములనుజొచ్చి యుత్తరముగాఁ బోవు చుండెను. నిశ్శబ్దములై, ప్రశాంతములై వృక్షలతాదులతో శోభమీ జెయున్న యరణ్యము లాతనికిఁచమానవకోలాహలదగ్ధహృదయ మునకు నమృతదృశ్యములై చల్లగా నుండెను. అచ్చట రాజ్యమునకై పరుల నురుమాడువారు లేరు. లోకకంటకమగు ధనపిశాచ మచ్చట లేదు. తద్బాధితు లచ్చట లేరు. పూర్వమున రాముని, నిప్పుడు విక్రమసేనుని నీర్ష్యచే వనచరులుగాఁ జేసినపిశాచములవంటి కామినులు చ్చట లేరు. ప్రవహించునదులశబ్దములు విక్రమసేనునకు వేదఘోష

6

ములుగా వినఁబడెను. నానాపక్షులకిలకలనాదములు సామగానములుగాఁ గన్పడెను. నీచమానవమధ్యమునుండి తొలఁగించి తన కందందుఁ గలపవిత్రతను భగవద్వైచిత్ర్యములను గనుఁగొనుభాగ్యముఁ గలుగఁజేసిన వదినె తన కమితమైన మేలుచేసె ననియుఁ, దానందులకుఁ గృతజ్ఞుఁడై యుండవలయు ననియు విక్రమసేనుఁడు తలఁచెను. ఆహా! మహాత్ములచిత్తవృత్తులు ప్రకృతివలెఁ బ్రశాంతములుకదా!

అతఁడట్లతిదూరముగా గిరులును, గానలు, నదులును, బురములు, గ్రామములును గడచి పోవుచునుండెను. ప్రకృతిపరిశోధనానిమగ్నుఁడై, తత్త్వవిమర్శకుఁడై చనుచుండునాతని కాయాస మెక్కడిది? అతఁడు దండకారణ్యమును దాటినంతలోఁ దొల్లిటిసుబాహుమారీచాదులఁ దలపెట్టుచు, రాకాసులమూఁకలవలెఁ గొందఱుచోరు లాతనిముట్టడించిరి. ఒక్కపెట్టునఁ బైనిబడి చంపి యాతనియమూల్యమణిమయాలంకారములను దోఁచుకొనిపోవనుంకించిరి.

కాని యాకస్మికముగా నట్టి ప్రాణసంకటము తటస్థించినను క్షత్రియవీరుఁ డగునావిక్రమసేనుఁ డించుకంతయును జలింపలేదు. పరాక్రమవంతుఁ డగునాతఁడు తననిశితకరవాలముతో నొక్కసారిగా వారి నందఱను బరిమార్పఁగలఁడు. కాని యుదారహృదయుఁ డగుటచే నూరక వారిని జంపనొల్లక మృదుమధురగంభీరస్వరముతో నాదొంగల నుద్దేశించి ,, నాయనలారా! పొట్టకూటికై యెట్టియకార్యములనైన మీచేఁ జేయించుటకుఁ దలపెట్టిన మీదారిద్ర్యముంగూర్చి నేనెంతయు విచారించుచున్నాను. ఎంతటి ప్రశాంతస్వభావులనైనను, బరపీడాకరులుగను, క్రూరచిత్తులుగను, దుష్కర్ములుగను, తుద కాత్మహంతకులుగను మార్చివేయఁగలదరిద్రదేవతదుర్బోధము లతిదారుణములైనవని నేనెఱుంగుదును. ఘోరోపక్రమ్ముడిగ నన్నాక్రమించుట మీదోష

మువలనఁ గాదు. దారిద్ర్యమే మీకు నాయమూల్యభూషణములయం దాశ పుట్టించినది. అదియే నన్నుకారణముగ హింసింపవలయుననుతెగువను మీకుఁ బుట్టించినది. ఇట్లు మీకు దుర్బుద్ధిని బుట్టించిన యీనగలకు నాశ్రయ మిచ్చి నేనేల పాపప్రేరకుఁడను గావలయును? సోదరులారా! ఇవి చాల విలువగలవి. వీనితో మీరు మహాధనవంతులు కాఁగలరు. ఈధనముతో మీరు మీకుటుంబములను సుఖముగఁ బోషించుకొనుచు నింతటినుండి లోకకంటకంబగు నిట్టిదుర్వృత్తిని విడిచి శాంతముగ జీవింపుఁడు!" అని బోధించుచుఁ దనవస్తువుల నన్నిటిని దీసి వారిపైఁ బడవైచి యొక్క నిమిషములో వారికంటికి మరల నగపడకుండ నాతఁ డవ్వనమధ్యమున మెఱపువలె నిట్టె మాయమైపోయెను.

ఇట్లు విక్రమసేనుఁడు రాజ్యమును దృణీకరించి, ధనముపై నించుకంతయు నాశ లేక యీశ్వరోద్దిష్టమగుస్వధర్మమును నిర్వహించుటయందే జీవితమును వినియోగింపవలయునను నుద్దేశముతో బయలుదేఱి పోయిపోయి క్రమముగా విదేహరాజ్యమునఁ జేరుకొనియెను. ఉద్యానవనములయందు విహరించుటకుఁగూడ నలసిపోవు నాతఁడు దుర్గమారణ్యకంటకపథంబులఁ గాలినడకతోఁ బరిక్రమించెను. షడ్రసోపేతములగు భక్ష్యభోజ్యములచేనైనను తృప్తిపడనిరాకుమారుఁడు కందమూలప్రభృతులతో సంతుష్టిఁ జెందెను. మెత్తనిశయ్యల మేనువాల్చినను నిదురపట్టనిసుకుమారుఁడు కటిక నేలల నిదురింప నేర్చెను. ఒక్కపెట్టుగాఁ దనశరీరము నింతకష్టపెట్టుటచే నతఁడు చాల బడలిపోయెను. అతఁడు విదేహరాజ్యముఁ జొచ్చి యెచ్చటనైన విశ్రమింపఁ దలఁచెను గాని, యది తనయన్నగారి మామభూమి యగుటచే నతనిమన సొప్పదయ్యెను. ముందొకనాఁ డిచటనే యాతనివదినె యాతని కుద్యోగ మిప్పింతు నని ది. పౌరుషవంతుఁ డగునాతఁ డందులకియ్యకొనలేదు. ఇప్పు డాతఁ

నారాజ్యమున నిలిచియుండుట కెంతమాత్రము నిష్టపడలేదు.

నాఁటికి సరిగా నెలనాఁటికిఁ గాశ్మీరరాజునకుఁ బట్టాభిషేక మని విక్రమసేనుఁ డారాజ్యమునఁ దెలిసికొనెను. నానావనీపతు లాయుత్సవ మునకుఁ బోయి యారాజును గౌరవింప నేగుచుండిరి. పూర్వమునఁ బ్రభావతీసంబంధముతోఁ గాశ్మీరరాజులు లంకారాజులగుతమకు బావ మఱఁదులవరుస కావలె నని విక్రమసేనుఁ డెఱింగియుండుటచే, నాతఁ డాయుత్సవమున కేగ నిశ్చయించెను. కష్టకాలమున నావయిల్లే గతి యని భగవంతుఁడు తనకొఱకే యాపట్టాభిషేకము నిప్పుడు చేయించు చున్నాఁ డని యాతఁడు తలంచెను. అనుహోత్సవమునాఁటి కచ్చట నుండవలయుననిత్వరపడుచు విక్రమసేనుఁడు ప్రయాణమును వేగముగా సాగించెను. ఆతఁడు పట్టాభిషేకమున కొకదినముముందే కాశ్మీరదేశ ముఁ జొచ్చి రాజధానియగు కాశ్మీరనగరమును సమీపించెను. కాని పట్టాభిషేకము నిర్ణీతదినమునఁ గాక రెండుదినము లవతల చేయఁబడున ట్లాశ్చర్యకరముగా రాజతమ్మునిచేతఁ దీర్మానింపఁబడియుండెను. రాజ సోదరుఁడే రాజప్రతినిధియై సర్వకార్యములఁ జక్కఁబెట్టుచుండెను. కాని యాతఁ డెందులకు పట్టాభిషేకము ముందునకు వేయించెనో యెవ్వరు నెఱుఁగలేక యాశ్చర్యపడుచుండిరి. కడకు రాజునకైనఁ దెలియదు. పట్టాభిషేక మింతకుముందును నిట్లే ముందుముందునకు వేయఁబడి రెం డుమూఁడుపర్యాయములు తప్పియుండెను. తమ్ముని మిక్కిలి ప్రేమిం చుచుఁ గార్యభారము లన్నియు నాతనిపై వైచి తనప్రతినిధిగా నేర్ప ఱచి రాజాతని యిష్టప్రకారమే నడచుకొనుచుండెను.

త్వరగాఁ గాశ్మీరపట్టణమును బ్రవేశించు నవసరము విక్రమసే నునకుఁ గనఁబడలేదు. పట్టాభిషేకదినమున రాజధాని కేగవచ్చు నని యెంచి, సుదతి యున్న నగరు నందుండుటచే నవబలమున దేనినుబడయు వీలు

లేక కొంతదూరము పశ్చిమముగాఁ గాశ్మీరమును దాటి రాజధానికి వా యువ్యముగా నడిచెను. అచ్చట నల్లకొండలను పేరుగల నల్లగుట్టలు కలవు. ఆకొండలలో రాజసోదరుఁడు బలమైనకోటను గట్టించియుండెను. వాని నింమకదాటిన ఘోకేశ్వరపుర మని యొకపట్టణము కలదు. ఇవ రాజు తనతమ్మునిపాలన కిచ్చియుండెను.

రాజిప్పుడు తమ్మునిరాజ్యములో నల్లకొండలప్రాంతమున వేఁ డుచుండెను. ఆసంగతి తెలిసికొనియే విక్రమసేనుఁ డావంకకు బయలు దేఱెను. పట్టాభిషేకపుగడబిడలో రాజునకుఁ దానెవ్వరైనది చెప్ప వీలు లేకుండు ననియు, నట్టివేడుకసమయములో రాజుతోఁ గలియుటకుఁ గాని, మాటాడి తమబాంధవ్యము నెఱిఁగించుకొనుటకుఁ గాని కొన్నిది నము లాతనిరాజ్యమున నిలిచియుండుట కాతనియనుజ్ఞ పడయుటకుఁ గాని యవకాశముండదనియు నిన్నిపనులను నెఱవేర్చుకొనుట కిదే సమ యమనియు విక్రమసేనుఁ డాలోచించుకొని తానుగూడ నల్లగొండలకుఁ బోఁదలంచెను.

అతఁడు నల్లకొండలను జుట్టుకొని ముందు ఘోకేశ్వరపురమునకే వచ్చెను. రాజుకై యతఁడు నల్లకొండలకు మఱల వెనుకకుఁ బోవలసి వచ్చెను. అతఁ డాకొనియుండుటచే నొకసత్రమున కేఁగెను. అట నా సత్రాధికారిణియు నామెతనయయు నాశ్చర్యపడి యాశుకముఖుని కెదు రేగి సత్కరించి ‹‹ మహారాజా ! ఒంటిగా వచ్చితి రేమి ? ఈయాసన ము నలంకరింపుఁడు. నేఁటికి మాసత్రమును బావనము చేయవచ్చితిరి. మేము ధన్యులము. ›› అని యతనికి వివిధోపచారములు చేయఁ దొడంగిరి.

వారట్లు తన్ను ‹‹ మహారాజా ! ›› అని పిలుచుచు రాజోచిత గౌరవములతో సేవించుచుండుటను గాంచి విక్రమసేనుఁ డాశ్చర్యపడి యెను. ‹‹ నేను లంకాద్వీపపురాజకుమారుఁడ నని వీరెట్లు గ్రహించ

గిరిగిరి ? ఏవిచిత్రకారుఁడైన నాయందలి యభిమానముచే నాచిత్రపట
మును చిత్రించి యీదేశమువఱకును వ్యాపింపఁజేసెనా ? కాక వీరెవ్వ
రైన నాదేశమునకు వచ్చి నన్నుఁ జూచి యుందురా ? లేకున్నచో
ముసాఫిరుఁడను పాంథుడను నగునాయెడల వీరికీభక్తిశ్రద్ధ లేల కలుగవల
బు ?" అని యూహించుకొనుచు నప్పటిసంఘటనముంగూర్చి య
పవదుచుండెను.

ఇంతలోఁ గాశ్మీరమహారాజసోదరునిభటుఁడగు మోహనుఁడను
వాఁడు దడదడనడచుచు నటకు వచ్చి చిరపరిచితుఁడగుటచేఁ జటాలున
నాసత్రమునఁ బ్రవేశించెను. తోడనే యాతఁడు విక్రమసేనుని గాంచి
యాతనిపాదములచెంతఁ జాగిలఁబడి నమస్కరించి వినయభక్తివిశ్వాస
ములు తేటపడ నల్లనల్లన వెనువెనుక కడుగులు వైచుచు వెనుదిరుగ
కుండఁ జూపులతోడనే యనుజ్ఞ వేఁడుకొని వెడలిపోయెను.

అది చూచి విక్రమసేనుఁడు మఱింత విస్మితుఁడైపోయెను.
ఈవిచిత్రసంఘటనమునకుఁ గారణ మేమో యాతని కించుకంతయు బో
ధపడలేదు. అతఁ డప్పుడు తన కనేకవిధములఁ బరిచర్యలం గావించిన
సత్రపువారియాదరమునకు సంతసించి వారికి ధన్యవాదములు గావించి
వారికడ సెలవుగైకొని యప్పటిస్థితిగతులంగూర్చి యాలోచించుకొనుచు
నెట్లయిన మహారాజు నటఁ గలిసికొనవలయు ననుకుతూహలముతో
విక్రమసేనుఁడు నల్లకొండలమార్గమునుబట్టి వెడలిపోయెను.

అట్లు పోవుచు నాతఁడు తనలో "దివ్యమహిమాన్వితుఁ డగు
దేవునితలంపే నాతలంపును, దివ్యలీలామయుఁడగు దేవునిధర్మమే నాధ
ర్మమును, దివ్యమంగళమూర్తి యగు దేవునిపవిత్రతయే నాపవిత్రతయు
నగుఁగాక !" అని భావించుకొనుచు మంత్రముగ్ధునివలె ముందటికి జర
గిపోవుచుండెను.

---

## ౯ అ వ ప్రకరణము



"One face, one voice, one habit and two persons,
A natural perspective, that is and is not!"
(Shakespeare.)

వృక్షము లొండింటిని కౌఁగిలించుకొని తమయలౌకికప్రణయావిలాసమును సూర్యుఁడు చూచునేమో యని పచ్చని పైకప్పును వైచుకొనియుండెను. అప్పటికిని నతఁడు తుంటరితనమునఁ దొంగి తొంగి చూచుచుండెను. భుజించినవెంటనే ప్రయాణముచేయుటచే విక్రమసేనుఁడు సొమ్మసిల్లి యాప్రకృతిరామణీయకముం గాంచి వివశుఁడై యచ్చట నించుకసేపు విశ్రమింపవలయు నని తలంచెను.

ఒకవృక్షచ్ఛాయ నతఁడు కూలఁబడెను. చాలరోజులుగ నిద్ర లేకుండుటచే నచ్చటి చల్లఁదన మతనిని నిద్రాదేవి కప్పగించెను. చాలసేపటివఱకు నాతఁ డచ్చట నట్లే గాఢనిద్రాపరవశుఁడై పడియుండెను.

కొంతసేపటి కాతనికి మెలఁకువ గలిగెను. కన్నులఁ దెఱచి చూచునప్పటి కిరువురువీరపురుషులు ఖడ్గహస్తులై యాతని కిరువంకలను నిలిచి యుండిరి. విక్రమసేనుఁ డదరిపడి వారు తన్నుఁ జంపనెంచి వచ్చిరేమో యని భావించెను. కాని విక్రమనిధి యగువిక్రమసేనుఁ డించుకంతయుఁ గలంగక శత్రుమర్దనప్రశస్తం బగుతనదక్షిణహస్తము నొరనున్నకృపాణముచెంతకుఁ జేర్చి చటాలున లేచి నిలువఁబడియెను. అంతలో నాయోధశేఖరు లిరువురు నాతనికి నమస్కృతులం గావించి "ప్రభూ! ఏమిసెలవు?" అని విన్నవించిరి. ఒకదానిపై నొకటిగ నబ్బురము గొలుపుచున్న యద్భుతఘటనములం గాంచి విక్రమసేనుఁడు

తాను మాయాలోకమునఁ బడిపోవుచుంటినా యని సంశయాకులస్వాం తుఁడై యేమియు నాటాడఁ జాలకపోయెను.

అంతలో [illegible] వేటదుస్తులతోనున్న యొకపురు షుఁడు ,, మ[illegible] !" అని విజయధ్వనులు చేయుచున్నకొం దఱుమృగ[illegible] యచ్చటికి విచ్చేసెను. అప్పటిదాక స్మికముగా [illegible] తమ జయజయధ్వానములనాలకి వైచి [illegible] సాదృశ్యములను గాంచుచు నిశ్చేష్టులై నిలువఁ[illegible].

,, [illegible] ? ఇది కలయా, నిజమా ? ఒకటేశరీర [illegible] ఒకటే ముఖాకారము ! దుస్తులలోనే భేదము గాని యంతయు [illegible] రూపము ! కాని యిరువురుమూర్తులు !" ఇదియే యందఱికిని సంశయకారణము !

ఆమృగయులనడుమ నున్నమహారాజు కొంతసేపటికిఁ దనవిస్మ యము నడంచుకొని యెదుట నిరువురుయోధులచెంతనున్న విక్రమసే నుని సమీపించి [illegible] అన్నా !" అని సంబోధించి ,, నీవు నాప్రతిమూ ర్తివై యగపడుచుండుటచే నీయెడలసోదరభావముచే నిన్నిట్లు పిలుచు చున్నాను. క్షమింపవలయును. నీదేశమును, నీనామమును మే మెఱుంగఁ గోరవచ్చునా ? " అని సాదరముగాఁ బ్రశ్నించెను.

,, మహారాజా ! నేను లంకాద్వీపరాజకుమారుఁడను. ప్రస్తుత లంకేశ్వరుఁ డగుఘోరసింహునితమ్ముఁడను. " అని విక్రమసేనుఁడు బదులు చెప్పెను.

ఆమాట విన్నంతనే రాజాతనివైపున కొకగంతు వైచి విక్ర మసేనునిచేయి పట్టుకొని ,, బావా ! ఆలాగా ? మీలంకారాజులు మా కాశ్మీరప్రభువులకు మహిత్రకుటుంబములోనివారు. అందుచే నీవు

మాకు శోవవు కావలయును. తెలిసినదా ? అనియెను.

చాలకాలమునాఁటి యీమాట లంకారాజ్యమునందేకాక యీ కాశ్మీరమునందుఁగూడ జ్ఞప్తియందుండి యప్పుడప్పుడు స్మరింపఁబడు చుండుటకు విక్రసేనుఁ డాశ్చర్యపడి యానందించి ,, ఆహా ! బాగుగా నెఱుఁగుదును. ఇదిగో నేనతిభక్తితో నర్చించుచుండిన పూజ్యురాలగు మీపూర్వురాలు ! ఈమెమూలముననే నాకు మిముఁబోలిన యీరూపము వచ్చినది. ” అని తనకడనుండిన ప్రిభావతీపటమును జూపెను. ఇట్లాకస్మికముగాఁ గలిసికొన్నందుల కానందించుచు నాబావలిరువురు నొండొరులఁ గౌఁగిలించుకొనిరి. అప్పుడు రాజుప్రేమార్ద్రస్వరముతో ,, కాని నీపేరేమో చెప్పకపోయితివే ? ” యని ప్రశ్నించెను.

,, విక్రమసేనుఁడు ” అని విక్రమసేనుఁడు బదులు చెప్పెను.

,, ఓహో ! పేరుకూడ నాదేనా !” అని రాజాశ్చర్యపడుచుఁ బలికెను.

,, నారూపము మామూలమూర్తి యగుకాశ్మీరరాజకన్యరూపమునకెల్లవిధముల సరిపడియుండుటచేత మాతండ్రిగారు మాలంకారాజులనామములకుఁ బ్రిధానచిహ్నమైన ,, సింహ ”శబ్దమునకు మాఱుగా కాశ్మీరరాజు లుపయోగించు సేనశబ్దమును జేర్చి నాకు విక్రమసేనుఁ డని నామకరణము గావించిరి. మనకుఁ జాయలును, బోలికలునుగూడ నేకమైనట్లు నామములుగూడ నొక్కటేయగుటకు మఱింతయాశ్చర్యముగా నున్నది. ఇన్నియు నొక్కటిగాఁ గలయుట యద్భుతసంఘటనము గాదా ? ” అని విక్రిసేనుఁడు మందహాసము చేయుచుఁ బలికెను. అటనున్నవా రందఱు నద్భుతాక్రాంతచిత్తులై పోయిరి.

మనకథ యింతవఱకు జరిగినతరువాత నిచ్చట సమానాకృతులగు విక్రమసేనులసంఘటనము తటస్థించినది. ఇందువలనఁ బాఠకులకుఁ

బొరపాటు గలుగకుండ నింతటినుండి కాశ్మీరరాజును రాజనియే వాడు కొనుచుందము. కథానాయకుఁ డగువిక్రమసేనుఁ డాపేరనే వ్యవహరింపఁబడుఁగాక !

*　*　*　*　*　*

*　*　*　*　*　*

రాజసోదరుఁడు కట్టించినదుర్గమున కీశాన్యముగా రెండుమైళ్ల దూరమున మృగయావినోదములఁ బాల్గొనురాజవంశమువారికిని వారి యనుచరులకును విశ్రాంతికొఱకును వారికిఁ గావలసిన యాహారపానీయాదులకొఱకును నొకమందిరము కట్టఁబడి యుండెను. రాజిప్పుడు విక్రమసేనుని వెంటఁబెట్టుకొని సపరివారముగా నామందిరమునఁ బ్రవేశించెను.

నాఁటిసాయంకాలమునకు నానాఫలములచేతను విందు సిద్ధము చేయఁబడి యుండెను. బలసినవందికొఱ్ఱవంటి యొకముసలి యందిచ్చుచుండ నొకబాలుఁడు వడ్డించుచుండెను. ఆముసలి యింతకు ముందు సత్రముచెంత విక్రమసేనుని కగపడి నమస్కరించి పోయిన మోహనునితల్లి. ఆబాలుఁడు ముసలమ్మకు సహాయముచేయుటకై యచ్చట నియోగింపఁబడినవాఁడు. వానిపేరు మనోహరుఁడు.

రాజును, విక్రమసేనుఁడును, విక్రమసేనుఁడు నిదురించుచుండి నప్పు డాతనికడఖడ్గపాణులై నిలిచియుండినవీరులును నొకచోటఁ గూర్చుండిరి. ఆయిరువురువీరులలో నొకఁడు వృద్ధుఁడు. అతఁడే మంత్రియైన రవివర్మ. మఱియొకఁ డాతనితనయుఁ డగు ధర్మవర్మ యనువాఁడు. అతఁడు మహారాజునకు నిరంతరము నంగరక్షకుఁడై యాతనికిఁ బ్రాణప్రియుఁడై, యాతనికొఱకుఁ దనప్రాణములనైన ధారపోయుటకు సంసిద్ధుఁడై యున్న మహాధీరుఁ డగువీరశేఖరుఁడు !

"ఆకడపటసేవించినకనకకలశము—అందులో—ఏమైన—" అని విక్రమసేనుఁడు గొణుగుచుఁ బ్రశ్నించెను.

"ఏమో? ఎవరెఱుఁగుదురు?" అని రవివర్మ సంశయస్వాంతుఁడై బదులుచెప్పెను.

"మనము వైద్యునిఁ గొనిరా వేగిరపడవలయును." అని విక్రమసేనుఁడు తల్లడపడుచుండెను.

"అది నిష్ప్రయోజనము. వేయిమంది వైద్యులైనను నితని నిప్పుడు మెలఁకువతో రాజధానికిఁ గొనిపోఁజాలరు. ఆలక్షణము పైనే యగపడుచున్నది గాదా?" అని రవివర్మ బదులుచెప్పెను.

"అయ్యో! ఇఁక నెట్లు? రేపెగదా పట్టాభిషేకము!" అని విక్రమసేనుఁ డాత్రముతోఁ బ్రశ్నించెను.

ధర్మవర్మయొడలు వడఁకిపోవుచుండెను. అతని కేమి చేయుటకు నేమని చెప్పుటకును దోఁచుట లేదు.

"రాజనారోగ్యముగా నున్నాఁడనికబురంపవలెనా?" అని రవివర్మ తనలోఁ దానే ప్రశ్నించుకొని సూక్ష్మదృష్టుల నొకమా రాకసము వంకఁ బఱపి, పిమ్మట విక్రమసేనునిదిక్కు మఱల్చి "ఇప్పుడు కాకున్న మఱెప్పటికి నీతనికిఁ బట్టాభిషేకము కాదు." అని సాలోచనముగాఁ బలికెను.

"అయ్యో! అదియేమి? మఱియొకప్పు డేల కాఁగూడదు?" అని విక్రమసేనుఁడు మంత్రిమాటలయర్థమును గ్రహింపలేక, యతని పలుకులకు వింతపడుచుఁ బ్రశ్నించెను.

"ఇప్పుడే తప్పక కావలయును. తప్పినచో నిఁక నెప్పటికిని జరుగుట కవకాశము లేదు. ఈపాటి కప్పుడే దేశమంతయు నతని నాహ్వానించుటకై యెదురు వచ్చుచుండును. సర్వసేనలును—అయ్యో! వాని

కన్నిటికిని రాజసోదరుఁ డగుసూర్యసేనుఁడే సర్వాధికారిగదా!—ఎంతటి ప్రాణసంకటము తటస్థించినది!—ఇటిస్థితిలో—ఇప్పుడు—రాజుతప్పఁ దాగి యొడ లెఱుంగకుండఁ బడి యున్నాఁ డని కబురువంపుటయా?" అని రవివర్మనిట్టూర్పులు విడుచుచుఁ బలికెను.

"రాజుగా రనారోగ్యముచేఁ గదలఁజాలకున్నా రని కబురు చేయవచ్చును" అని విక్రమసేనుఁడు రవివర్మమాటను గొంచెము సవరించెను.

రవివర్మ విరక్తభావముతో హాసించుచు "ఈతనియనారోగ్య ముంగూర్చి దేశమునం దెఱుఁగనివా రెవ్వరు? ఇటువంటియనారోగ్య ములమూలముననే యింతవఱ కిన్నిపట్టాభిషేకముహూర్తములును దప్పి పోయినవి." అనియెను.

విక్ర—అలాగా? అట్లయినచోఁ బెద్దలగుమీరు మహారాజును మద్యపానవిషయమున మొదటనే వారింపవలసినది!

రవి—నేనీవిషయమై యాతనికి బోధింపని నిమిషమున్నదా? దుర్వ్యసనపరాయణులకు దూరదృష్టి యెక్కడిది? అందు నీతఁడు మహారాజకుమారుఁడు. నామాట లక్ష్యము చేయక యెప్పటి కప్పుడే యిట్లు ముప్పు దెచ్చుకొనుచున్నాఁడు. కాని నేఁడీతఁ డెంతత్రాగినను జెక్కు చెదరనే లేదు. ఆకనకకలశమునందలిమద్యము నొకగుక్కెడు త్రాగినంతనే పడిపోయినాఁడు. అందింక నేమైనవిషరసము కలిసి యుండునా?

"నాకుఁగూడ నట్లే తోఁచుచున్నది" అని విక్రమసేనుఁడు మెల్లగా ననియెను.

"ఆవిషసర్పము—సూర్యసేనుఁడు!" అనుమాటలు ధర్మవర్మ పెదవులపైఁ దేలిపోయెను.

"అవును. అన్నగారు రాజు కాఁగూడదని—అవిశ్వాసవిహీనుఁ డగుగర్భశత్రుని నీవిక్రమసేనుఁ డెఱుఁగఁడు—పోనిమ్ము! సేనలను వశపఱచుకొని నన్ను రాజుగాఁ బరిగ్రహింపవలయు నని ప్రోత్సహించు టయు నెఱుఁగఁడు. కేవలము నీతఁడు తమ్మునిమీఁదనే యాధారపడి యున్నాఁడు. ఈముహూర్తమున కీతఁడు నగరము చేరకున్న చో నీరాజితరాజ్యభ్రష్టుఁడే. నేను సూర్యసేనునిజక్కఁగా నెఱుఁగుదును." అని రవివర్మ తనముదిమిముఖమున మఱికొన్ని ముడుత లేర్పడునట్లు ముఖము ను జిట్లించి, పెదవిఁగఱచికొనుచు గొణఁగుకొనియెను.

ధర్మవర్మ చేతులతో ముఖమును గప్పుకొని బాలునివలె విల పింపఁదొడఁగెను. రాజు కదలుటయైన లేదు. తొల్లి శుక్రాచార్యునికిఁ గూడ మద్యపానమువలన నిట్టిచిక్కు సంభవించి యుండెనని రవివర్మకు జ్ఞాపకమునకువచ్చెను. అట్టిదైత్యాచార్యునిచేతనే నిషేధింపఁబడినమద్య పానమునకు బద్ధుఁడైన రాజు నావృద్ధుఁడు తనచేతులతో నిటు నటు బొరలించి తీక్ష్ణవీక్షణములతోఁ, గోప విషాద కంపితకంఠస్వరముతో "అయ్యో! రాజకుమారా! ఇంతటి త్రాగుబోతవై పోయితివేమి? నీ పాపపుమొగము చూడఁగూడదు—కాని నీవు మహారాజదినేంద్రసేనుని కొడుకవు. ఇప్పుడు మాకు మహారాజవిక్రమసేనుఁడవు. ఇట్టినిన్ను నే నెట్లు త్యజింపఁగలను? అయధర్మపరివర్తనుఁ డగుసూర్యసేననీచుఁడు రాజ్యము నధిష్ఠింపకముందే నాముదిమి నన్ను మ్రింగివైచుఁగాక!" అని పలికెను.

కొంతవఱ కందఱు నిశ్శబ్దముగా నుండిరి. కొంతవడికి, ఆలోచన తో ముడివైచిన తెల్లకనుబొమ్మలను సడలించి రవివర్మ విక్రమసేనుని వంక నాపాదమస్తకమును జూచుచు "మనుష్యుఁడు వృద్ధుఁ డగుకొలఁదిని విధినేనమ్ముచుండును. విధియే నిన్నిచటికిఁబంపెను. ఆవిధియే నీ

కిప్పుడు కాశ్మీరపట్టణమునఁ బట్టము కట్టఁదలఁచుచున్నది." అనెను.

ఆమాట విని విక్రమసేనుఁ డొకయడుగు వెనుకకు వైచి ,,అదేమి యట్లనుచున్నారు ?" అని తడఁబడుచుఁ బలికెను.

,, కుమారా ! నీ వెంతమాత్రమును గళవళపడవలదు. నీవును రాజకుమారుఁడవే గాదా ? అదృష్టవశమున నీకును మారాజకుమారునకును బోలికయే కాక కంఠస్వరముకూడ నొక్కటియే యైనది. ఈసమయమునందు మారాజకుమారునకు బదులుగా నీకే పట్టాభిషేకము చేయుట కెల్లవిధములఁ బ్రయత్నింపవలయును. ఈవిధముగాఁ జిరకాలమునుండి రాజకుటుంబమును గొలిచియున్న నేను మారాజకుమారునిరాజ్యమన్యాయముగాఁ బరాధీనము గాకుండఁ గాపాడి స్వధర్మమును నెఱవేర్చుకొనఁదలఁచితిని. ఇట్టిస్థితిలో నింతకంటె గత్యంతరము లేదు " అని రవివర్మ చెప్పెను.

విక్రమ—ఇట్లు జరగుట కేవల మసంభవము. కేవలరూపసామ్యమునుబట్టి లోకమును భ్రమింపఁజేసి రాజునుగాఁ జేయఁదలఁచుట సాహసముగాదా ? ఈరహస్యము బయల్పడకుండ నెట్లుండును? ఈదేశపు మొగమే యెఱుఁగనినేను క్రొత్తగాఁ జేరి రాజకుటుంబమునందును, బరివారజనమునందును జిరపరచితునివలె మెలంగుచు రాజుగా నటించుట యసాధ్యము గాదా ?

రవి—నాయనా ! నీవట్లు శంకింపవలదు. అన్నివిషయములను ! నేనతిజాగరూకతతోఁ జూచుకొనుచుందును. రాజువలెనే నీజుట్టును మీసములును గత్తిరింపించి మహారాజునలంకారములును దుస్తులును నీకుఁ దొడిగి నిన్నుఁ దీసికొని పోయి రాజమందిరమునఁ బ్రవేశపెట్టెదను. రేపు నీపట్టాభిషేకమున కెట్టి యంతరాయమును గలుగకుండఁ బ్రాణపణముగఁ బ్రయత్నించెదను.

విక్ర—నీవును నేను నెంతజాగ్రత్తగా మెలంగినను రాజుతోఁ జిరపరిచయముగల ప్రజలలో నొక్కరైనను నన్ను లాతివానిగా గ్రహింపకుందురా? అసాధారణుఁ డగురాజసోదరుఁడుగూడ నన్నన్నగా భావించునా?

రవి—నాయనా! చిరకాలమునుండి రాజకుటుంబమున మంత్రిగాఁ బనిచేయుచున్న నేనే యానవాలు పట్టఁజాలక నిన్ను రాజకుమారునిగా భ్రమించితిని. ఇట్టిసీవిషయమున నెవ్వరికి ననుమానము గలుగదు. నామాట వినుము! ఎంతమాత్రమును సంశయింపకుము. ఏవేవో పనులు చెప్పి పరివారజనమునంతను రాజధానికిఁ బంపి వైచితిని. వారు మనరాకను ముందుగాఁ దెలియఁజేయుదురు. ఈరహస్యము నీకును నాకును నాతనయునకుమాత్రమే గాక యితరు లెవ్వరికిని దెలియదు. నీవు దయతో నంగీకరించి „ఊఁ" అనినఁ జాలును. తక్కినపనియంతయు నేను చేసికొందును.

విక్ర—ఆఁ?

„అబ్బాయీ! మఱేమియుఁ బ్రశ్నింపకుము. ఆటంకములను దెచ్చి పెట్టకుము. నీవించుక సాహసింపకపోయినచో ధర్మనాశనకై నీచుఁ డగుసూర్యసేనుఁడు రాజగును. దుర్భాగ్యవశమున మనల నా[illegible]చుఁడు కనిపెట్టు ననియే యనుకొమ్ము. ధర్మసంస్థాపనమునకై మనమ మనతనువులను బలిసేయుదము. క్షత్రియుల కింతకంటె భాగ్యముకలదా? మనము నిర్మలులమై యున్నంతవఱ కెవ్వరికొఱకును భయపడవలసిన నిమిత్తము లేదు. ఎవ్వరును మనకు హాని చేయలేరు. ధర్మమే జయమని వినవా? ఆనీచుఁడు రాజైన నీరాజునకుఁ జీకటికొట్లో, యంతకంటెను జీకటి యగుమృత్యువో సంభవింపక తప్పదు. ఆనీచునిబారినుండి రాజ్యరమను, మృత్యువుబారినుండి యొకరాజపురుషునిఁ గాపాడుట

ణ్యము నీకు లభించునుసుమా! సుక్షత్రియపీరుఁడ వగునీకింతకంటె విశే షముగఁ జెప్పవక్కఱలేదు." అని బహుభంగుల నావృద్ధుఁడు విక్రి మసేనునకుఁ జెప్పి ప్రార్థించెను.

ఆతండిక్రోడులయద్వితీయరాజభక్తి కాశ్చర్యపడి విక్రిమసే నుఁడు సంతోషించెను. ఇక్కార్యము చేయఁదగినదా, కాదా యని యతఁడు దీర్ఘముగా నాలోచించుచుండెను. అన్నిచోట్లనధర్మమే య లముకొని యున్న ట్లనుభవమునకుఁ దోఁచుటచే విక్రిమసేనుఁడు కడుం గినుఁ జింతించి ప్రపంచమును మానవప్రికృతిని, భగవంతునిగూడ ననే కరీతుల నిందింపఁదొడంగెను. తానన్నమూలముగఁ గష్టపడెను. ఇతఁడు తమ్మునిమూలముగఁ గష్టపడుచుండెను. ఇప్పుడిరువురియవస్థయు నొ క్కటేవిధముగ నగపడెను. ఇల్లు విడిచి వచ్చునప్పుడు ధర్మస్థాపనము నకై యీలోకమునఁ బాటుపడ నిశ్చయించుకొని వచ్చినవిక్రిమసేనుఁ డిట్టిస్థితిలోఁ దనసాహసమిప్పు డత్యావశ్యక మనియే నిశ్చయించు కొనియెను.

రెండుగడియ లతఁ డట్టే యోచించుచు నిలువఁబడిపోయెను. రవివర్మ యోపిక పట్టలేక యతనిచేయిపట్టి లాగి "ఏమి?" అని ప్రిశ్నించెను.

విక్రిమసేనుఁడు "సరే.?" యనెను.

ముదుసలి రవివర్మ కృతకృత్యుఁడైనట్లు భావించి సంతోషము తో నొకచిన్నకేక వైచెను. సమయమునకు విక్రిమసేనుని బంపినభగ వంతు ననేకవిధములఁ బ్రార్థించెను.

కార్యక్రిమమునకై వేగిరపడెడు రవివర్మమనస్సు తొందరతొం దరగా నతనినోటినుండి యీమాటలను వెలిబుచ్చెను:—

"ఈయుపాయముచేఁ బట్టాభిషేకశుభకార్యము నెట్లో నిర్విఘ్నముగ ముగించుకొన్నతరువాత మనము రాజసౌధమునందే నివసించి యుండవలయును. రాత్రి నిద్రాసమయమునందుఁ బరిజను లందఱును మనలను విడిచి పోయినతరువాత రెండవకంటివాఁడెఱుఁగకుండ నీవును నేనును నశ్వారూఢులమై మరల నిచ్చటికి రావలయును. అప్పుడు మన ధర్మవర్మ మనశయనమందిరమును గాచుకొని యుండవలయును. లేకున్నచో నట కెవ్వరైనవచ్చి శయ్యలయందు మనము లేనట్లు గ్రహింపగలిగినచోఁ జాలగందరగోళము పుట్టకమానదు. అట్లు మనమిద్దఱము నిచ్చటికి మరల వచ్చునప్పటికి మనోహరుఁడు సకలోపచారములచేతను రాజును స్వస్థపఱచియుంచఁగలఁడు. అప్పుడు నేను రాజును నావెంటఁ బెట్టుకొని రాజధానికిఁ దీసికొని పోయి నీవు శయనించిన యాసెజ్జయందే యేమియు నెఱుంగనివానివలెఁ బరుండునట్లు చేసెదను. అంతటితో మన సత్ప్రయత్న మంతయు శుభసంపన్నము గాఁగలదు—సరే—ఇఁక నీమాటయెమో?—నీవుగూడ మాతో వచ్చి రాచనగరునందున్నచో మిమ్మిరువురను గాంచి సూర్యసేనహతకుఁ డనుమానింపక మానఁడు. అందువలన నాతనిదుష్ప్రయత్నములచే నెప్పటికైన మనరహస్యతంత్రము బయల్పడక మానదు. కాఁబట్టి నీవప్పుడు పరోపకారధర్మఫలమునే ప్రతిఫలముగఁ గైకొని యిటనుండి భూతముచే వెన్నాడఁబడిన వానివలె నెవ్వరికంటను బడకుండఁ బలాయితుఁడవు కావలయును. మహారాజకుమారుఁడవగునీవు స్వధర్మనిర్వహణమునకై, నాప్రార్థనమును మన్నించి స్వార్థత్యాగివై యిమ్మహాకార్యనిర్వహణమునకుఁ గడంగవలయును"

ఈమాటలవలన ధర్మవర్మహృదయమునఁ శాంతి[illegible] కలిగెను. ఆతఁ డొక్కనిట్టూర్పువిడిచి "బ్రదికితిని" అనుకొనియెను.

విక్రమసేనుఁడు దేవునిపై భారము వైచి ,, అట్లే కానిండు! ఈశ్వరానుగ్రహముచే మనసత్ప్రయత్నము ఫలించుఁగాక!" అనియెను.

రవివర్మ మనోహరుని రహస్యముగాఁ బిలిచి, యించించుక వీరి పన్నుగడ నెఱుఁగుకొలఁది వడఁకుచుండినవానికి ధైర్యము చెప్పుచు సర్వమును నివేదించివైచి వాఁడాపిమ్మటఁ జేయవలసినకార్యమును జెప్పి జాగ్రత్త యని హెచ్చరించెను. వాఁడు మంత్రియానతిని విక్రమసేను నిగడ్డమును గొఱిగి రాజువలె నాతనిశిరోజములను గత్తిరించెను.

"సరే. ఇప్పుడు మనము రాజు నెచ్చట దాఁచనలయును!" అని ధర్మ ప్రశ్నించెను.

రవి—ఈసామానులకొట్టునందు శయనింపఁజేయుదము. మనము వచ్చునఱకు మనోహరుఁ డీతనికుపచారములు చేయుచుఁ గాపాడుచుం డఁగలఁడు!

అనినంతనే ధర్మవర్మ పోయి యాకొట్టుతలుపులను దెఱచెను. రవివర్మ రాజునవలీలగా నెత్తుకొని యాగదివైపునకుఁ దీసికొని పోవుచుం డెను. ఇంతలో మోహనునితల్లి యగుముసలిది వచ్చి యాతని కగప డుటచే రవివర్మ యదరిపడి చటాలున నొకయడుగు వెనుకకువైచెను.

అది చూచి ధర్మవర్మ కలంగుచు ,, ఈమె మనమాటల నన్ని టిని విన లేదుగద! మనరహస్యమంతయు నీముసలిముండ గ్రహించిన దేమో?" అని మెల్లగా ననియెను.

,, భయము లేదు. నేను దానికిఁ దగినశాస్తి చేసెదను" అని పలుకుచుఁ గళవళముతోనే రవివర్మ రాజు నాగదిలోనికిఁ జేర్చెను.

పిమ్మట నాతఁడు మరల వచ్చి విక్రమసేనునిగూడ నాగదిలో నికిఁ గొనిపోయి రాజుఖడ్గమును, పట్టాభిషేకమునాఁటి కని రాజున కేర్పా టుచేయఁబడినదుస్తులను, రాజుపాదరక్షలను నతని కలంకరించెను.

రవివర్మ యామెుదుసలిని దీవ్రముగా ననుమానించి, యేపాప మెఱుఁగ నని యెంతమెుఱపెట్టుకొన్నను వినక యామెను బంధించి, నోట గుడ్డలుగుక్కి రాజుండినగదికి ప్రక్కనేయుండినమఱియొకగదిలోనుంచి బీగము వైచి, మనోహరున కొప్పగించి ‹‹ ఓయీ ! ఈమె తప్పిపోకుండఁ జూచుకొనుచుండుము ! మేము మరలవచ్చువఱకును రాజరక్షణ భారమంతయు నీపై నున్నదిసుమా !” అని యుగ్గడించెను. మనోహరుఁడు చిత్తమని యంగీకరించెను. ‹‹ అంతయుసరిపోయెనా ?’’ అని విక్రమసేనుఁడు రవివర్మను బ్రశ్నించెను.

‹‹ ఒక్కటియు సరిగానున్నట్లు ధైర్యములేదు. కాని మనమేమియు నింతకంటె నెక్కుడుగాఁ జేయఁజాలము.”

* * * *

రవివర్మధర్మవర్మ లుచితవేషములతో ఖడ్గపాణులై రాజైన మనవిక్రమసేనునకు నమస్కరించిరి. ముప్వురు నశ్వారూఢులై శరవేగమునఁ బోఁజొచ్చిరి. మానవకల్పితమగునాటక మేమో యారంభింపఁబడినది. భగవంతుఁడు సూత్రధారియై యాడించునాటకములపరిణామ మెట్లుండునో యెవ్వ రెఱుంగఁగలరు ? హ్వానించి

ందిరమునకు

ును వచ్చిరి.

ులుఁ బ్రతి

మునకు

ఎనిమిదవ ప్రకరణము.



" అన్నచోట్లను నీమాయ - లద్భుతంబు
లచటఁ గల దిట లేదటం - చనఁగ రాదు,
ఒకవిధంబుగఁ దోఁచి మ - ఱొకవిధంబుఁ
జెందు నీమాయ మృగతృష్ణ - చందముగను."

(' చిలుక ')

త్రోవలో ధర్మవర్మ మూఁగవానివలె నేమియు మాటాడకుండె ను. రవివర్మ తీరిక లేకుండ విక్రమసేనున కాయాసంగతులు బోధించు చుండెను. రాజు పూర్వచరిత్రము, రాజున కిష్టమైన యాటలు, పాటలు, ..జనములు చెప్పి రాజువలె మెలఁగు మని బోధించెను. రాజవంశము ..గుఱించియు, వారివారి లోపములగుఱించియు, రాజునందలి లోపము ..గుఱించియు, రాజుయొక్క స్నేహితులనుగుఱించియు, సేవకులను ..ఱించియు, ముఖ్యముగాఁ దెలిసికొనఁదగిన పెద్దమనుష్యులగుఱించి ..గాఁ దెలియఁజెప్పెను. ఎప్పుడు నతనికడనే యుండి సమస్త ..ంచుచు, సూచించుచునుండెదనని రవివర్మ ధైర్యముచెప్పెను. ..యకుఁడు ప్రభామయంబగు స్వాంశువైభవముతో నభో ..క వచ్చుచుండెను. రాజధానియందలిజనులును మహా .. దమనాయకుఁ డీపాటికి వచ్చుచుండు నని యెదురుగాఁ ..

రాజధానిని సమీపించుటతోడనే తనగుఱ్ఱము నించుక వేగము ..ంచి రవివర్మ " ఇది మీరాజధాని మహారాజా !" యని మెల్లగఁ బలుకుచు విక్రమసేనునిగుండియపైఁ జేయివైచి " ఇంతవేగముగాఁ

దడదడఁ గొట్టుకొనుచున్న దేమి ?" అని తడబడుచుఁ బ్రశ్నించెను.

„ మనము చేయనున్నది సాధారణసాహసకృత్యమా ? ఎట్టియప టును లేకయుండుటకు నేను పాషాణప్రతిమ ననుకొంటివా ?" అని విక్రమసేనుఁడు బదులుపలికెను.

రవివర్మ „ మహారాజురాక ముందుగా నెఱింగింతము." అని విక్రమసేనా !—„ అంగుళమంగుళమునకును నీవు మహారాజవిక్రమసే నుఁడవే " అని విజయసూచకముగా నతనిదిక్కుఁ జూచుచు సంతోష ముతోఁ బలికెను.

„ తథాస్తు !" అని ధర్మవర్మ నుడివెను.

వారు ముగ్గురును నగరద్వారముఁ జేరిరి. రవివర్మధర్మవర్మలు గుఱ్ఱములను దిగి రాజును గౌరవపూర్వకముగా దింపిరి. రాజు (మన విక్రమసేనుఁడు) భయపడుచు దనముఖమును శిరస్త్రాణముతోఁ గప్పు కొనెను. అతఁ డొకసారి యాకసమువంకకుఁ గరములు మోడ్చి పురా భిముఖుఁడై నడువఁజొచ్చెను.

క్షణములో నంతయుఁ గోలాహలమయ్యెను. గజాశ్వదళముల నుండి ఘీంకారములు, హేషలును, సైనికులనుండి జయఘోషలును కులకుధరములను గంపింపఁజేయుచుండెను. రాజప్రతినిధియు, రాజసోద రుఁడునగు సూర్యసేనమహారాజు తనయగ్రజుఁడగురాజు నాహ్వానించి గౌరవించుటకై కొలువుదీరి యుండెను. ఆపట్టాభిషేకమందిరమునకు రాజును గొనిపోవఁ జతురంగబలములును సామంతాదులును వచ్చిరి. జయజయధ్వనులతో, నృత్యగీతవాద్యంబులతో నలుదిక్కులుఁ బ్రతి ధ్వనించుచుండెను.

„ దేవుఁడు రాజును గాపాడుఁగాక ! మహారాజవిక్రమసేనునకు జయ " అనుధ్వనులు ఘెల్లున రేగెను. రవివర్మమునలిపెదవులపై నొక

దరహాసము వెలిలెను. "దేవుఁడు వారిరువురను గాపాడుఁగాక!" అని రవివర్మ మెల్లగ ననుకొని విక్రమసేనుంగాంచి "అబ్బాయీ! ధైర్యము వహింపుము." అని రాజగు నాతనికి మర్యాదచేయువారిలో మొదటివాఁడై ఖడ్గము నడ్డముగాఁ బట్టుకొని యాతనియెదుట మోకాళ్లపైఁ గూలఁబడెను.

వివిధోన్నతోద్యోగులతోఁ బరివేష్టితుఁడై కవచధారుఁడై చిగురుటాకులవలె నెఱ్ఱఁబాఱుచుండిన వెండ్రుకలు కలిగినమధ్యవయస్కుఁ డొకఁడు రాజు నాహ్వానింప నెదురువచ్చెను. అనేకయుద్ధములందు గెలిచినకతమునఁ గాశ్మీరరా జొసఁగిన స్వర్ణమణిమయాలంకారము లాతని వీరాంగికముల వెలుఁగుచుండెను. అతఁ డించుకపొడవుగాఁ దనకుఁ దగినఖడ్గమును ధరించి యుండెను.

"సేనాధిపతి సాగరవర్మ" అని రవివర్మ విక్రమసేనుని చెవిలో నూదెను.

"సూర్యసేనుఁడు మహారాజును బట్టాభిషేకమంటపమునందే యాహ్వానింపఁదలఁచి యెదురు రాసందులకు క్షమింప వేఁడె" నని సాగరవర్మ రాజునకు నివేదించెను. విక్రమసేనుఁడు తల యూచి చిఱునవ్వు నవ్వెను.

ప్రసిద్ధపురుషు లందఱును గ్రమక్రమముగా వచ్చి రాజునకు జోహా రొనరించిరి. అదృష్టవశమున రాజు నెవ్వరు ననుమానింపలేదు! అందువలన విక్రమసేనునిదడదడఁగొట్టుకొనుచుండినహృదయము కుదుటబడఁజొచ్చెను.

రాజశ్వము నెక్కెను. రవివర్మసాగరవర్మలిరువురు నతని కిరుప్రక్కల రాఁగా నందఱు నశ్వారూఢులై నిర్ణీతస్థలమునకు మహాసమారోహముతోఁ బురమధ్యమునుండి పోఁజొచ్చిరి.

కాశ్మీరనగరమునం దర్ధభాగము క్రొత్తగాఁ దీర్చి కట్టఁబడినది. మిగిలినయర్ధభాగము ప్రాఁతది. క్రొత్తకాశ్మీరమునందలి వేడుకలు చెప్పఁ దరముకాదు. తమతమ రాజభక్తిని వెల్లడించుచు రాజున కచ్చటివారు నానావిధోపహారములొసంగుచు, మంగళహారతులిచ్చుచు గౌరవించుచుండిరి. జెండా లెగురుచుండెను. జయజయశబ్దముల కంతమే లేదు. మేడలపైఁ బురకాంతలు సేసలు చల్లుచుండిరి. ఆయంగనలు రాజును జూచి సంతోషముతో హస్తకంకణములు మ్రోయఁ జప్పట్లు చేయుచుండిరి. ఒకవారాంగన రాజుమెడలో సరిగా పడునట్లు రోజాపుష్పముల దండ సరిగా విసరివైచెను. దానిని జూచి సేనాధిపతి నవ్వెను. విక్రమసేనుఁడును నవ్వుచు "కాశ్మీరరాజునకుఁ దగినసత్కారపుష్పములనే యామె యొసఁగినది. సేనానీ! చూచుము? నామేనికాంతి పుష్పహారకాంతితో శోభించుచున్నదిసుమా!" అని చమత్కరించెను.

విక్రమసేనుఁ డిట్లు తనభయమును బూర్తిగా విడిచివైచెను. ధైర్యముతో నారాకుమారుఁడు రాజునతనే మోఁగుచు, నల్గురివంకఁ జూచుచు వారిజయజయశబ్దముల కలరి యంగీకారభావముతోఁ జిఱునవ్వుతోఁ దల నాడించుచుండెను.

రాజాకనారి తన్నాశీర్వదించుచుండినగరనారీముఖములను జూచి చుట్టుప్రక్కల నందఱిని ప్రసన్నవదనముతోఁ గనుఁగొనియెను. అంతలో నాప్రసన్నవదనమును మఱల నీవలకుఁ ద్రిప్పి యదరిపడెను. ఒకకాంత యాతనినాపాదమస్తకమును దేఱిపాఱఁ జూచుచుండెను. ఆమె రాజు తనవంకఁ జూచినప్పుడు గుర్తుపట్టి యదరిపడి నీగుట్టు తెలిసికొంటి ననుగర్వముతో వికటముగా నవ్వెను.

విక్రమసేనునిచేయి కత్తిపైఁ బోయెను. కాని యంతలోనే యాకాంతని సంకల్పము తిరిగిపోయెను. ఇట్టుడు రాజు కాఁడని యామె యంగలలో

నఱచినచోఁ దనగుట్టు బయటఁబడి యమాయకులప్రాణములమీఁదికి వచ్చి యారంభింపఁబడిన ధర్మకార్యము నాశనమగునుకదా! యని యాతఁడు శంకించెను.

ఆకాంత విక్రమసేనుఁ డెక్కివచ్చిన నావలో లంకనుండి భరతదేశమున కతనితోఁ గూడ వచ్చిన చక్రసేనయే. దేశభ్రష్టుఁ డగుతన్నెఱింగిన స్త్రీ యొకతె యిచ్చటి కెందులకు వచ్చెనో, తమకార్యముల కెట్టి భంగముఁ గలుగఁజేయునో యని విక్రమసేనుఁ డాలోచించుచుండెను.

వారు ముందునకు సాగి ప్రాతకాశ్మీరమును బ్రవేశించుచుండిరి. సేనాధిపతి కొందఱుసైనికులను రాజునకు దగ్గఱగా నుండ నియమించెను. అందుచేఁ బురమం దాభాగము రాజుపై విశ్వాసము లేసిదని విక్రమసేనుఁ డూహించెను.

ఆభాగము క్రొత్తకాశ్మీరమువలె నలంకరింపఁబడి యుండలేదు. జయజయధ్వనులును కొంచెముమాత్రమే. అవియు మనస్ఫూర్తిగా వచ్చుచున్నట్లు కనఁబడలేదు. ఎచ్చటఁజూచినను సూర్యసేనుని చిత్రపటములే కాని రాజుది యొకటైన లేదు. ఇచ్చటివారి నందఱిని సూర్యసేనుఁడు తనవశము చేసికొనియుండెను. వారిసహాయముతో నితరభాగమునుగూడ వశపఱచుకొని తానే రాజు కావలె నని రాజునకుఁ బట్టాభిషేకము గాకుండఁ బన్నుగడలఁ బన్నుచుండెను.

కడకు వారందఱును పట్టాభిషేకమంటపమునకు వచ్చిరి. విక్రమసేనుఁడు తననిజస్థితిని దలఁచి యొకించుక నిశ్చేష్టితుఁ డయ్యెను. అతని గుండె ఝల్లుమనెను. అతఁడు గుఱ్ఱము దిగునప్పుడు భూమి తిరుగుచున్నట్లు పొడకట్టెను. దిగి నిలువగా సర్వము నంధకారమైన ట్లగపడెను. అతఁడొకక్షణము ముకుళితనయనుఁడై జగన్నాథునిఁ బ్రార్థించెను.

అతఁ డెట్లో లోపలి కేఁగఁగలిగెను. కట్టెదుట నుండినయిద్దరు

మాత్రి మాతనియంధకారమును దొలగించిరి. అందులో నొక తేయువతి. రూపవతి యగునామెశిరముపై నున్న కిరీటమా మెకు నూత్నవిలాసము నిచ్చుచుండెను. ఆమె యేకారణముచేతనో తనప్రక్కనున్న పురుషునిఁ జూచినప్పు డెల్లఁ దెల్లవోవుచుండెను. ప్రక్క నుండినట్టియు, విక్రమసేనునిదృష్టి నాకర్షించినట్టియు పురుషుఁడు సూర్యసేనుఁడే. విక్రమసేనునిఁ జూచినంతనే సూర్యసేనుఁడు వివర్ణుఁడయ్యెను. దిగ్భ్రమఁ జెందినయతనిశిరస్త్రాణము భూమిపైఁ బడి మంటపమును బ్రతిధ్వనింపఁ జేసెను.

తరువాత నేమయ్యెనో విక్రమసేనుఁ డెఱుఁగఁడు. గద్దియ సమీపించి మోకాళ్లపై గూర్చుండి యతఁడు నమస్కరించెను. పురోహితుఁడభిషేక మొనరించెను. తరువాత నతఁడు లేచి చేయి సాపి పురోహితునికడనుండి కాశ్మీరకిరీటము నందుకొనెను. తనతలపై నుంచుకొనెను. ప్రజారంజకుఁడై పాలనచేసెద నని బాసచేసెను. జయజయధ్వనులు నెసఁగెను.

ఇంతవఱకు నెదుట నిలిచియున్నయువతి యప్పుడు రాజును సమీపించెను. ఆసమయమున బట్టువాఁడొకఁడు ,, కోసలరాజపుత్రిమదనకళాదేవి. '' అని చాటిచెప్పెను. ఆమె యెవ్వతెయో, ఆమెకడ నెట్లు ప్రవర్తింపవలెనో విక్రమసేనుఁ డెఱుఁగలేక రవివర్మవైపుఁ జూచెను. రవివర్మయు నామెనిషయమై చెప్ప మఱచిపోయెను. వచ్చి తనకు నమస్కరించినయారాజకన్యను లేవనెత్తి రవివర్మసైగ నించుక గ్రహించి విక్రమసేనుఁ డామెచేయి పట్టుకొని తనప్రక్కనే నిలువఁబెట్టుకొనియెను. పిమ్మట రాజసోదరుఁడు సూర్యసేనుఁడు తెలతెలవోవుము ఖముంతోఁ దడబడు నడుగులతో వచ్చి రాజుముందఱఁ గూలఁబడెను. రాజాతని లేవనెత్తి నడఁకుచుండినతమ్ముని బ్రేమపూర్వకముగాఁ గౌఁగిలించుకొ

సియెను. ఆ గౌరవాచార్యుఁడు పోయిన వెంటనే విక్రమసేనసూర్యసేను లిరువురికి రాఁగే యొంటరులు విడిచిపోవలెనని తమలోఁ దాము తొందరపడచుండిరి. ఆ కాసంతపనియు నిట్లో ముగించుకొని యిరువురును విడిపడ బంధముక్తులైనట్లు సంతోషించిరి.

రాకుమారిముఖమందుఁ గాని మఱియెవ్వరియందుఁ గాని సంశయాంకుర మింతయును గనఁబడ లేదు. ఆమె కాని మఱి యెవ్వరు కాని విక్రమసేనుఁడు రాజు కాదని యెట్లూహింపఁగలరు? అట్లని కలనైనఁ దలఁపలేదు. ఈవిధముగా విక్రమసేనునియందున్న రాజుపోలిక సమయమున కుపచరించెను. యావజ్జీవము రాజైనవానివలె నాతఁడు గంటలో భూభారమును దెలిసికొని యలసిపోయెను.

నానాదేశపురాజులును, వీరులునుగూడ నాయుత్సవమును దిలకించి సంతోషించిరి. లంకాపురసైనికులలో నొకఁడు చిత్రవర్మయను వృద్ధవీరుఁడుగూడ నచటికి వచ్చియుండెను. లంకారాజసోదరుఁ డగువిక్రమసేనుని నతఁడు నూఱుసార్లకుఁ దక్కువ చూచియుండఁడు. అట్టిపరిచయముగలవాని నేత్రములనుగూడ విక్రమసేనుఁడు తప్పించుకొనెను.

తరువాత నందఱును రాజసౌధమునకు బయలుదేఱిరి. కొందఱా పట్టాభిషేకమంటపమున సూర్యసేనునకు జయ మని యఱచుటను విక్రమసేనుఁడు వినెను. సూర్యసేనుఁడు గోళ్లుగిల్లుకొనుచు నాలోచనానిమగ్నుఁడై కూర్చుండియుండినట్లు ధర్మవర్మ రాజుతోఁ జెప్పెను

ఇప్పుడు విక్రమసేనుఁ డొకరథము నధిరోహించి బయలుదేఱెను. అతనిప్రక్కనే మదనకళయుండెను.

“మహారాజా! వివాహ మెప్పుడు.” అని మోటువాఁడైన భటుఁ డొకఁడు ప్రశ్నించెను. రాజపుత్రి విక్రమసేనునివంక నొకసారి చూచి తలవంచుకొనెను.

విక్రమసేనుఁ డిప్పుడు చెప్పరానిచిక్కులో నుండెను. ఒకచక్క నిపండు విక్రమసేనునివంటి రాజపురుషునిచేతఁ దినఁబడుటకుఁ గుతూహలపడుచుండెను. అది విక్రమసేనునకే లభ్యమై యుండెను. కాని ధర్మయుక్తముగా దాని నాతఁ డనుభవింపలేకుండెను.

భటుఁడు వేసినప్రశ్న కెట్టియుత్తరము చెప్పవలెనో విక్రమసేనునకుఁ దెలియలేదు. వివాహ మెప్పుడు నిశ్చయింపఁబడి యుండెనో, పెండ్లిమాట లెంతవఱకు జరగియుండెనో రవివర్మ చెప్పుటకు మఱచిపోయెను. ఈమెసంగతి విక్రమసేనునకుఁ దెలియనే తెలియదు. అందుచే నతఁ డేమియుఁ బ్రత్యుత్తర మియ్యలేదు.

"రాజపుత్రా! నీయం దొకవిధమైన నూతనకాంతియుఁ, గ్రొత్తమార్పును గనఁబడుచున్నది." అని రాకుమారి తనసిగ్గును దోపనీయక పలికెను.

అందులకుఁ గారణము తాను నూతనపురుషుఁ డగుటయే యని విక్రమసేనుఁ డెఱిఁగి యేమియుఁ బలుకలేదు.

ఆమె మఱల "నీముఖము మునుపటికంటె గంభీరముగాఁ, బ్రశాంతముగా నున్నది. నిన్నేదో దీర్ఘవిచారము బాధించుచున్నట్లున్నది. నీవు చాల చిక్కిపోయి యున్నావు. నిన్నంతగా బాధించువిచార మేదియు నుండఁగూడదనియే నావిశ్వాసము!" అనియెను.

"అది నీకు సంతోషకరమేనా?" అని చిఱునవ్వుతో విక్రమసేనుఁడు మృదువుగాఁ బ్రశ్నించెను.

"హా! నీక్షేమమే నాసంతోషము. నాచిత్తవృత్తులను నీవు బాగుగా నెఱుఁగుదువు." అని యామె తనదృష్టులను సిగ్గుతో విక్రమసేనునినుండి మఱల్చెను.

"నీకు సంతోషమైనదానినే నేనెప్పుడును చేయఁదలఁచెదను."

,, నీవు సూర్యసేనునీదినమున బాగుగాఁ బరికించితివా ?"

,, చూచితిని. ఏమో కాని యాతఁ డుల్లాసముగా నున్నట్లగ పడలేదు."

,, దయచేసి నీవు జాగ్రత్తగా నుండఁగోరెదను. నిజముగా నీవు —నిజముగా నీవు—నీవాతనివిషయమై జాగ్రత్తగా నుండుట లేదు. తెలిసినదా ? ఇఁక నైన నీసంగతి జ్ఞప్తియం దుంచుకొని ప్రవర్తింపవలయును. లేకున్నచో నపాయము సంభవింపకమానదు."

,, ఓను. నాసర్వాధికారములను వశపఱచుకొనవలయు నని యాతఁడు కోరుచున్నట్లు నేనెఱుఁగుదును !''

వారు రాజసౌధమును సమీపించిరి. స్తోత్రపాఠకులు పొగడు చుండిరి. వాద్యములు మ్రోగుచుండెను. శంఖములు వాగుచుండెను. రాజసౌధముఁ జొచ్చి గౌరవింపఁబడి, విక్రమసేనుఁడు మదనకళతో విందారగించెను. రవివర్మ నిముసమైన నెడఁబాయక విక్రమసేనుని వెను కనే యుండి సమయమునకుఁ దగినయాలోచనల నిచ్చుచుండెను.

ఆహా ! విక్రమసేనుఁ డేదేశమువాఁడు ? ఎచ్చట సంచరించు చుండెను ? ఎట్టిస్థితిలో దేశమును విడిచివచ్చెను ? ఇప్పు డెట్టిస్థితియం దుండెను ? దేశభ్రష్టుఁడై ప్రపంచమును రోసి యేమని నిశ్చయించెను? రోసియుఁ బ్రపంచమధ్యమున నీచమానవుల కధిపతియై యెట్లుండుట కంగీకరించెను ? అహో ! విధివిధానములనుల్లంఘనీయములు కదా !

---

# తొమ్మిదవప్రకరణము



" చూడఁ గ్రూరుఁడై కన్పట్టు - సూర్యుఁడెలమిఁ
బరమమిత్రుఁడై జగతినిఁ - బరగుకరణిఁ,
గష్టదశనార్తులకునీదు - కరుణకూడ,
హాలహలమైనఁ, బిమ్మట - నమృత మీశ "

("చిలుక.")

తనదేశభ్రష్టత్వమునకు నీశ్వరునియాశయ మేమో యైయుండు నని ముందుగానే విక్రమసేనుఁ డూహించెను. అట్లే యిచ్చటికి వచ్చి ధర్మపరుఁడై మహాకార్యమునే చేయుచుండెను. నిష్ప్రయోజకుఁ డని వదినెచే నిందింపఁబడినయాతఁ డిప్పుడు గందరగోళమునఁ బడి విధ్వస మైపోవనున్న కాశ్మీరరాజ్యమును రక్షించుటకుఁ బ్రధానాధారుఁ[illegible]ను. భగవంతుఁడు విధించినకష్టములాసమయాన విషమవిషలతలుగాఁ దోఁచినను, గాలాంతరమునందవి యిచ్చుఫలము లమృతమధురములు కదా!

ధర్మవర్మరవివర్మవిక్రమసేనులు రాజశయనమందిరమునకు వచ్చిరి. విక్రమసేనుఁ డుస్సురనుచు నొకపడకపైఁ గూలఁబడెను. విక్రమసేనునివిజయమునకు రవివర్మ సంతోషమును వెలిబుచ్చలేదు. పైకి చూపకున్నను రవివర్మధర్మవర్మలు కార్యము కొనసాగినందులకు సంతోషించుచుండిరనియే విక్రమసేనుఁడు కనిపెట్టెను.

"మఱపునకురానట్టి యెంతటివింత నీజీవితమధ్యమున సంభవించినది!" అని రవివర్మ పలికెను. "నిక్కముపలుకవలెనన్న నొకనిము

స్థమైన రాజై యుండవలయునని నాకుఁ గోరిక యున్నది." అని విక్రమ సేనుఁడు పలికెను.

,, కాని రాకుమారా ! నీహృదయమును నీనటనతోఁ బూర్తిగాఁ బోనియ్యకుము. సూర్యసేనుఁ డిప్పుడు సూర్యకిరణమువలె వెలవెలఁ బోవుచుండెను—నీవును రాజపుత్రియు నతనిగుఱించి యెంతయో మాటలాడుకొంటిరికదా ?" యని రవివర్మ మెల్లగా ననియెను.

"అహో ! ఏమాె రూపము! నిజముగా మదనకళయే!" యని విక్రమసేనుఁ డొకనిట్టూర్పు పుచ్చెను.

రవివర్మ యింక నాప్రసంగమును మార్చి ,, మనమింక రాజును గొని తెచ్చుటకై త్వరపడవలయును. ఆలస్యము చేసినచో గార్యము మించిపోవును. నీవు సిద్ధముగా నున్నావా ?" అని హెచ్చరించెను.

,, ఆహా !" యని విక్రమసేనుఁడు మఱియొకనిట్టూర్పుతోఁ బలికెను.

ఇప్పటియాత్మనిత్యాగ మెంతదుస్సహమైనదో చిరకాలలోకానుభవముగల బుద్ధిమంతుఁ డగురవివర్మ బాగుగ గ్రహింపఁగలిగెను. అందుచే నాతఁడు విక్రమసేనుని మనస్సంతుష్టికొఱకుఁ బరోపకారపరమధర్మముం గూర్చి యనేకవిధముల వినుతింపఁదొడఁగెను. అప్పటికి జాము రాత్రి యైనది. అప్పుడు విక్రమసేనుఁడు నవ్వుచు ,, ఇఁక గొంతసేపటిలో మహారాజవిక్రమసేనుఁడు కేవలవిక్రమసేనుఁడు కాఁగలఁడు ?" అనియెను.

ఆమాటకు భావగ్రహణపారీణుఁ డగురవివర్మహృదయము జల్లుమనియెను. ప్రాణపవనములుగూడ సంచలించిన ట్లాతఁ డొకనిట్టూర్పు విడిచి ,, కుమారా ! నీవు తొల్లిటిశునశ్శేపుని మించినయాశ్వర్యప్రియుఁ డగుముద్దుబిడ్డవు ! ఆతఁడు తనకుటుంబరక్షణముకొఱకుఁ బ్రాణముల నర్పించుటకు సిద్ధపడియెను. మఱి నీవో—త్యాగాత్మా-లీనపరిదీపితుఁడగు

పెరధరణీశ్వరుఁడవై సర్వస్వము నర్పింపఁగలిగితివి. ఇట్టినీనిర్మలకీర్తిచరిత్ర ము లోకమునకవగతము గాకపోయినను బ్రపంచగర్భమున నంతర్లీనమై విశ్వచైతన్యమువలెఁ బ్రళయాంతమువఱకును బ్రకాశించుచు సాధుపురుషులసదవతారములకు మూలకారణ మగుచుండుఁగాక! నాయనా! నీజీవితము సార్థక మైనది. నీవు ధన్యుఁడవు!" అని ప్రబోధించెను.

ఆప్రబోధముచే స్వధర్మనిర్వహణదీక్షాపరుఁడగువిక్రమసేనునకు లోభముగ్ధమగుసాధారణమానవస్వభావము దూరీకృతమైపోయెను. అప్పు డాతఁడు నిశ్చలవిమలహృదయముతో "అయ్యా! ఇఁక ననంతరకర్తవ్యమేమో నిశ్చయింపుఁడు!" అనియెను.

రవివర్మ యప్పుడు ధర్మవర్మం గాంచి "కుమారా! ప్రస్తుత మాడఁబోవునాటకము రాజు నిద్రించుచున్నట్లు ప్రదర్శించుటయే. ఈ కార్యభార మంతయు నీతలపైఁ బెట్టి మేము పోవుచున్నాము. నీవీ శయనమందిరద్వారమును గడుజాగరూకతతోఁ గాఁచికొని యుండవలయును. బల్లునఁ దెల్లవాఱువఱకు నెవ్వరును—ఎవ్వరినిగూడ నీవిట నడుగుపెట్టనీయఁగూడదుసుమా! మేమిందు లేనట్లెవ్వరు గ్రహించినను జాల నుపద్రవము గలుగకమానదు. తరువాత మాకు వార్త దెలుపుటకైనను నీజీవితము నిలుచుట యసంభవ మగును. తెలిసినదా?" అని హెచ్చరించెను.

"మీరింతగా బోధింపనక్కఱ లేదు. చేయవలసిన కార్యభారమును నాపై వైచి మీరు మీపనులను నిశ్చింతులై చేయుచుండుఁడు." అని ధర్మవర్మ తండ్రికి బదులుచెప్పెను.

"ఇదిగో! ఈచొక్కాను ధరింపుము. ఈకుళ్లాయిని నీతలకుఁ దగిలించుకొనుము. నల్లకొండదగ్గఱ వేటగృహమునకుఁ బోవువారివలె మనము వేషములను ధరింపవలెను. నీవు నాయకునరునివలె నటింపవ

లెను." అని కొన్నినూతనవస్త్రముల నిచ్చి రవివర్మ విక్రమసేనుని దొందరపెట్టెను.

"సరే. సిద్ధముగా నున్నాను." అని విక్రమసేనుఁడు నూతనవస్త్రధారియై పలికెను.

ధర్మవర్మ తనచేయి నెత్తి యేమో పలుకఁబోవుచుండఁగా రవివర్మ "ఇప్పు డేమియు మాటలాడకుము." అని వారించి "రమ్మని విక్రమసేనుని వెంటఁబెట్టుకొని ద్వారముపై పునకుఁ బోక, యొక గోడమూలకుఁ బిలుచుకొనిపోయి "ముసలిరాజుకాలమున నీరహస్యమార్గము నిర్మింపఁబడినది. ఈమార్గము నాకుఁ జక్కఁగాఁ దెలియును. నీవు మాటాడకుండ నా వెనువెంటనే రమ్ము!" అని బోధించెను.

వారిరువురును ముందునకుఁ జీమచిటుకుమన్న వినుచుఁ బోవుచుండిరి. వారిట్లు సుమారు రెండువందలరహస్యద్వారములను దాఁటిరి. కడ కొకకట్టెతలుపును జేరిరి. దానికి వేసియుండినబీగమును రవివర్మ తెఱచెను. వెలుపల నొకఁడు రెండుగుఱ్ఱములను బట్టుకొని సిద్ధముగా నిలిచి యుండెను. అది నిశ్శబ్దమై జనసమ్మర్దములేని రాజోద్యానవనముల వెనుకనుండువీధి. గుఱ్ఱము నెక్కు మని రవివర్మ విక్రమసేనునకు సైగ చేసెను. గుఱ్ఱములిచ్చినమనుష్యునితో నొకమాటయైన మాటాడక యిరువురును గుఱ్ఱములపై నెక్కి వెడలిపోయిరి. పురమం దింకను జనులయొక్కయు, భేరీలయొక్కయు కోలాహలము తగ్గియుండలేదు. అందుచే నిర్జనమైనత్రోవలఁ బడి వారిరువురును ముందుకు సాగిపోవుచుండిరి. కడకు వారు నగరప్రాకారద్వారమును జేరిరి. "ఆయుధమును సిద్ధముగా నుంచుకొనియుండుము." అని రవివర్మ మెల్లగా ననెను.

రవివర్మ ద్వారపాలకుని బిలిచెను. అదృష్టవశమున నచట నొక బాలుఁ డుండెను.

"అయ్యా! మానాయనగారు రాజును దర్శించుటకై వెళ్లినారు. తలు పెవ్వరికిఁ దీయరాదని యతనియాజ్ఞ " చిత్తగించవలెను. " అని యాబాలుఁడు సవినయముగాఁ బలికెను.

,, అబ్బాయీ! మాకు రాజాజ్ఞ యైనది. ఇదిగో ఆజ్ఞాపత్రము—అందిదిగో రాజముద్ర!" అని తానే కష్టపడి వేసియుండిన రాజముద్రను రవివర్మ వానికిఁజూపి యొకబంగారునాణ్యమును వానికిఁ గానుకగా నిచ్చుటతోడనే మఱేమాటంకమును లేకపోయెను.

వారిరువురు నవతలి కేఁగి ద్వారముల నెప్పటిధనమున మూసివైచిరి.

,, రాకుమారా! మనమింకను బురసమీపముననే యుండుటచే వేగముగాఁ బోయిన సంశయకారణ మగును." అని రవివర్మ పలికెను గాని యచట చుట్టుపట్ల నంతయు నిర్జనమై యుండుటచే నట్టియాపద యేమియుఁ గనఁబడలేదు.

,, ఘేకేశ్వరపురమునుండి సూర్యసేనున కేదో ఉత్తరము వచ్చినదని గూఢచారులు నీకెఱిఁగించిరి కదా? ఆయుత్తరమునం దేమిచెప్పుచున్నదోయని యాశ్చర్యమును, రాజురహస్య మేమైన నది వెలిపుట్టుచుండెనో యని భీతియును గలుగుచున్నది." అని విక్రమసేనుఁ డనెను.

,, నేనును దానితత్వ మెఱుఁగలేక భయాశ్చర్యములకు లోనగుచున్నాను." అని రవివర్మయును వ్యాకులపడుచుఁ బలికెను.

వారు మఱేమియు మాటలాడక గుఱ్ఱములను వడిగా నడిపించుచు నిరువదియైదుమైళ్లు పోయిరి. మెల్లగా నాకస మెక్కి వచ్చుచుండినచంద్రుఁడు వారి కారాత్రి యెంతయు సహాయకారి యయ్యెను. చం

త్రిని చల్లఁదనమునకుఁ, బ్రకృతినైర్మల్యమునకు నానందించుచు వారనేకరీతుల భగవంతునిఁ బొగడిరి. పనిపడినప్పుడుమాత్రమే ఉపకారులను శ్లాఘించుట మానవస్వభావము కదా! ఇతరసమయములందు నదేపనిగఁ జంద్రునిఁ జూచువా రెవరు? చిత్రవిచిత్రసృష్టి కధినాథుఁడగు విశ్వనాథునిఁ బొగడువా రెవరు?

రవివర్మ తనగుఱ్ఱమును దటాలున నాఁపి „అదిగో!" అని యఱచెను. అతఁడు దేనినో చెవియొగ్గి వినుచుండెను. విక్రమసేనుఁడును దడదడఁ గొట్టుకొనుచుండినహృదయముతో దూరమునుండి వినవచ్చుచుండినయశ్వపదశబ్దమును జెవియొగ్గి వినెను. వారివంకనే వీచుచుండిన గాలిలో నాశబ్దము క్షణక్షణమున కెక్కుడగుచు వినఁబడుచుండెను.

„త్వరగా—' అనుచు రవివర్మ కాళ్లతో గుఱ్ఱమును బలముగాఁ దన్ని పఱుగు దీసెను. విక్రమసేనుఁడు నతని ననుసరించెను. కొంతదూర మట్లు పోయి వినుటకు నిలువగా నాశబ్దము వినఁబడలేదు. మఱునిమిషమందే యది స్పష్టముగా వినఁబడెను. రవివర్మ గుఱ్ఱమును దిగి నేలకుఁ దనచెవి నానించి „ఇరువురుమాత్రమే. ఒకమైలుమాత్రమే వారు మనవెనుక నున్నారు." అనెను.

మఱల వారు వేగముగాఁ బోఁదొడఁగిరి. కొంతసేపటిలో నిరువురును నల్లకొండలయరణ్యమును బ్రవేశించిరి. మఱికొంతదూరము పోఁగా నామార్గము రెండుగాఁ జీలి రెండువైపులకుఁ బోవుచుండెను. రవివర్మ యచ్చట గుఱ్ఱము నాపెను.

„కుడివైపు మనమార్గము. ఎడమవైపుది సూర్యసేనునిదుర్గమునకుఁ బోవును. ఒక్కొక్కటి యెనిమిదిమైళ్లదూరము! దిగుము." అని యతఁ డాయాసపడుచుఁ బలికెను.

“దిగినచో వారు మనపైఁ బడుదు రేమో” యని విక్రమసేనుఁడు జంకుచు ననెను.

“దిగుము!” అని రవివర్మ యోపిక పట్టలేక యఱచెను. విక్రమసేనుఁ డాతనియాజ్ఞను శిరసావహించెను. బాట కిరుప్రక్కలవఱకు నడవి పెరిగి చెట్లుచేమలు నెత్తుగా మొలిచియుండెను. వారిరువురును గుఱ్ఱములతో నవతల కించుకదూరముగాఁ బోయి యొకచో దాఁగియుండిరి.

“వారెవరో చూచి తెలిసికొనవలయునని యపేక్షించుచున్నావా?” యని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

“ఎవరో—యెచ్చటి కేఁగుచున్నారో యని కూడ—” అని రవివర్మ ప్రత్యుత్తర మిచ్చెను.

ఆముదునలిహస్తమున కఠోరఖడ్గ ముండుటను జూచి విక్రమసేనుఁడును ఖడ్గహస్తుఁడయ్యెను.

చంద్రుఁ డిప్పుడు పూర్తిగాఁ బూర్ణముగాఁ బ్రకాశించుచు నరణ్యము నంతను సుధాచంద్రికలతోఁ దెల్లగాఁ బఱచుచుండెను. అంతలోఁ గుఱ్ఱపుడెక్కలచప్పుడు మిగులసమీపమునుండియే వినవచ్చుచుండెను.

“ఇదిగో వచ్చిరి!” అని రవివర్మ మెల్లగా ననియెను.

“హా! సూర్యసేనుఁడే!” యని విక్రమసేనుఁడు నోరు తెఱచెను.

“నేనట్లే తలఁచితిని.” అని రవివర్మ శాంతముగా బదులు చెప్పెను.

విక్రమసేనుఁ డన్నది నిజమే. ఆవచ్చుచుండినది సూర్యసేనుఁడే. అతని ననుసరించి యతనియంగరక్షకుఁడు, మోహనునితమ్ముఁడు—మో

టువాఁడై పొట్టిగా బలిష్ఠకాయుఁడై నవామనుఁడనువాఁడు వచ్చు చుండెను.

రవివర్మహస్తమున ఖడ్గము సిద్ధముగా నుండెను. విక్రమసేనుఁ డతనిచేయి పట్టుకొని „ సాహసించెదవా ?” యనెను.

„ సమయము వచ్చినప్డే ! నాకంతయుఁ దెలియును. నీవు మాత్ర మేమియు మాటాడక మూగవానివలె నన్ననుసరించుచుండు ము.” అని రవివర్మ యతనిని హెచ్చరించెను.

„ ఏమార్గము ?” అని సూర్యసేనుఁడు తనభటునిఁ బ్రశ్నించెను.

„ దుర్గమునకు ” అని యతఁడు బదులుచెప్పెను.

సూర్యసేనుఁ డొకించుకయాలోచించుచుండెను.

„ మహారాజా ! ఏమాలోచించుచున్నారు ? దుర్గమునకుఁ బో యిన యదార్థము తెలియఁగలదు. ”

„ అది కాదు. గుఱ్ఱములు పరుగెత్తినట్లు చప్పుడు వినఁబడినది. ముందాసంగతి తెలిసికొనవలయును ”

„ మహాప్రభూ ! నాకట్టిశబ్ద మేదియు వినఁబడలేదే ?”

„ అది యుండనిమ్ము. మనము వేఁటగృహమునకే యెందుకుఁ బోరాదు ?”

„ ఆహార్తలో నేదైనఁ దంత్రమున్నదేమో యని నాభయ ము. అంతయు సరిగా నుండుచో నిజమైన మన మచ్చటి కెందు కేగవల యును ? అది యసత్యమైన నచ్చట మనలను బట్టుటకే యీతంత్రమై యుండును. కావున సత్యమైనను, నసత్యమైనను మన మచ్చటి కేగవల సిన యావశ్యకత మేమియును లేదు.”

సూర్యసేనుఁడు మఱల నాలోచించి „ సరే. దుర్గమునకే కా నిమ్ము ” అని తనగుఱ్ఱము నడలించెను.

రవివర్మ పోవుచుండినసూర్యసేనుపైఁ గత్తినెత్తి పండ్లు పటపటఁ గొఱికెను. ఆముసలివానియుద్రేకమునకు వచ్చుచుండిన నవ్వును విక్రమసేనుఁడు బలవంతముగా నాఁపుకొనెను. కొంతసేపు వారిరువురును బోవుచుండినవారినిఁ జూచుచు నచ్చటనే నిలిచియుండిరి.

" చూచితివా? అంతయు సరిగానున్న దనుసందేశము వానికి వచ్చినట్లున్నది. " అని తనపని యంతయు వ్యర్థమైనదేమో యను నిరాశతో రవివర్మ పలికెను.

" దానియర్థ మేమి?" అని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

" భగవంతుఁడే యెఱుఁగవలెను." అని రవివర్మ కనుబొమ్మలు ముడివైచి పలికెను.

వారిరువురును గమ్యస్థానమగుదుర్గమును జేరువఱకు నేమియు మాటలాడక, యించుక విశ్రాంతి కలుగుటచే నుత్సాహముతోఁ బరుగెత్తుగుఱ్ఱములపై నధిరోహించి విక్రమసేనరవివర్మలు క్షణములో వేటగృహమును సమీపించిరి.

వారు తొందరగా గుఱ్ఱములను దిగిరి. తటాలున రవివర్మ విక్రమసేనునిహస్తమును బట్టుకొని "అదిగో! చూచితివా?" అని భూమివంక వ్రేలితోఁ జూపుచు నాశ్చర్యముతోఁ బలికెను. విక్రమసేనుని యెదుట కొన్నిగుడ్డలు పేలికలుగాఁ జింపఁబడి యుండెను. దానియర్థమును గ్రహింపలేక విక్రమసేనుఁడు రవివర్మవైపుఁ జూచెను.

" ఆగుడ్డలతోడనే, నేనాముసలిదానిని గట్టి యుంటిని. ఈగుడ్డనే యామెనోటఁ గుక్కితిని. నాసంశయమే నిజమైనచో మనపుట్టి మునిఁగినట్టే. " యని రవివర్మ తడబడునడుగులతో ముందటిదినమునఁ దానుముసలియామెను బంధించి బీగము వేసినగదిదిక్కు పరుగెత్తసాగెను. విక్రమసేనుఁ డతని ననుసరించెను.

పట్టాభిషేకమునకు ముందు కాశ్మీరరాజారగించినవిందచట నట్లే తుడువఁబడక యుండెను. త్రాగి పడవైచినపాత్రలు చెక్కుచెదరక యట్లేయుండెను.

ఇంతవఱకు మహాధైర్యసాహసములఁ గనఁబఱచుచుండిన రవివర్మహృదయ మొక్కసారిగాఁ బగిలిపోయి వెంటనే వచ్చుచుండినవిక్రమసేనునిపై „త్వరగా రమ్ము—ఇట్లు—అట్లు—" అని నిష్కారణముగాఁ గోపించుచు నేమిచేయుటు దోచక పిచ్చికేకలు వేయుచు గర్జించుచుండెను. తనరాజున కెట్టియపాయము కలిగెనో యని యతనిభీతి. అందుకే యతనిమతి చెడినట్లుండెను. అహా! ఎంత నిష్కళంకరాజభక్తి!

పోయి చూడఁగా ముసలిదానిని బంధించినగదితలుపులు తెఱవఁబడి యుండెను.

రవివర్మనోట మాటయే వెడలలేదు. అతఁడు చక్కగా రాజును పెట్టియుండినగదివంకకుఁ బరుగెత్తెను. విక్రమసేనుఁడును నతని వెంటనే పరుగిడెను. ఆగదితలుపు లెప్పటివలెనే బంధింపఁబడి యుండెను.

విక్రమసేనుఁడు సంతోషసూచకముగా „ఇది సరిగా నున్నది రమ్ము." అనెను.

రవివర్మ గుబ్బుమనెను. అతనిముఖమందు కాంతియే లేదు. అతని నోరాడనేలేదు. పారపడుచుండినవిక్రమసేనునకు రవివర్మ, తలుపుల క్రిందినుండి యివతలభూమివఱకుఁబడి యూఁడిపోయినరక్తమును వ్రేలితోఁ జూపుచు నిరాశతోఁ గూలఁబడెను. విక్రమసేనుఁడు కంపితహస్తములతోఁ దలుపులను దెఱవఁబోయెను గాని బీగము వేయఁబడియుండెను. ఖడ్గముతో మోది యాతఁ డించుక శ్రమతో దానిని విరుగఁగొట్టెను.

“ఒకదీపమును వెలిఁగించి యిమ్ము.” అని విక్రమసేనుఁడనెను. కాని యామాటలు రవివర్మ చెవినిఁ బడలేదు. అతనిహృదయము చెదరిపోయినది. మతిచలించిపోయినది. గదిలోని ఘోరకృత్యముఁ జూడ నాతఁ డిచ్ఛగింపలేదు. అచట నొకసారాయిబుడ్డి యుండఁగా దేనికి రాజు పట్టుపడి చెడిపోవుచుండెనని దేనిని విషముకంటె నెక్కుడుగా ద్వేషించుచుండెనో యట్టిమద్యము నాతఁడు గడగడ త్రాగివైచెను. పాపము విక్రమసేనుఁడు దిగ్భ్రమఁ జెంది నిలిచి యుండెను.

తనకొఱకై రవివర్మ భయపడుచుండుట లేదు. ఎట్టిభక్తుఁడును దనదైవమును తనరాజును రవివర్మకొలుచునంతటిప్రేమతోఁ గొలువఁడని విక్రమసేనుఁడు కన్నార నాతనిరాజభక్తినిఁ జూచి యాశ్చర్యపడి యతఁ డొకమహాత్ముఁ డని మనసులోనే నమస్కరించెను.

ఒకమైనపువత్తిని వెలిఁగించి విక్రమసేనుఁ డడుగులో నడుగువైచుచు గదినిఁ జొచ్చెను. భూమిపై నెత్తుటిమట్టి గదియంతయు వ్యాపించి యుండెను. విక్రమసేనుఁడు మఱి రెండడుగులు నడిచెను. ఆనెత్తుటిభూమి దప్ప మఱేమియు నాతని కగపడలేదు. అతఁడు దీపమును పైకెత్తి యొకమూలలో నేమో తెల్లగా నుండుటను జూచెను. చేతులు విసరివైచి యొకశరీరము వికారముగాఁ బడియుండెను. కంఠమందు గాయము చేయఁబడి యుండెను.

ఆశరీర మెవరిదో యని విక్రమసేనుఁడు పరీక్షించుచుండఁగా నతనిభుజము నెవరో పట్టుకొన్నట్లయ్యెను. అతఁ డదరిపడి వెనుకకు చూచెను. ఉరితీయఁబడినమనుష్యునివలె నోరు తెఱచి, గ్రుడ్లు పైకి చేసికొని వంగి చూచుచు వికారముగా దయ్యమువలెఁ గనఁబడుచుండినరవివర్మయే యాతనికంటఁ బడియెను.

"అయ్యో ! రాజు ! రాజు !" అని యతఁడు కేకలువైచెను.

"అఱవకుము. అతఁడు రాజు కాఁడు. రాజిచ్చట లేనే లేఁడు" ని రవివర్మ గది నంతను దీపపువెలుఁగులోఁ బరీక్షించి కుదురు వడిన హృదయముతో మెల్లగా ననెను.

"హా ! ఈశ్వరా ! నీమాయలు త్వరగా నర్థము కావు." అని విక్రసేనుఁ డనుకొనెను.



## పదియవప్రకరణము.



" What's brave, What's noble,
Let's do it."
(Shakespeare.)

తనచేతిని రవివర్మనదుమునకుఁ జుట్టి విక్రమసేనుఁ డతనిని భయంకరమైన యాగదినుండి మెల్లగా వెలుపలికిఁ బిలుచుకొనివచ్చెను.

" ఈమనోహరునిఁ జంపి రాజును గొనిపోయినారుకదా ? ఈ మసలిఖడ్గముతో మారాజునువిడిపించి పగఁ దీర్చుకొనెదనుచూడుము." అని రవివర్మ నూతనావేశముతో భూమి యదరునట్లు తన్ని గర్జించెను.

" అంతయు సరిగా నున్నదనుసందేశమున కర్థమిదేకాఁబోలు!" అని విక్రమసేనుఁడు పలికెను.

రవివర్మయోచించి "నీవింకను బట్టాభిషేకమునకుఁ బోకముందే యీపని జరిగినది. మనము రాజధాని చేరకముందే యీసందేశము సూర్యసేనున కందియుండవచ్చును." అనెను.

విక్ర—అందుకే సూర్యసేనుఁడు చాల కలవరపడి పట్టాభిషేక మహోత్సవమున పరిగాఁ బాలుగొనలేదు. వివర్ణుఁడై పిచ్చిచూపులు చూచుచుండెను.

రవి—ఆసమయమునకు మన మిచ్చటనే యున్న నేను, నీవు ధర్మవర్మయు నీపాటికి స్వర్గనివాసులమే యైయుందుము.

విక్ర—సరే. ఇఁక మన మెంతమాత్రము నాలస్యము గూడదు. వెంటనే రాజధానికిఁ బోయి యీదురాత్ములదుండగమున కదగినప్రతీకారము చేయవలయును.

రవివర్మ యేమియుమాటలాడక తనలోఁ దానే యోచించుచుండెను.

విక్రి—మన మిచ్చటనే యేమియుఁ దోఁచక కూర్చుండియున్నచో నచట రాజును జంపివేయుదురు. ఇట్టిస్థితిలో ధైర్యము వహించి తగినపని చేయవలయును గాని యూరకవిచారించుటవలన నేమిలాభము?

దాని కేమియు బదులు చెప్పక రవివర్మ, "ఆమోసకత్తెముసలి ముండ! ఆదురాత్ములు! పట్టాభిషేకమునకుముందే రాజును బట్టుకొని దాచి రాజు కనఁబడలేదని ప్రజలకుఁ బ్రకటింపవలయునని కుతంత్రము పన్నినారు. అల్లే ప్రొద్దుననే రాజింకను కదలియుండఁ డని యిచ్చటికి వచ్చినారు. ఆముసలిది రాజును బట్టించినది. కానిమ్ము! వారెంతవఱకుఁ గృతార్థులగుదురో చూతము! ఇప్పటికి నాయుక్తివలన మనము మువ్వురమును బ్రతుకుటే కాక సింహాసనముకూడ దక్కినదిగదా!" అని యుపన్యాసధోరణిలోఁ బడిపోయెను.

విక్రమసేనుఁడు కాలహరణమునకు సహింపలేక "రమ్ము! రమ్ము! పోవుదము." అనెను. కాని రవివర్మ కదలలేదు. అతఁడు తనప్రపంచమును వీడలేదు. "మనము సూర్యసేనునకుఁ గావలసినంతయాటంకమునే కలుగఁ జేసి తొందర పెట్టినాము—" అని యింక నేమేమో ప్రసంగింపఁదొడంగెను.

విక్రమసేనుఁ డోర్వలేక "వినఁబడుట లేదా? మతి చలించినదా?" యనెను.

రవివర్మ మరల "ఇంతటితోఁ బనియంతయు ముగిసిపోలేదు. సూర్యసేనహతకున కాటంకము లైపోలేదు. తొందరలు వానికింతతో నడఁగలేదు" అనియెను. ఆతనిముఖ మొకయగాధమగుయోచనతో విజయహాసధ్వజము నెత్తుచుండెను. అతఁడు మరల, "ఔను. అన్నా

యూ! మనము రాజధానికే పోవుదము. తెల్లవారులోపల రాజు రాజ ధానియందుండవలెనుగాదా?'' అనెను.

"రాజా?" అని విక్రమసేనుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను.

"ఇప్పుడు పట్టాభిషేకము చేసికొన్న రాజే!''

"నీకుఁ బిచ్చిపట్టలేదుకదా?'' యని విక్రమసేనుఁడు పరిహ సించెను.

"నీకేపిచ్చిపట్టినది. మనమిప్పు డూరికేఁ బోయి బేలతనముచే మననాటకమును బహిరంగపఱచినచో మనప్రాణములు దక్కవు. ఇఁక సింహాసనమువిషయమా? వచ్చి చూచి యానందించినరాజులు వీరులు మొదలైనవారు పట్టముఁ గట్టుకొన్నవాఁడు మోసగాఁడని తెలిసికొనఁ గలిగినచో నప్పుడు నీవును, సూత్రధారి నగునేనును దక్కఁగలమా? అంతే కాక పట్టాభిషేకమునకుఁగూడ తీరిక లేక త్రాగి కైపెక్కి పడి పోయి తనకుమాఱుగాఁ బట్టాభిషేకమునకు మఱియొకనిఁ బంపిన మా రాజును బ్రజలుమాత్రము ప్రేమింతురా?'' అనుచు రవివర్మ లేచి విక్రమసేనునిభుజము పట్టి "అబ్బాయీ! నీవు మరల రాజుగానే నటిం పవలసి యున్నది. రాజు నుద్ధరించుటకింతను నాశ యున్నది. మనము తిరిగి పోయి రాజసింహాసనమును గాపాడుకొనుచు నట్టిసమయమున కెదురుచూచుచుండవలెను'' అనియెను.

ఇచ్చటిసంగతులనుబట్టి చూడఁగా సూర్యసేనునకు మనరహస్య మంతయుఁ దెలిసిపోయిన దని యూహింపవలసియున్నది గదా! ఇట్టిస్థి తిలో దురాత్మునఁ డగునాతఁడు మనలను రాజ్యమునందు నిలువనిచ్చు నా? మనరహస్యమును బయటఁ బెట్టక యూరకుండునా?'' అని విక్ర మసేనుఁడు భయసంశయాకులచిత్తముతోఁ బ్రశ్నించెను.

"అట్లుండియు నానీచులు మననాటకమును వెలిపెట్టఁజాలరు.

అందుకొఱకు నీవు భీతిల్లవలదు. నీపై నింద నారోపించినచో వారు తమయపరాధమునే బయటఁ బెట్టుకొన్నవా రగుదురు. ఆసూర్యసేన ఘాతకుఁడు గుండెలపైఁ జేయి వైచుకొని ,, ఈతఁడు రాజు కాఁడు. రాజసేనకుని జంపి రాజును నేనపహరించితిని !" అని చెప్పఁగలఁడా ?"

అని రవివర్మ భీకరవిజయాట్టహాసముతోఁ బలికెను. అతని యాలోచనకు విక్రమసేనుఁ డాశ్చర్యపడెను. అతఁ డన్నదికూడ సత్యమే. సూర్యసేనుఁ డీవిషయమునుగుఱించి నోరెత్తలేఁడు. రాజును జూపించువఱకును సూర్యసేనుఁడు విక్రమసేనునిపై నింద మోపలేఁడు. అతఁడు రాజును జూపించెనా రాజాపహరణమునకు బాధ్యుఁడై యెట్టి సదుత్తరము నియ్యఁగలఁడు ? విక్రసేనునిసంశయము తీరెను. భయము తొలఁగెను.

,, ఎన్నివిధముల నాలోచించినను రాజధానియందు నీవిప్పు డుండియే తీరవలెను. లేకున్నచో నొకక్షణములో సూర్యసేనుఁడు రాజగును. రాజు కనఁబడనందున రాజ్య మరాజకము గాకుండ సూర్యసేనుని రాజుగాఁ జేసికొనుట ప్రజల కప్పుడు ధర్మమేయగునుకదా ?" అని రవివర్మ మరలఁ బ్రబోధించెను.

విక్రమసేనుఁడు తనలో ,, అక్కటా ! పరమేశ్వరుఁడు సృష్టిలోనికెల్ల నుత్తమమైనమానవసంఘమునందు నీచతరులగునరులనుగూడ సృజించి వారికే ప్రపంచాధికారమును, సృష్టి కధినాయకత్వమునుగూడ నొసఁగుచుండుటకుఁ గారణ మేమి ? ఆతనిమతిలేనిచేతలవలనఁ బ్రపంచమునం దడుగడుగునకును నీచస్పర్శయే యగుచున్నది. ఇఁక నీలోకమున నిలిచిజీవించుట యెట్లో తోఁచుటలేదు." అని తలపోసికొనుచుండెను.

"ఏమి యట్లాలోచించుచున్నావు? నిశ్శంకచిత్తుఁడవై నావెంట రమ్ము! సత్క్రియా నిర్వహణమునందే మనజీవితముల వినియోగింతము!" అని రవివర్మ హెచ్చరించెను.

"వలదు. వలదు. నే నీచమానవమధ్యమున మఱొకనిముషమైన నుండరాదని తీర్మానించుకొంటిని. మానవజాతినాప్రాణమువం దర్ధభాగము నిదివఱకే తీసివైచినది. ఉండిన యర్ధప్రాణమును భగవంతునిపవిత్ర స్వరూపమును జూడకుండ నీచమానవజాతిచేఁ దొలఁగింపఁబడకముందే తపము చేసికొనుటకు హిమాలయములకు నన్నుఁబోనిమ్ము" అని విక్రమసేనుఁడు దీనముగా వేఁడుకొనియెను.

ఇట్లు వింతగాఁబలుకుచుండినవిక్రమసేనునిఁజూచి రవివర్మ నివ్వెఱపడిపోయెను. కొంతవడి కాతఁడు నవ్వుచు ననునయింపుమాటలతో "రాకుమారా! ఏమియీకొత్తపిచ్చి? ఎయ్యది ధైర్యసాహసములతో నుత్తమమైనపనియని చేపట్టెనో దానిని ధీమంతుఁడైనగుణవంతుఁడు చేసితీరవలెను. మనము పవిత్రులమై యున్నంతవఱకు నీనీచప్రపంచము మనల నేమియుఁ జేయఁజాల దని ముందే నుడివి యుంటినిగదా! నీచ ప్రపంచ మని మనబోటి సజ్జను లందఱును సన్యసించినఁ, బ్రపంచమున నీచులుమాత్రమే మిగిలి ప్రపంచము నీచతరమగును. ధర్మమే దేవుఁడు. ధర్మముకొఱకై ప్రాణములు విడిచినను మనము భగవంతునిపవిత్రజ్యోతిచే లాలింపఁబడినవారమే యగుదుము. భగవంతునికొఱకు మనము వేఱుగా వెదకవలసినపని లేదు. ఆపవిత్రుఁడు దుష్టశిక్షణ శిష్టరక్షణములందే యున్నాఁడు. కావున—అబ్బాయీ! శిష్టు నొక్కనినైన నెట్లో రక్షింపుము. దుష్టులను శిక్షింపుము. ఈమహోత్తమకార్యకర్తవౌటచే నీవే దేవసమానుఁడ వగుదువు." అని దీర్ఘముగా యుక్తియుక్తముగా నుపన్యసించెను.

విక్ర—అది సరేకాని రాజింకను బ్రతికియున్నాఁడని మన మెట్లు నిశ్చయింపఁగలము? అతఁడే మరణించినచో మనపాట్లన్నియు వ్యర్థము లేకదా! నిష్కారణముగా సూర్యసేనాదులతో వైరము పెట్టుకొన్నవార మగుదుము. ఇందువలన నేమిప్రయోజనము?

రవి—నిజమే కాని, రాజింకను బ్రతికియే యున్నాఁడు. నీవు రాజస్థానమున నుండకపోయినచో నతఁడు చచ్చుటమాత్రము ముమ్మాటికి నిక్కము. రాజ్యము రావలె నని కదా వారు రాజును జంపుట? ఇప్పుడు రాజును జంపినను రాజ్యము నటనారాజవగు నీది కాని వారికిఁ బోదు. కావున నిన్నును నిజమైన రాజును నొక్కసారిగాఁ బొరిగొనుసమయము వచ్చువఱకు వారినుండి రాజున కేయపాయమును రాదు.

ధీమంతుఁడైన మంత్రివర్యుని యోచన యగాధమగుటచే బదులు చెప్పక విక్రమసేనుఁడు వల్లెయనెను. కాని రవివర్మ యిది సమయము కాదని యెంతవల దన్నను, రాజకార్యాగ్రస్థమై తనకాయమును విడిచి పవిత్రగతిఁ గన్న మనోహరున కుత్తరక్రియలు చేసిగాని యిటనుండి కదల నని విక్రమసేనుఁడు పట్టుపట్టెను.

ఇఁకఁ జేయునది లేక రవివర్మ విక్రమసేనునితోఁ గలసి మనోహరుఁడు వధింపఁబడియుండిన గదివంకకుఁ బోవుచుండెను. ఇంతలోఁ బండువెన్నెలలోఁ గొందఱు మనుష్యు లాగృహమువంకకే వచ్చుచుండుటను విక్రమసేనుఁడు చూచి రవివర్మను హెచ్చరించెను.

వారు సూర్యసేనునికోటనుండియే వచ్చుచుండి రనియు, వతని భటులే యైయుందు రనియు రవివర్మ చెప్పెను. వారు పాఱలు, గుద్దండ్లు మోసికొని వచ్చుచుండి రని విక్రమసేనుఁడు చెప్పెను.

„ అట్లైన నీవు చేయుపనిని వారే చేయవచ్చుచుండిరి లెమ్ము,

ఈహత్య బయటపడరాదని మనోహరునిఁ బాతిపెట్టుటకే వారు వచ్చు చుండిరి. మన మిఁకఁ బోవచ్చును గదా. వారికంటఁ బడకుండఁ బోవలెను. దేవుఁడే కష్టపెట్టకుండ నీకోర్కెను దీర్చుచున్నాఁడు" అని రవివర్మ చెప్పెను.

విక్రమసేనుఁడు "ఆర్యా! పాప మీమనోహరునిప్రియము కొఱకై యాతనిజంపినసంఘమువారిలో నొక్కనినైన నొకదెబ్బయైనను కొట్టి పగఁ దీర్చుకొనవలెను. దురాత్ముల దుండుగములకు నారక్త ము డుకుచున్నది. దురాత్ములను శిక్షింపవలె నని నీవిప్పుడే చెప్పితివికదా?" యనెను.

"సరే. నీవు చాల నుత్తమపురుషుఁడవు. నీకెదురు చెప్పఁజా లను." అని రవివర్మ యందుల కొప్పుకొనెను.

వారిరువురును తమముఖములను గప్పుకొని గృహమువెనుకకుఁ బోయి తమగుఱ్ఱముల నెక్కిరి.

ఇంతలో సూర్యసేనునిభటులు వచ్చిరి. రవివర్మవిక్రమసేనులు తమగుఱ్ఱముల నొక్కపెట్టునవారిపై దుమికించిరి. విక్రమసేనుఁడు క్షణములో నిరువురను జంపివైచెను. అతఁ డంతతోఁ దనివిఁ జెందక యొక బలిష్ఠుఁడగుపురుషునిపై దుమికి "ఓరీ! నీవిట్టిదుర్మార్గజీవన ముతోడనే యింతగా బలిసినావు. ఇన్నాళ్లదుర్జీవన మొక్కక్షణములోనే కూలిపోఁ జేసెదను చూడుము." అని తనఖడ్గమును వానిపొట్టలో గ్రుచ్చెను. కాని యతఁ డలిసియుండుటచే దానిని తిరిగి లాగుకొనలేక యింతకుమున్దే యిరువదియైదడుగులు పోయి "చాలిఁక రమ్మని" పిలుచుచుండిన రవివర్మ ననుసరించి గుఱ్ఱముపై నొకనిముసములో మాయ మయ్యెను.

"నా రక్త మిప్పు డుడుకు తగ్గుచున్నది." అని విక్రమసేనుఁడు సంతోషముతోఁ బలికెను.

"మహారాజా! నీచేతికేమి?" అని రవివర్మ యాతనివంకఁ జూచి విస్మయముతోఁ బలికెను.

పోరాటములో విక్రమసేనుని చూపుడువ్రేలిమాంసము తెగి పోయి తీవ్రముగా రక్తము స్రవించుచుండెను. తనకు గాయము పడి నట్లు విక్రమసేనుఁడే యెఱుఁగఁడు.

అతఁ డిప్పుడు చూచుకొని "ఓహో! మహారాజునే గాయ పఱచినారే. ఐనను మహారాజునకు గొప్పగాయముకాలేదులే మంత్రి వరా!" యని నవ్వుచు విక్రమసేనుఁడు రవివర్మ సహాయమునఁ దనవ్రే లికిఁ గట్టు కట్టుకొనెను.

తెల్లవారులోపల వారిరువురును వచ్చినతోవనే రాజసౌధము నకుఁ బోయి చేరిరి. రాత్రి యంతయు జాగ్రత్తతోఁ గావలియుండిన ధర్మవర్మ యిప్పు డచటఁ గునికిపాట్లు పడుచుండెను. వీరు వచ్చుటతో డనే యతఁడు మేల్కాంచి విక్రమసేనునిఁ జూచి రాజని సాగిలఁబడి "మహారాజా! మీరు క్షేమముగానున్నారా? దేవునికిఁ బదివేలదండ ములు." అని పట్టరానిసంతోషము వెల్లడించెను.

విక్రమసేనునిమనసు కరఁగిపోయెను. పాప మాతఁడు "నేను రాజనుకా"నని యెఱింగించినచో నెంత యాశాభంగమునందునో యని శంకించి విక్రమసేనుఁడు యథార్థము నెఱిఁగించి పాప మాతని కాశా భంగముఁ జేయఁదలఁపలేదు.

కాని రవివర్మ ముందు వచ్చి "కుమారా! ధైర్యముగా నుం డుము. మనము జయము [illegible]." అనెను.

ధర్మవర్మ నివ్వెఱపడి లేచి విక్రమసేను నాపాదమస్తకము చూచి వెనుక కొరగుచు "రాజెక్కడ ? మారాజెక్కడ ?" యని యఱవ సాగెను.

"మూర్ఖుఁడా ! గట్టిగా వదరకుము. రాజితఁడే." యని రవివర్మ కోపముతోఁ బలికెను.

పాపము కాశ్మీరమహారాజవిక్రమసేనుఁడు త్రాగుడుదుర్గుణముచే దన శ్రేయమునకుఁ బ్రతికూలుఁడైనను, నతఁ డంతటికిని మంచివాఁడై ప్రేమపాత్రుఁడై ప్రాణములనైన నియ్యఁగలుగుప్రజలను గలిగియుండెను !

వీరిట్లు మాటాడుకొనుచుండఁగాఁ దలుపు నెవ్వరో తట్టిరి. రవివర్మ విక్రమసేనునిచేయి పట్టుకొని, "త్వరగా నీ దుస్తులను దీసివేసి రాజవస్త్రములను ధరించి యెప్పటివలె నిండుగాఁ గప్పుకొని పరుండుము." అని తొందరపెట్టెను. విక్రమసేనుఁ డతఁడు చెప్పినట్లు చేసెను.

అప్పుడు రవివర్మ యొకయౌవనమధ్యస్థుఁడగు నొకపురుషుని వెంటఁబెట్టుకొని వచ్చెను. ఆనూతనపురుషుఁడును రవివర్మయును విక్రమసేనుఁడు కన్నులు తెఱచువఱకు నట్లే నిలువఁబడి, విక్రమసేనుఁడు లేవగానే యిరువురు నతనికి జోహా రొనరించిరి.

ఆనూతనపురుషుఁడు మఱలమఱల నమస్కరించుచు, మహారాజుక్షేమము నరయుచు నతని కెల్లవిధముల సౌఖ్య మగుఁగాక యని యీశ్వరునిఁ బ్రార్థించుచు రాజపుత్రి మదనకళ తననమస్కారములను బంపుచుండె నని విక్రమసేనునకు నివేదించెను.

"ఆమెదయకుఁ గృతజ్ఞుఁడను. ఇప్పటిసంతోషసౌఖ్యములను రాజు మఱెప్పు డింతవర కనుభవింపలేదని దేవికి నివేదింపుము." అని

విక్రమసేనుఁడు బదులుచెప్పెను. ఆపురుషుఁడు వంగి నమస్కరించి వెనుక వెనుకకుఁ బోయి వెడలిపోయెను.

" రాజు మరణించెనా ?" యని ధర్మవర్మ వడఁకుచుఁ బ్రశ్నించెను.

" దేవుఁడు రక్షించుఁగాక ! అతఁడు క్షేమముగా నున్నాఁడు. కాని సూర్యసేనునిచేతులయందుఁ బడినాఁడు." అని విక్రమసేనుఁ డతని నూఱడించెను.

---

## పదునొకండవప్రకరణము



" భామలు భామలే ! పురుష
భావరహీనలతాపవాతముల్ —"

(" చిలుక. ")

నిజమైనరాజునకే రాజ్యభారము కష్టమన్నచో నిఁక నటనారాజగు విక్రమసేనునికష్టముల దుఃఖమును వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

ఉదయమున నుపాహారమునకు ముందు మహారాజు మ్లేచ్ఛదేశమునుండి వచ్చుచుండిన తెల్లమద్యమును సేవించుచుండె నని రవివర్మ విక్రమసేనునకుఁ జెప్పెను. ధర్మసంస్థాపనమునకై రాజుగా నటించుటకు విక్రమసేనుఁడు మద్యమునుగూడ సేవింపవలసివచ్చెను. కుక్కవేషము వేయుట కొప్పుకొన్నతరువాత మొఱుఁగకున్నఁ దప్పునా ?

తన్నుఁ జూడవచ్చిన సేనాధిపతి మొదలైన వారితోఁ దనవ్రేలికి గాయము ఖడ్గవ్యాయామమందుఁ దగిలిన దని విక్రమసేనుఁడు విసుగు లేక చెప్పుచుండెను. అతని కది మేలే యైనది. వ్రాయవలసినపని యంతయు రవివర్మపైఁ బడెను. లేకపోయిన రాజువ్రాత నాతఁ డనుకరించుట కష్టమైయుండెడిది.

రాజకార్యము లన్నియు నైపోయినపిమ్మట విక్రమసేనుఁ డించుక విశ్రాంతి ననుభవించుచుండెను. అతనిప్రక్కనే ధర్మవర్మయు నెదుట రవివర్మయు నిలిచి కాపాడుచుండిరి.

" మనము కాలహరణము చేయుచున్నాము. రాజును విముక్తునిఁ జేసి సూర్యసేనునిఁ బట్టుటకు మనము వేగిరపడవలయును. " అని ధర్మవర్మ యనెను.

" కుమారా ! తొందరపడకుము. మనము సూర్యసేనునిఁ బట్టు కొన్నచో రాజుప్రాణములు దక్కవు. పట్టువడుచున్న సూర్యసేనుఁడు రాజును బ్రతుకనిచ్చునా ?" అని రవివర్మ నుడివెను.

,, మఱియు, రాజొకఁడు సింహాసనముపై నుండునంతవఱకు విక్రమసేనమహారాజున కేయుపాయమును లేదు. రాజ్యముకొఱకై రాజుతో సూర్యసేనుఁడు పగ సాధించును గాని, యిప్పుడు రాజుగాలేని తనయన్న నతఁ డేల వధించును ? కావున నన్నివిధముల మనము నిదా నించిననే కార్యము కొనసాగును. " అని విక్రమసేనుఁడు పలికెను.

,, ఐన మన మిప్పు డూరకుండవలసినదేనా ?" అని ధర్మవర్మ మనశ్శాంతిలేక పలికెను. రవివర్మ కోపముతో ,, అవును. ఊరకుండ వలసినదే. మూర్ఖుఁడా! తెలియనివాఁడవు తెలియన ట్లూరకుండ వేల?" అనెను.

రాజుకొఱకై తపించుచుండినధర్మవర్మ నెట్లయిననూఱడింపవల యునని జాలిపడి యతనికిఁ దృప్తికరముగా విక్రమసేనుఁ డిట్లు చెప్పెను.

" చూడుము ! నీకు మాయభిప్రాయము సరిగా బోధపడలేదు. ఇప్పుడు నేనును సూర్యసేనుఁడును నొకరికంఠముపై నొకళ్ళము కత్తి పెట్టుకొని యున్నాము. మాయిరువురినడుమను రాజు సురక్షితుఁడై యున్నాఁడు. ఇట్లుండియు నావిషయమును సూర్యసేనుఁడు కాని, యత నివిషయమును నేనుకాని వెల్లడింపలేనిచిక్కు సంభవించినది. సూర్యసే నునికుట్రలు వెల్లడింపవలెనన్న లోకమునకు నేనెవరైనదియు చెప్పవలసి వచ్చును. నేను రాజును కాదని తెలిసిన సింహాసనమును రాజుకై కాపా డువా రుండరు. ఇంతలో రాజును సంహరించి రాజుతరువాత రాజగు సూర్యసేనుఁడే రాజగును. ఇఁక సూర్యసేనుఁడు నన్ను బహిరంగపఱ చిన, తనవన్నుగడలను, తాను బంధించినరాజును వెలిపెట్టి తనకుట్రల

పుత్త్రవాది కావలయును. అప్పు డాతనికి నిర్బంధమును, ఎట్లయిన నన్నకే రాజ్యమును సంభవించును. ”

„ ఈనాటక మద్భుతముగా నున్నదే. ” అని ధర్మవర్మ నుడివెను. అతఁడు కొంతవడికి,

„ ఏన రాజును వారు చంపరా ?” అని ప్రశ్నించెను.

రవి—చంపుట కిప్పుడు వారి కేమియవసరమున్నది ?

ధర్మ—ఆనలువురిలో నిరువురుమాత్రమే రాజధానిలో నున్నారు. అందులకే నేను భీతిల్లుట.

రవి—ఆలువురిలో నిరువురుమాత్రమే యిట నున్నారని నీవు నిశ్చయముగాఁ జెప్పఁగలవా ?

ధర్మ—ఆహా ! నిశ్చయముగాఁ జెప్పఁగలను.

రవి—„ ఏన రాజు తప్పక జీవించియే యున్నాఁడు. ఇరువురు రాజునకుఁ గావలియున్నారు. వారతనిఁ జంపఁదలఁచుకోలేదు.

ధర్మ—మీమాట సరేనండీ నాయనగారూ !

ధర్మవర్మముఖమునకుఁ దొంటివికాసమువచ్చెను. అతఁడు మఱల నిట్లు చెప్పసాగెను.

„ రాజును జంపియే యుండిన, నాసూర్యసేనునిదుష్టచతుష్టయ మిచ్చటనే యుండును. సూర్యసేనుఁడు కాకివలె నల్లఁబడినాఁడు. చూచితిరా ?”

రవి—ఔనౌను. వానికి వినాశ మగుఁగాక !

విక్రమసేనుఁడు „ ఆర్యులారా ! ఆనలువు రెవరు ?” అని యింతవఱకు వినుచు వారిసంభాషణమును గ్రహింపలేక యడిగెను.

రవి—వారినందఱిని ద్వరలోనే చూచునవసరము నీకు లభింపఁగలదు. ఈనలువురను సూర్యసేనుఁడు తనయింటనే పెట్టుకొని పోషిం

చుచున్నాఁడు. ఈనలువురుమహాత్ములును హరినాయకుఁడును జేరి పంచపాపు లగుచున్నారు. నాయకుఁ డెవరికుత్తుక నైనఁ గత్తిరింపుఁ డని కాలితోఁ జూపినచో శిరసుతో నాపని నప్పుడే వారు చేయుదురు. తనతోఁగూడ నీనలువురను సూర్యసేనునకుఁ బంచప్రాణములు.

తనపై నేరికిని సంశయము కలుగకుండ నందఱికి మంచివాఁ డనిపించుకొనవలె నని విక్రమసేనుఁడు నిశ్చయించెను. అందుమూలమున సూర్యసేనునిపక్షమువారే తనపక్ష మవలంబింతు రని యతనియాశ. అతఁడు సూర్యసేనునిపైఁ దమపగ నొరులకుఁ దెలియనీయక మిక్కిలి గౌరవాదరణములతోఁ జూడవలె నని నిశ్చయించెను. ఏమాత్రమించుక రహస్యము తెలిసినను, నాకస్మికముగా పగిలినయగ్నిపర్వతమువలె నంతయు నతిదారుణముగ బరిణమించి యల్లకల్లోల మగునని యతని యాలోచన.

విక్రమసేనుఁ డాసాయంకాలమునందే యుద్యానవనముత్రోవనే మదనకళాసౌధమునకుఁ బయనమయ్యెను. ముందువెనుకలను వేయిమందిపరిజను లతని ననుసరించిరి. రవివర్మధర్మవర్మ లతని కిరుపార్శ్వముల నడుచుచుండిరి. అతనిముందు సేనాధిపతి నడుచుచుండెను. మదనకళ పురజనులచే మిక్కిలి ప్రేమింపఁబడుచుండె ననియు, నామెపై నెంత ప్రేమ చూపి యెంతత్వరగా నామెను బరిణయమైన రాజు ప్రజల కంత ప్రియుఁ డగుననియు సేనాధిపతి చెప్పుచుండెను.

మదనకళపై రాజున కెంతప్రేమయున్నదో యని ప్రజలు సంతసించునట్లు విక్రమసేనుఁడు స్వయముగా నారాజోద్యానమునఁ గొన్ని పువ్వులను గోసి, త్రోవలో నమ్ముచుండిన యొకయువతిదగ్గఱఁ గొన్ని పుష్పములను స్వయముగాఁ గొని యామెను సంతోషపెట్టుటకై యొక బంగారునాణ్యమును బహుమానముగా నిచ్చెను. అందఱును రా-

రియొక్క సహృదయభావమునకు సమందానంద మంది జయజయధ్వనులతోను, వినయనమస్కారములతోను రాజును గౌరవించిరి.

తనప్రియురా లగుమదనకళయొక్క చెలిని జూడఁబోవుచున్నా నని ధర్మవర్మయు మహోత్సాహమున వచ్చుచుండెను. కాని విక్రమసేనుసిహృదయ మిప్పు డెట్లున్నది ?

విక్రమసేనుఁ డీనాటకమునందలి శృంగారప్రకరణమునందు మిక్కిలి కష్టతమ మైనఘట్టము నిప్పు డాతఁ డభినయింపవలసి యున్నది. అస లలితరాజపాత్రాభినయమే యతికఠినమైనది. ఇఁకఁ గల్పితశృంగారవిలాసనటనమో మఱియును గష్టతమ మైనది. ఆవశ్యకమును బట్టి యెట్లో నటింపఁదలఁచినను యువకుఁ డగునాసుందరపురుషుఁడు తనయెదుట సత్యమైయుంగిక యాత్మార్పణము చేసికొని నిల్చియున్న ప్రేమైకమూర్తి యగు శృంగారనాయిక చెంత నిజముగాఁ దాను బ్రేమించిన స్త్రీ హానభావములను బ్రకటించుచు హృదయావేగము నెట్లడంచుకొనఁగలఁడు ? అతఁ డెంతటినేమముతుఁడైన నేమి ? అగ్నిజ్వాలామధ్యమునఁ బ్రవేశించియు నొడలు మండకుండఁ గాపాడుకొనుట యసాధ్యము గాదా ?

ఆమదనకళ యెవ్వ రనదియు మన కింకను దెలియదు. ఆమెచరిత్రమును దెలిసికొనుట యిప్పుడు మన కత్యావశ్యకమైయున్నది.

ఇటీవల మరణించినకాశ్మీరరాజున కొకచెల్లెలుండెను. ఆ[illegible] గోసలాధిపతి కిచ్చి పెండ్లిచేసి యుండిరి. దురదృష్టవశమున నాతఁడు శత్రువులచేఁ దరుమఁబడి కడుఁగ్రూరముగా వధింపఁబడెను. అతఁడు చనిపోవునప్పు డతనియేకపుత్రిక మదనకళ పండ్రెండేండ్లబిడ్డ. భర్త చనిపోఁగా, రాజ్యము శత్రువులచే నపహరింపఁబడఁగా దిక్కుమాలినది యై పసిబిడ్డను దోడ్కొని [illegible] చేరెను. వృద్ధుఁడైనకాశ్మీ

రరాజు చెల్లెలిగతి కెంతయు వగచి యామె శోకసాగరము నిచ్చి దుఃఖపీడితలైన యాతల్లిబిడ్డల కేకొదవయుఁ గలుఁగనీయక యన్నివిధముల వారిని గాపాడుచుండెను. కాని యుత్తమక్షత్రియకాంత యగునాతని చెల్లెలు భర్తృవియోగదుఃఖమును భరింపఁజాలక కొలఁదికాలములోనే మరణించి స్వర్గమునందున్న భర్తృసాన్నిధ్యమును గాంచఁగలిగెను.

అట్లు తల్లియుఁ దండ్రియు లేనిమదనకళను వృద్ధుఁడగురాజు తాను బ్రతికినంతవఱకును మిక్కిలి గారాబముతోఁ బెంచెను. ఆమెదుస్థితిం గాంచి ప్రజలందఱును మిక్కిలి జాలిపడుచుండిరి. ఆమెయుఁ బ్రజలను మిక్కిలి ప్రేమించుచుండెను. ప్రజ లేకథాటిగా నామెను దమకు రాణిగాఁ జేయవలయునని వృద్ధరాజును బ్రార్థించిరి. అతఁ డందుల కామోదించి యామె పతినకష్టములను మఱపించి సుఖపెట్టుటకై తనకుమారుఁడును యువరాజును నగువిక్రమసేనునకు మదనకళను రాణిగాఁ జేయఁదలఁచెను. యువరాజునకుఁ బట్టాభిషేకసమయమున నీవివాహము చేయవలయునని రాజు నిశ్చయించుకొనియెను.

కాని యాకస్మికముగా వృద్ధరాజు మరణించెను. విక్రమసేనుని పట్టాభిషేకమును సూర్యసేనుఁడు తనకపటతంత్రములచే ముహూర్తములను దప్పించివైచుచు నేఁడాదివఱకును జరుగనీయలేదు. మదనకళావిక్రమసేనులవివాహముకూడ నాకారణముచేతనే యింతవఱకును నిలిచి యున్నది.

[illegible] టనాపురుషునకు పట్టాభిషేక మొనరించి సూర్యసేనునినుండి యిప్పటికి రాజ్యలక్ష్మిని దక్కించెను. కాని యింతకుముందు నిర్ణయింపఁబడినట్లు పట్టాభిషేకమునాఁడు వివాహము కూడ జరుపుట యెట్లు? ఇందువలన జనులహృదయములలో గొప్పకోలాహలమును బుట్టి నూతనాధీశుని వివాహ మెప్పుడెప్పుడా యనుప్రశ్నలు

వచ్చుచుండెను. అందుచే విక్రమసేనుఁడు నిజమైనరాజైనను జూపని యనురాగమును మదనకళపైని, ప్రేమను బ్రజలపైనిఁజూపి సత్కీర్తి వహించి, పెండ్లియాలస్యమునకుఁ దగినయుత్తర మియ్యవలసినచ్చుచుండెను.

విక్రమసేనుఁడు మహావైభవముతో మదనకళభవనమునఁ బ్రవేశించెను. ఆతఁడు పరివారమునంతను ముంగిటనుంచి యంతఃపురమును జేరునప్పటికి మదనకళ యెదురువచ్చి ,, మహారాజా !" యని సంబోధించుచుఁ బ్రేమతో నాతనిచేయిపట్టుకొని యొకయుత్తమాసనమునఁ గూర్చుండఁజేసి తానావ్రక్కను చెలికత్తెభుజముపైఁ జేయుంచి తలవంచుకొని నిలిచి యుండెను.

విక్రమసేనుఁడు మందహాసవదనముతో ,, రాజకుమారీ ! నేను మహారాజు నైనను నీకు దాసుఁడనే సుమీ ! ప్రియసేవకుఁడ నగునన్ను నీవు ,, విక్రమసేనా !" అనియే పిలువవచ్చును. అట్టిచనవు చూపుటయే మనయన్యోన్యప్రేమకుఁ బ్రియచిహ్నము !" అనియెను.

మదనకళ నవ్వుచు ,, నీవేళాకోళ మటుండనిమ్ము. నీవు రాజైనప్పటినుండియు నిందుృనివలె మెఱసిపోవుచున్నావేమి ? నూతనగాంభీర్యము—అహో ! చెప్పరానియాకర్షణము—నారీసామ్రాజ్యమునకుఁ బట్టముఁగట్టుకొన్న మదనునివలె నున్నావు." అనియెను.

,, నీవు మదనకళ నైనావు." అని విక్రమసేనుఁడు నవ్వెను.

,, అవును లెమ్ము—కాని నీవింతయద్భుతముగా మారుటకుఁ గారణమేమి ?—"

అని మదనకళ యడుగుచుండ నాసంభాషణను మార్పఁదలఁచి విక్రమసేనుఁడు ,, తమ్ముఁ డెచ్చటికో పోయి తిరిగివచ్చుచున్నాఁ డని వింటిని. నానిత్యసాన్నిధ్యముకంటె వానిరాజ్యమును నతనిరాజధాని యగుచేకేన్వగపురమును నతని కానందముఁ గూర్చునట్లు చేయునా బ్రోలు!

అందుకే యాతఁ డెప్పుడును మనరాజధానియందే యుండుచుండును. అతఁడు దగ్గఱ నున్నంతవఱకు మనకు మేలే. ప్రియమైనతమ్ముని జూచుటకు మనము సంతోషపడవలయును.” అనెను.

ఆతనిమాటల కామెనివ్వెఱపడి చూచుచు, మదనకళ “తమ్ముఁ డనకుము. కృతఘ్నుఁడును రాజద్రోహియుఁ బరమశత్రుఁడును నగు ఘోకేశ్వరపురాధీశుఁడనుము! వానిని నీవే యింతపెద్దగాఁ జేసి నీకే ముప్పుతెచ్చుకొనుచున్నావు. వానికి గొప్పగొప్పసైన్యము లిచ్చుటే కాక రాజునుగూడఁ జేసితివి. ఇప్పుడు నీరాజ్యమునుసైత మపహరించి యూతఁడు తానే మహారాజగుటకు యోచించుచుఁ బురములోఁ జాలమందిని తనపక్షమునకుఁ ద్రిప్పుకొనుచున్నట్టు వినుచుంటిని. హృదయేశ్వరా! జాగ్రత్తగా నుండుము. నీకెప్పు డేముప్పువచ్చునో యని నీవు నాయెదుట లేనప్పుడు నామనసులో మనసుండుటలేదు.” అనియెను.

వెలుపల జనులకోలాహలము వినవచ్చెను. రాజసోదరుఁడు సూర్యసేనుఁడు వచ్చుచుండె నని తెలియవచ్చెను. అతని నాహ్వానించుటకు విక్రమసేనుఁడు సౌధాంతర్భాగమునుండి యెదురేగెను.

సూర్యసేనునిరాక కందఱును లేచి నమస్కరించిరి. కాని భగ్నచిత్త లక్ష్యపెట్టక, నడకు లేవనైన లేవలేదు. రాజు తమ్ముని గౌఁగిలించెను. “తమ్ముఁడా! నిన్నుఁ జూడఁ గుతూహలపడుచుంటిని. నీవే వచ్చితివి. సంతోష మైనది.” అనెను.

సూర్యసేనునిముఖమందు వికారమైనవ్య పుట్టెను. దానియర్థమును విక్రమసేనుఁ డెఱుఁగఁడు. కాని గూఢచారులు [illegible] నొకరిగుట్టు నొకరు బయటఁ బెట్టుటకు భయపడుచుఁ [illegible] ముక్కి [illegible].

సూర్యసేనుఁడు దేవిక్రతహాసముతో "అన్నయ్యా! నీచేతికి గాయ మెట్లు తగిలినది?" అనెను.

"నేను నా పెంపుడుకుక్కతో నాడుకొనుచుండఁగా నది కఱచినది." అని విక్రమసేనుఁడు మర్మగర్భితముగా మేలుచేసి ప్రేమించుచుండినరాజునకు సూర్యసేనుఁడు కృతఘ్నుఁడై, విశ్వాసము లేనికుక్కయై రాజును గఱచెననుభావమును సూచించెను.

"కుక్కకాటు విష మందురు. ఆకుక్క నూరకే విడిచితివా?" అని సూర్యసేనుఁడు ప్రశ్నించెను.

"ఎంతైనను నది పెంపుడుకుక్క కదా! దానికాటు విషమైన నది పిచ్చికుక్క యగును. అదిహానికరమే యని తోఁచినచో నప్పుడు దానితల బద్దలుగాఁగొట్టవలెను."

పిమ్మట విక్రమసేనుఁడు తన్నుఁ జూడవచ్చినతమ్మునిదయకుఁ గృతజ్ఞతను దెలిపెను. అతనిదళబలము నభినందించెను. తన్నెత్తిఁగి, మెత్తిపొడుచుచుండినవిక్రమసేనునిమాటల కాతఁడు సహింపలేక చటాలున లేచెను. సెలవు గైకొని పోఁబోయి మరలఁ దిరిగి వచ్చి "మహారాజా! నాస్నేహితు లిరువురు నిన్నుఁ జూడ నభిలషించుచున్నారు. ఏమి సెలవు?" అనెను.

"సరే. అట్టే పంపుము!" అని విక్రమసేనుఁ డంగీకారమును దెలిపెను.

పరిక్కగదిలోనికి విక్రమసేనసూర్యసేనులు కొత్తస్నేహితులను జూడఁబోయిరి. అట నున్న యిరువురుపురుషులును వినయముగా రాజునకు నమస్కరించిరి. ఆవినయములో రాజునకు ఘనౌన్నత్యము గోచరించెను.

"ఈ పెద్దమనుష్యులు మహారాజావారికి నమ్మకస్థులు. నాకున్

ప్రాణస్నేహితులు. ఇతఁడు ఘోరవర్మ. ఇతఁడు కుటిలవర్మ.'' అని సూర్యసేనుఁడు రాజున కెఱిఁగించెను.

ఘోరవర్మ పొడుగుగాఁ బొడవుగా నుండి నిక్కిన వెంట్రుకలతో ఘోరముగాఁ గనఁబడును. కుటిలవర్మ యెప్పుడును ముడిమూతి కల వాఁడు. బట్టతల. వాని పేరునకు సరిగా నాకారముండుటచే వానిహృదయము నట్టిదే యని విక్రమసేనుఁడు తలఁచెను. ''నీకుఁ దగినస్నేహితులే'' యని విక్రమసేనుఁడు మనసులో ననుకొనెను.

వారిరువురును సూర్యసేనుఁడును రాజుకడ సెలవు గైకొని పోయి నంతనే, ప్రియమైనతమ్ముఁడు నతనిస్నేహితులును తొలఁగిపోయినందుకు రాజు సంతసించి యువతలికి వచ్చెను.

పిమ్మట రాజు మదనకళకడ సెలవు గైకొనెను. ఆమె యొక నిట్టూర్పు పుచ్చి ''ఆర్యపుత్రా ! జాగరూకతతో నుండవలెనుసుమా !'' అని ప్రబోధించెను.

''ఎందుకని ?''

''నీవే యెఱుఁగుదువు. ఎఱిఁగియు నెఱుఁగనట్లు నటించుచున్నావు. చెప్పిచెప్పి నాకే విసుఁగగుచున్నది. నీప్రాణములు కాశ్మీరమున కెంతటిప్రధానాధారములో యోచింపుము.''

''కాశ్మీరమునకుమాత్రమే ప్రధానములైన నేనులెక్కపెట్టను.''
ఆమె ముఖము సిగ్గుచే నెఱ్ఱఁబాఱెను.

''నీప్రాణస్నేహితులకుఁగూడను.'' అని యామె చెప్పెను. అంతతో విక్రమసేనుఁడు తృప్తిపడక ''అప్పటికిని లక్ష్యపెట్టను.'' అనెను.

''మఱియుఁ బ్రాణముతో ప్రాణమా నీచరణదాసియగు మేనత్తకూఁతునకును—''

విక్రమసేనుఁడానందాతిశయముచే నేమియుఁ బలుకక యామె హస్తమును జుంబించి రాజసౌధాభిముఖుఁడై పోవుచుఁ దాను రాజపుత్రిని దాఁకుటయే కాక, చుంబించుట మొదలగు శృంగారచేష్టలు పాత్రికు మించిన నటన లని తన్నుఁ దానే నిందించుకొనెను. కాని యప్పటికిఁ దనమనసు నాతఁడు త్రిప్పుకొనలేకపోయెను. ధర్మవ్రతదీక్షాపరతంత్రుఁ డయ్యు నతఁడు విశ్వామిత్రునివలె నొకత్రుటిలో సుందరి యగుయువతిదృగంబకములచే బంధింపఁబడెను. అతఁ డాబంధనములనుండి విడిపించుకొన యత్నించెను గాని యతనియుత్తమచిత్తముకూడ మానవదౌర్బల్యమును జయింపలేకపోయెను. బింకములు పలికిన ముందుకాలపు ‘మునిముచ్చు’ లే ‘తామరసనేత్రిలిండ్ల బందాలు’ గా నైనప్పుడు రాజకుమారుఁడు యువకుఁడు నగునితనిని మన మంతగా నిందింపరాదు కదా!

# పండ్రెండవప్రకరణము.



> "O; What men dare do! What men may do!
> What men daily do, not knowing what they do!"
> (Shakespeare.)

దినము తరువాత దినము గడచుచుండెను. ఎన్నితప్పులు చేసినను, ప్రాతస్నేహితులనే మఱచిపోయినను, దొంగరాజు తనగుట్టు దక్కించుకొని స్థిరముగా నిలిచిపోయెను.

ఒకదినము రవివర్మ యొకజాబును విక్రమసేనునిపైఁ బడవైచి "నీకొకజాబు వచ్చినది. అది యక్షరములనుబట్టి యొకస్త్రీ వ్రాసినట్లు భావించితిని. అది యుండనిమ్ము. మనరాజు సేనదుర్గమందే యున్నట్లు తెలియుచున్నది." అనెను.

"నీకెట్లు తెలియును?" అని విక్రమసేనుఁ డాత్రముతోఁ బ్రశ్నించెను.

"నలుపురిలో నిరువురు రాజధానియందు సూర్యసేనునివెంట నుండుట నీవును జూచితివిగదా! వారు ఘోరవర్మ కుటిలవర్మలు. తక్కినయిరువురును సూర్యసేనునికోటలో నున్నట్లు గూఢచారులవలనఁ దెలిసికొంటిని. వారు వీరవర్మ, శూరవర్మలు. అందులో వీరవర్మ సుందరుఁడును, పరాక్రమసంపన్నుఁడు నైనవాఁడు. అట్టివాని నెట్లో తనకు తంత్రములలోఁ గలుపుకొని సూర్యసేనుఁడు వానికిఁ దనతరువాతి యధికారముల నన్నిటి నిచ్చి యున్నాఁడు. కందకముపైని సంతెన వేయుటకు వీరవర్మసూర్యసేనులకు మాత్రమే యధికారమున్నది. ఇతరసమయము

లం దేల్లప్పుడు నావంతెన తీయఁబడియేయుండును. రాజచ్చటనేయు న్నాఁడనుట కిది యొకయాధారము”

“నే నాదుర్గమున కేఁగెదను.” అని విక్రమసేనుఁడు తొందర తో వచించెను.

రవి—అదేమి యంతతొందర ! నీకుఁ బిచ్చి యెత్తినట్లున్నదే !

విక్రి—ఏమి ? ఎప్పటికినిగూడ నేనాదుర్గమునకుఁ బోకుండ నుం డవలసినదేనా ?

రవి—ఓ ! ఎప్పటికైన నచ్చటికి నీవు దప్పక పోవలసియే వచ్చును—కాని రాణినిఁ జూచినప్పటినుండియు నీవొకవిధముగా నున్నా వేమి ? ప్రేమవ్యాపార మెట్లున్నది ?

“చాలు చాలు ! నీకాసంశయ మెందులకు” అని విక్రమసే నుఁడు గద్దించిపలికి, కోపముతో మనసు స్థిరముగా లేకుండుటచే నటు నిటు లేచి నడయాడుచుండెను.

కొంతసేపు రవివర్మ విక్రమసేనుని దృష్టించి చూచెను. పిమ్మట నేదో యాలోచించుకొనుచు నతఁడును నటు నిటు నడయాడుచుండెను.

“ఎచ్చటి కేఁగినను నావెంట నార్గురుమనుష్యులు రహస్య ముగా వచ్చుచుండుటను నేను గనిపెట్టితిని.” అని విక్రమసేనుఁడు కొంతవడికిఁ బలికెను.

రవివర్మ “నిన్నుఁ గాపాడుచుండుటకు [illegible] నియమించి తిని.” అని నవ్వుచుఁ జెప్పెను.

విక్రి—ఏమీ ? నన్ను నేను గాపాడుకొనలేనా ?

రవి—సూర్యసేనుఁడు నాతనిదుష్టసహచరులు [illegible]

నూడఁదీయుటకుఁ గాచుకొని యున్నా రని [illegible]

ఎంతసమర్థుఁడ వైనను వారి నంతముంది [illegible]

వా ?—సరే—దానికేమి. ఆజాబులో నేమున్నదో చూతము !

విక్రమసేనుఁ డాజాబును జదువఁదొడఁగెను.

" రాజునకు సంబంధించిన ముఖ్యవిషయము నొకదానిని దెలిసి కొనవలె నన్న నీలేఖ చెప్పినట్లు రాజైనవాఁడు చేయవలెను. ఈపుర మునకు వెనుకభాగమున నొకపెద్దప్రాకారము కలదు. దానిలో నొక వేసవిగృహము కలదు. రాజశ్వారూఢుఁడై వచ్చి యందుఁ బ్రవేశించి నచో నచ్చట విశ్వాసముగల స్నేహితు నొకనిఁ గలిసికొనఁగలఁడు. అతఁడు రాజుప్రాణములమీఁదికిని, రాజ్యమునీఁదికిని వచ్చినగొప్ప ప్రతికూలవిషయములను రాజున కెఱిఁగించును. ఈజాబునురాజెవ్వరికిని జూపకుండుఁగాక ! అట్లు చూపించిన నతఁడొకహితురాలగుస్త్రీ మాన ప్రాణములకు హానిదెచ్చినవాఁ డగును. ఆయపరాధమును సూర్యసేన హితకుఁడు క్షమింపఁడు. "

" అహా ! గొప్పమోసము !" అని రవివర్మ భయాశ్చర్యము లతో నఱచెను.

విక్రమసేనుఁడు జాబునింకను నిట్లు చదువసాగెను. " నీకెట్టినం శయమైనఁ గలిగినచో సర్వకార్యసమర్థుఁ డగురవివర్మతో బాగుగ నా లోచింపవచ్చును "

" ఆ ! ఆమె నన్నుఁగూడ నీతోఁబాటు మూర్ఖునిగాఁ జేయఁద లఁచుచున్నదా ?" అని రవివర్మ యనెను.

ఊరకుండు మని సైగ చేయుచు విక్రమసేనుఁడు దాని నింకను నిట్లు చదువసాగెను.

" రాజెవ్వరైనను రాణిమాత్రము మదనకళ కావలయు నని కో రెడుప్రజలను మోసగించి రాజ్యముతోఁబాటు మదనకళ నపహరింపఁ గోరిన నాప్రియుని వేఁటల కనువొనర్చుచుంటినో లేదో రవివర్మ నడు

గుము. నాపేరు 'చ' కారముతో నారంభింపఁబడి నకారముతో ముగి యునో లేదో యతని నడుగుము. ”

అని చదివి ,,చక్రసేనయా?'' యని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

,, అవును. నీవెట్లెఱుఁగుదువు ?'' అని రవివర్మ యాశ్చర్యము తో నడిగెను.

,, మేమిరువురము నొక్కటే నావలో లంకనుండి వచ్చితిమి. ఆమె సూర్యసేనునిప్రియురాలా ?'' అని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

రవి—పెండ్లియాడుట కిరువురును నిశ్చయించుకొన్నారు. కాని యారాజ్యము నపహరించి తనకు మాఱుగా మదనకళను రాణిగాఁ బరి గ్రహింపఁదలఁచిన సూర్యసేనునికార్యమున కసూయపడి యామె యిప్పు డాతనికి వ్యతిరేకముగా నున్నది. ఇదియు మనకార్యమున కొకమేలే.

విక్రమ—ఆమెలేఖ ననుసరించి నేనొకమారచటికేఁగవలయును.

రవి—వలదు. వలదు. స్త్రీల నెంతమాత్రమును నమ్మరాదు. ఎంతైనను దురాత్ముఁడగు సూర్యసేనునిప్రియురాలు గదా !

విక్రమ—కానిమ్ము ! ఈవిషయమునందుమాత్ర మామె కెట్టిదు రుద్దేశము నుండదని నేను భావించుచున్నాను. తప్పక పోయి యారహస్య మేమో తెలిసికొని రావలయును.

రవివర్మ యాతనిదృఢసంకల్పమును మరలింపఁజాలకపోయెను. ఆరాత్రి వారిరువురును గలసి యావేసపిగృహమువంకకు బయలుదేఱి పో యిరి. ఎప్పటివలె రాజశయనమందిరకడ ధర్మవర్మ కావలి యుండెను.

వారిరువురును గమ్యస్థానము చేరినంతనే రవివర్మ ప్రాకారద్వా రముచెంత నిలిచి యుండెను. విక్రమసేనుఁ డాద్వారమును దాఁటుకొని పోవుచు రవివర్మనుద్దేశించి ,, లోపల నేదియైన నపాయము సంభవించు నని తోఁచినచో నీల వైచెదను. అంతవఱకును నీవు లోపలికి రావలదు”

అని చెప్పి యాగృహద్వారపుతలుపుత్రోసికొని లోపలి కేఁగెను. ఎదుట నొకస్త్రీ «రమ్మురమ్ము. నీవు వత్తువనియే నేను వేచి యుంటిని. నీవు లంకాద్వీపపు విక్రమసేనుఁడ వని యెఱుఁగుదును. నేను సూర్యసేనుని యానతిప్రకారమే యాలేఖ వ్రాసితిని. తలుపు వేయుము» అనెను.

«సూర్యసేనునియానతిప్రకారమేనా ?» అని విక్రమసేనుఁ డాశ్చర్యముతోఁ బలుకుచుఁ దలుపువై చెను.

స్త్రీ—ఇరువదినిమిషములలో నిరువురు నిన్నుఁజంపవత్తురు.

విక్ర—ఇరువురా ? ఆయిరువురేనా ?

స్త్రీ—అవును. నిన్నుఁ జంపి నీమృతశరీరమును ఊరిబయటఁ బారవేయుదురు. అది చూచి రాజు మరణించినాఁడని యెల్లరును దలంతురు. ఆవెంటనే సూర్యసేనుఁడు నీమిత్రుల నందఱిని బంధించివైచును మిగిలినయిరువురును కోటలోనున్న నిజమైనరాజును జంపివైతురు. అప్పుడంతయు నరాజకమగుటచే రాజులేని ప్రజలచేఁ బ్రార్థితుఁడైనవానివలె నటించి సూర్యసేనుఁడు తన్ను రాజుగాఁ జాటించుకొని మదనకళను బెండ్లియాడును తెలిసినదా ?

విక్ర—పన్నుగడ చక్కగానే యున్నది. కాని నీవే నీభర్తను స్తంత్రమునుగూర్చి నాతోఁ జెప్పుట వింతగా నున్నది.

స్త్రీ—భర్త యేమిచేసినను ఓర్వవచ్చును గాని మఱొకస్త్రీని వలచినప్పు డెవ్వతె సహించి యుండఁగలదు ? నీవిఁక త్వరగా మరలిపొమ్ము. అడుగడుగునకు నీకు గండము కలదు. రేయుంబగళ్ళు ఆయిరువురును నీవెనువెంటనే యున్నారు. వారికిఁ దగినసమయము చిక్కలేదు కావున నీవింకను బ్రతికియున్నావు. వెళ్ళుము. ఎవరైనను నీయెదుట వచ్చి మార్గము నిరోధించినయెడల వెనుకగాఁ బరుగెత్తిపోయి యచట

నున్న నిచ్చెనసహాయమున గోడ నెక్కి బయటికి దూకుము.

విక్రమ—సరే. అట్లే చేసెదను. ఇఁక నీగతి యేమి?

స్త్రీ—నీవిచ్చటికి రాలేదనియే సూర్యసేనునకుఁ జెప్పెదను. మా మోసమును నీవు కనుగొంటి వని నమ్మఁబలికెదను.

విక్రమసేనుఁ డామెదయకుఁ గృతజ్ఞుఁడై నమస్కరించి, "అమ్మా! ఈరాత్రి రాజునకు గొప్పసహాయము చేసినావు. కోటలో రాజెచ్చోట నిర్బంధితుఁడై యున్నాఁడో చెప్పుము." అనుచుండఁగా వెలుపల నశ్వము సకిలించెను. వెంటనే యెవరో వచ్చుచుండిన యడుగులచప్పుడు వినవచ్చెను.

"అయ్యో! వారు చెప్పినసమయముకంటె ముందుగనే వచ్చినారు?" అని చక్రసేన వడఁకుచు మెల్లఁగాఁ జెప్పెను. ఆమెముఖము కళాహీన మయ్యెను.

ఇంతలో నొకకంఠము—కుటిలవర్మదికాఁబోలు—"లంకారాజసోదరా! నీతో మాటాడవలె నని వచ్చినాము. తలుపు తీయుము" అనెను.

ఇరువురు పురుషులు ఖడ్గపాణులై నిలిచియుండుటను తలుపుసందునుండి విక్రమసేనుఁడు చూచెను.

"నీతో సంధి చేసికొనవలెనని వచ్చితిమే కాని మఱొండు కాదు. నీకే యపాయమును గలుగనియ్యమని మేము ఖడ్గములు పట్టి చెప్పుచున్నాము." అని యాకంఠస్వరము మఱల వినఁబడెను.

"వారిని నమ్మకుము." అని వెనుకనుండి చక్రసేన విక్రమసేనుని చెవిలో నూదెను.

"మనము సంధివిషయమై నిలిచియున్నట్లే యీవలావలనుండి మాటాడుకొనఁగూడదా?" యని విక్రమసేనుఁ డనెను.

,, నీవు తటాలునఁ దలుపు తెఱచి మమ్ములను వధింతు వేమో." అని మరలఁ బ్రశ్న.

,, అట్టిమోసమును జేయు నని నేనును ఖడ్గము ముట్టి ప్రమాణము చేయుచున్నాను. " అని విక్రమసేనుఁడు చెప్పెను.

,, నీయోచన సరిగా నున్నది. " అని యిరువురును తలుపునకు దగ్గరగా వచ్చి నిలిచిరి.

,, మీరాయబార మేమి ?" అని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

,, లక్షవరహాల నిచ్చి నిన్ను నీదేశమువఱకు సురక్షితముగా సాగనంపెదను. " అని ప్రత్యుత్తరము.

విక్రి—నన్నుఁగూడ బాగుగా నాలోచించుకొననిండు. మీ మాట లెంతవఱకు యథార్థములో తెలిసికొనవలదా ?

,, వలలో పడుచున్నాఁడురా " యని గొణఁగుచు నొకఁడు నవ్వుటను విక్రమసేనుఁడు వినెను.

" ఎట్టివలకైనను నేను చిక్కువాఁడను గాను. " అని విక్రమసేనుఁడు తనలో నవ్వుకొనెను.

తరువాత ,, నీవు కొంచెముదూరముగా నుండుము. " అని విక్రమసేనుఁడు చక్రసేనతోఁ జెప్పెను.

,, ఏమి చేయఁదలఁచితివి ?" అని యామె భీతితో నడిగెను.

,, చూతువుగాక !" యని విక్రమసేనుఁ డచ్చటనుండిన చిన్న యినుపకవచము నొకదానిని దగిలించుకొని మఱియొకదాని నెడమచేతఁ బట్టుకొని, కుడిచేత ఖడ్గమును బూని, ,, గొళ్ళెము తీసితిని. తలుపులు త్రోసికొని రండు. మీరాయబారము నొప్పుకొంటిని. " అనెను.

వారు త్రోసికొని రాఁగానే యెడమచేతనుండిన కవచమును

పారిపై వైచి వారు క్రిందపడి లేచులోపలఁ దాను తొడుగుకొనియుం డినకవచముతో మోది పలాయితుఁ డయ్యెను.

అట్టహాసము చేయుచు వచ్చి జరిగినసంగతి రవివర్మ కెఱిఁగించి విక్రమసేనుఁ డతనితోఁ గలసి సౌధమున కేఁగెను.

"మనపని క్షేమముగాఁ గొనసాగినందుకును దుష్టులకుఁ దగిన బుద్ధి చెప్పి వచ్చినందులకును దేవునకు వేయివందనములు." అని రవి వర్మ సంతోషముతోఁ బలికెను.

మరునాఁడు సూర్యసేనుఁడు తనయిరువురుస్నేహితులతో దుర్గ మునకుఁ బోయినట్లు తెలిసెను. వారల్లెందు కేఁగిరో రవివర్మధర్మవర్మ విక్రమసేను లెఱుఁగుదురు.

తనవివాహకార్యమునకు రాజేల పూనుకొన లేదని, ప్రజలాం దోళనపడుచుండిరి. ఆసంగతి రవివర్మ రాజున కెఱిఁగించెను. పట్టాభి షేకమునకుముందు రాజుపై నంతయనురాగము చూపని మదనకళ పట్టాభిషేకానంతరము తనయంతఁ దానే రాజున కనేకబహుమానములఁ బంపుచు వివాహమునకుఁ గుతూహలపడుచున్నదనియు నీవిషయమున నాలస్యము చేయుచున్న రాజుపైఁ గోపగించుకొనుచున్నదనియు నెఱింగి రవివర్మ యెంతమాత్రమును సహింపఁజాలక మొగము ముడివైచుకొని మాటాడెను. ఈనూతనపురుషుని నామె ప్రేమించి తరువాత తనరా జునే తిరస్కరించునేమో యని యతనిభయము. ఐనను నతనికి విక్రమ సేనునిపై సంపూర్ణవిశ్వాసముకలదు.

"జనులయాందోళమును బాపుటకును మదనకళను సంతోషిం పఁజేయుటకును నీవామెపేర నీరాత్రి యొకవిందు చేయించెద నని చాటించితిని." అని రవివర్మ రాజుతోఁ జెప్పెను.

"మంచిపనిచేసినావు." అని విక్రమసేనుఁడు సంతోషముతోఁ బలికెను.

,, ఆవిందుకు కన్నియు సిద్ధముగాఁ జేయఁబడినవి. " అని ధర్మవర్మ చెప్పెను.

రవివర్మ విక్రమసేనునిముఖమువంకఁ జూచుచు "నీవీరాత్రి మదనకళపై మిక్కిలియనురాగమును నటింపవలెను. తెలిసినదా ?" యనెను.

,, నటనకు సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నించి చూపెదను. " అని విక్రమసేనుఁడుసాలోచనుఁడై పలికెను.

,, ఉష్ ! అట్లనకుము. స్త్రీలతో నెట్లు మధురముగా మాటాడవలెనో నీవెఱుఁగవా ? వారికిఁ గావలసిన దంతమాత్రమే. " అని తనతెల్లనిబొమ్మలను ముడివైచి విక్రమసేనుని జుఱచుఱఁ జూచుచు రవివర్మ పలికెను.

కావలసిన దంతమాత్రమేనా ? ప్రియునిమధురములైన మాటలతోడనే ప్రియురాలు సంతోషించునా ? ఈప్రశ్న కుత్తరమిచ్చువిషయమున యువకుఁడును ప్రేమవ్యాపారములోఁ గ్రొత్తగా దిగినవాఁడును నగుధర్మవర్మకే విక్రమసేనునికష్టము స్పష్టముగాఁ దెలియఁగలదు. అందుచేతనే అతఁడు జాలితో విక్రమసేనునిభుజముపైఁ జేయి వైచి యేమో చెప్పఁబోయెను. కాని తండ్రియెదుట నతనినోరాడలేదు.

,, వర్ణింపరానిప్రేమతో నిన్ను మనఃపూర్వకముగ వలచియుంటి నని యామె ననునయింపుము " అని ముసలివాఁడు మరల విక్రమసేనునకు బోధించెను.

,, నేనట్టి దేనియుఁ జేయఁజాలను. నట్టిభ్రమలతో నమాయ

కురా లగునామెను వంచింపలేను.” అని విక్రమసేనుఁడు దీనుఁడై పలికెను.

రవివర్మ తనచిన్నకన్నుల సూక్ష్మదృష్టిని విక్రమసేనునివంకఁ బఱపి, “కుమారా! నిన్ను నేనెన్నియోరీతులఁ గష్టపెట్టుచుంటిని. ఇంకను గష్టపెట్టఁజాలను, పోనిమ్ము! నీయిష్టమెట్లో యట్లే కానిమ్ము.” అనియెను.

విక్రమసేనుఁడు రాజుకొఱకుఁ గాక తనకొఱకే యామెను నిజముగా ప్రేమించియున్నాఁడేమో యనియు, యువకుఁ డగునాతఁడు తన ప్రేమ నామెయెదుట నిజముగా వెల్లడించినచోఁ దప్పక ముప్పువాటిల్లు ననియు సంశయించి రవివర్మ యింక నాతని నావిషయమున బలవంతపెట్టలేదు. ఆతఁ డెందుల కట్లూరకుండెనో విక్రమసేనుఁడును గ్రహింపకపోలేదు. “ఈముసలివాఁ డసాధ్యుఁడు!” అని యాతఁడు తనలో ననుకొనెను.

*　　　*　　　*　　　*

బంధుమిత్రాదిప్రధానపురుషులతో మదనకళావిక్రమసేనులు వినోదముగా విందారగించిరి. పిమ్మట నందఱును నాయావినోదములఁ జూచుటకొఱకని నెపము పెట్టుకొని యాయువతీయువకుల నొంటరిగా విడిచి పోయిరి.

రాత్రి చల్లగా హాయిని గొల్పుచుండెను. ప్రక్కనుండిన పూలతోఁటనుండి మలయపవనాంకురములు గవాక్షద్వారములనుండి లోపలఁ బ్రవేశించుచు విరిసినపుష్పాలకమ్మతావులచే నాప్రదేశమునంతను గమ్మ్ర నింపుచుండెను.

అప్పుడు మదనకళారూపమగ్నుఁడై యామెనే తదేకదృష్టితోఁ జూచుచుండిన విక్రమసేనుఁ

ధర్మదీక్షయు, మహాకార్యభారమునుగూడ మఱచిపోయి, తనచే వంచింపఁబడినమదనకళపై జాలిపడుటకు మాఱుగఁ దానే మదనావేశముతోఁ దనచిత్తమును సంపూర్ణముగా నామెకొప్పగించివైచెను. మానవుని స్థితిగతు లిప్పు డిట్లుండు నని యెట్లు చెప్పుటకు శక్యము గాదో, మానవస్వభావమును నట్లే స్థిమితము లేనిదై యెప్పు డెట్లుండునో చెప్పఁదరము కానిదై యుండును. ఒక్కొకసమయమున నెట్టిధీరమానసుఁడైనను దానేమిచేయుచుండినదియు నెఱుఁగకయే పనిచేయుట మానవజాతి కొక దౌర్బల్యము కదా!

మదనకళయుఁ దనప్రేమను విక్రమసేనున కెల్లడించెను. పట్టాభిషేకానంతరమే రాజుపైఁ దన కట్టియవ్యాజప్రేమ జనించినదనియు, సంతతత్వరలో నట్టిప్రేమ పుట్టుటకుఁ గారణము నేనే యూహింపలేకుంటి ననియు మదనకళయొప్పుకొనెను. ఆప్రేమమయులిర్వురు నమందానందముతోనే సంభాషించుకొనుచుండిరి.

తటాలున విక్రమసేనునిమోహము వెల్లనై పోయెను. తానేపని యందు నియమింపఁబడి యెట్టికార్యముఁ జేయుచుండెనో యతనికి స్మృతికి వచ్చెను. అతఁ డప్పుడు తనతప్పును విన్నవించుకొని మదనకళకు యథార్థము చెప్పి క్షమార్పణ వేఁడుకొనవలెనని నిశ్చయించెను.

ఇట్లు కృతనిశ్చయుఁడై విక్రమసేనుఁడు తనసత్యచరిత్రమును స్పష్టముగాఁ బ్రదర్శించునుద్దేశముతో ,, ప్రియా! నీవుచెప్పినమాట సత్యమే— దానికిఁ గారణము లేకపోలేదు. పాపమాసంగతి నీకుఁ దెలియుదు. మదనా! ఇటు చూడుము! నేను——నిజముగా——నీ——''

అని యింకను బైయక్షర మాతనినోటినుండి వెడలకుండఁగనే చటాలున నొకపురుషుఁడు కిటికీచెంతకు వచ్చి నిలువఁబడియెను. ఇంక విక్రమసేనునిమాట నోటిలోనే నిలిచిపోయెను. ఆవచ్చినవాఁ డెవ్వఁడు?

—రవివర్మయే. అతఁడు యథోచితముగా వంగి నమస్కరించెనుగాని యతనికుటిలలలాటమునందలి తీవ్రదృష్టులుమాత్రము విక్రమసేనుని శాసించుచునే యుండెను. ఆదృష్టుల కాతఁడు విసముద్రికై యందలి రహస్యాదేశమును రాజైనతానే శిరసావహింపవలసినవాఁ డయ్యెను.

అప్పుడు రవివర్మ భయభక్తి వినయవినమ్రభావముతో ,, మహారాజా ! వేయివందనములు. క్షమింపవలయును. ఎవరో యొకమహాత్ముఁడు మీదర్శనమును గోరి చాలసేపటినుండి వేచి యున్నాఁడు " అని యదియే తనరాకకుఁ గారణమైనట్లు నెపము వెట్టి విన్నవించెను.

అతని చిన్నకన్నులలోనిదృష్టి నివ్వెఱపడిచూచుచున్న విక్రమసేనునిదృష్టిలోఁ గలిసెను. ఆతనిచూపులు ,, జాగ్రత్త ! రహస్యమును వెల్లడింపఁబోవుచుంటివి." అని విక్రమసేనుని హెచ్చరించి భయపెట్టుచుండెను.

అప్పుడు వెలుపలనుండి మదనకళావిక్రమసేనులు దంపతులగుట కిష్టపడిరని వారిస్వయంవరమున కందఱినోటను జయజయశబ్దములు వెడలెను. రవివర్మ లోపలికి వచ్చి విక్రమసేను నొకచేతను, మదనకళ నొక చేతను బట్టుకొని యాశీర్వదించి, ,, మీరొకరికొకరు మాట యిచ్చుకొంటిరి. మాకు సంతోషమైనది. త్వరలోఁ దగినసమయమున మీ వివాహమహోత్సవమును జూడఁ గుతూహలపడుచున్నాము." అని చెప్పి ,, మహారాజునకు జయము ! రాజపుత్రికి జయము." అని జయధ్వానము చేసెను. అందఱును వారి ననుసరించి జయజయధ్వనులు చేసిరి.

ఇప్పుడు విక్రమసేనుఁడును మదనకళయు జనులజయజయధ్వనులతో నూరేఁగుచుండిరి. నేనురాజును కానని విక్రమసేనుఁడు చెప్పినను

పిచ్చిమాట యని యెవ్వరు నిప్పుడు నమ్మఁజాలనంతసంతోషములో నుండిరి.

ఈవినోదము లన్నియు ముగిసి రాజు శయనమందిరమునకు వచ్చునప్పటికి బల్లున తెల్లవాఱెను. అప్పుడు రవివర్మ యొక్కఁడే యతనికడ నుండెను. ఈవిచిత్రనాటకమున కాశ్చర్యపడుచు విక్రమసేనుఁడు కూర్చుండెను.

"సమయమునకు నేను వచ్చి యంతయుఁ జక్కఁబఱచితిని గాని నిన్న నీవేమఱచి పోయి రాత్రి రాజునే మోసగింప సిద్ధపడితివే! అప్రమాదమువలన నెంతపుట్టిమునుఁగు ననుకొన్నావు!" అని రవివర్మ నొచ్చుకొనియెను.

"నన్ను నేనే మోసము చేసికొనుచుంటిని. దానినిమాత్రము నీవు యోచించుటలేదు." అని విక్రమసేనుఁడు విసుగుతో నతనివంకఁ జూచుచుఁ బలికెను.

"ఔనులే! అంతవిసుఁగు తెచ్చుకొన్నచో మాటదక్కునా? మానప్రాణములు నిచ్చునా?" అని రవివర్మ తలయూఁచి యూరకుండెను.

"మాట మాటకు నన్నెత్తిపొడిచి, తప్పుపట్టి యవమానించుచున్నచో సూర్యసేనుని, నతనిసోదరుఁడైనరాజును నిరువురనుగూడ లక్ష్యపెట్టక యారాకుమారిని నేనే వివాహమాడతీరెదను." అని విక్రమసేనుఁడు రవివర్మను బెదరించెను.

"కుమారా! నేను వలదందునా? నీకు ధర్మమని తోఁచినట్లు చేయుము!" అని రవివర్మ శాంతముగా వచించెను.

"ఆర్యా! నేను యోచింపక అనరానిమాటయంటిని. మానవ [illegible]

వడక ముందే మనము ఛేకేశ్వరపురమున కేగి సూర్యసేను నోడించి యతనిసోదరుని నతనిస్థానమునకుఁ జేర్చుదము. నాకష్టదశను గుర్తెఱిఁగి నేనాపిశాచమునకుఁ బట్టువడక ముందే దయచేసి నామొఱాలకింపుము" అని విక్రమసేనుఁడు దీనతతోఁ బ్రార్థించెను.

రవివర్మ విక్రమసేనునిఁ గౌఁగిలించికొని ,, నాయనా! ఈజగంబునం దెందును నీవంటి యుత్తమపురుషుఁడు పుట్టఁబోఁడు. నీమంచి నడవడికి నీవుకోరినది బహుమానముగా నిచ్చుట నాకువిధియే. కాని రాజసేవకుఁడనై రాజునకు ద్రోహము చేయఁజాలను. ప్రజలు ప్రేమించి బూజించు రాకుమారిని వారినుండి వేఱుచేయలేను." అని గద్గదస్వరముతోఁ బలికెను.

విక్రమసేనుఁడు రవివర్మకన్నులలోఁ దనకన్నులను గలిపెను. ఆయిరువురినేత్రములు నశ్రుపూరితములై మంచిముత్యములవంటి యొకటిరెండు సకరుణంబు లగుబాష్పబిందువులనుగూడ వెలువరించెను.



## పదుమూఁడవప్రకరణము



"God help the man whose heart ever changes with the world." (Dickens.)

,, నేను వెదకఁబోయినచిలుక యిదేకాఁబోలు! అందులకే స్త్రీజాతి ననహ్యించుకొనుచుండునామననే యీమెచే నాకర్షింపఁబడుచున్నది. ఐన నిది నాకు లభించు టెట్లు?—తొలుత నందులకును గంటకమైయున్న సూర్యసేనుని నిర్మూలింపవలెను. రాజుకొఱకై కాదు!—నాకొఱకే—పిమ్మట రాజును—అటుపిమ్మట రవివర్మధర్మవర్మలను—అప్పటికిఁగదా యీసుందరీరత్నము నాకు లభించుట! అహో దారుణము! నామనసునందే యింతకల్మషము పెట్టుకొని ప్రపంచమును నిందించు టెందులకు?—కాని యట్లొనరించుటయందు దారుణ మేమున్నది? పవిత్రప్రేమయే విపన్మయ మందురు కదా! ఆమె నన్నుఁ బ్రేమించుచున్నది. నేనామెను బ్రేమించు చున్నాను. మాపవిత్రప్రేమ కాటంకముఁ గల్గించువా రేవిధముచేనైనను వధ్యులేగదా! రాజైనఁ గాని, రవివర్మ కాని, ధర్మవర్మ కాని మాప్రేమ కడ్డుచెప్పుటకు వారెవ్వరు? రాజ్యముకొఱకై నేను వారిని వధించుట లేదుకదా! నాపవిత్రప్రేమ పాలనకై మాత్రమే—ఇది యధర్మ మెట్లగును?—

కాని మదనకళ నేను రాజుననియే నన్ను బ్రేమించుచున్నది. నా నిజము నెఱిఁగినఁ బ్రేమించునో లేదో యెట్లూహింపఁగలను? కావున నాప్రేమ మోసమైనది—ఐనను చింత లేదు. నేనెవ్వఁడ నైనను నెట్టివాఁడ నైనను నన్ను నీవు ప్రేమింతువా యని హాస్యముగా నడిగిన

ట్లుసిగి యీ మెయుద్దేశమును గ్రహించి యామెచేఁ బ్రమాణము చేయిం చుకొనవచ్చునుగదా! అప్పుడు మనఃపూర్వకముగా నన్నేవలచిన యా రమణీమణి నాసొమ్మయగును. కాని యట్లు చేయుట నావంటివానికి ధర్మమో యధర్మమో యింకను నేను నిర్ణయించుకొనఁజాలకున్నాను."

అని విక్రమసేనుఁడిట్టియోచనలతోఁ గొట్టుకొనిపోవుచుండెను. ఆయాకర్షణము నెదిరించుటకుఁగాని, దానిని దప్పించుకొనుటకుఁగాని ప్రయత్నించుట యువకుఁడగునాతనికి శక్తికిమించిన కార్య మయ్యెను.

మదనానలతప్తచిత్తుఁడై విక్రమసేనుఁ డా రాత్రి యంతయు నిద్రింపలేదు. తెల్లవాఁరంతనే ప్రియసీసందర్శనకుతూహలముచేత రవి వర్మకైనఁ జెప్పక, వెంట నొక్కనినైనఁ బెట్టుకొనక మదనకళాసౌధము వంకఁ బోవసాగెను.

రాజాకస్మికముగా నొంటిగావచ్చినందులకు మదనకళ యాశ్చర్య పడెను. ఐనను నతనిరాక యామెకు మేలే యైనది. ఆమె యొకయుత్త రమునుదీసి రాజున కందించెను. అందిట్లుండెను.

"ప్రియమైనమేనమఱఁదలును, వదినెయు, కాఁబోవు మహారా ణియునైనమదనకళాదేవిగారికి. మఱదియగు ఘేకేశ్వరాధిపతి నమ స్కారములు.

మీరు ప్రతిసంవత్సరమును మారాజ్యములను జూడవచ్చి మా దుర్గమందాతిథ్యముఁ గొని మమ్ము గౌరవించుచుంటిరి. కాని మా మూలుప్రకారము మీరీయేఁడు రాలేదు. ఈసేవకునిపై దయతప్పిన ట్లున్నది. నాదేమైనఁ దప్పుండిన మన్నించి రాఁబోవువారమందు జరుగు చుండిన ఘేకేశ్వరస్వామిమహోత్సవమునకు మారాజ్యమునకు మీదివ్య సందర్శనము నొసఁగి మమ్ముఁ గృతార్థులుగాఁ జేయఁ బ్రార్థించెదము.

ఇట్లు, సూర్యసేను.డు."

రాజా లేఖను జదివి విసుగుతోఁ బారవైచెను. మదనకళ నవ్వి సుఖియొక జాబు తనచేతి కిచ్చి, "ఇదెవ్వఁడో యెచటినుండి వచ్చుచున్నదో యెఱుఁగను." అనెను.

ఊరుపేరును లేని యిట్టివ్రాఁతయే మున్నొకప్పుడు జరుగుచుండినకుట్రలవిషయమై విక్రమసేనుని హెచ్చరించి యుండెను. అపరిచయమునుబట్టి యతఁడాజాబు చక్రసేనదని క్షణములో గ్రహింపఁగలిగెను. అతఁడు దాని నిట్లు చదివెను.

"అక్కా! నేను నిన్నుఁ బ్రేమించి దయఁదలఁచుదానను గాక పోయినను నామేలుకై నీమేలును గోరవలసి యున్నది. ఆదురాత్ముఁడగు ఛేకేశ్వరాధిపతిచేతినుండి భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక! అతనియాహ్వానముల నొక్కటినిగూడ నీవంగీకరింపకుము. వెంట పెద్ద సిబ్బంది లేనిదే నీవు కదలకుము. ఎంతపెద్దసైన్యము నిన్నుఁ గాపాడుచుండినను నీవు సురక్షితముగా నుండలేవు. నీవైనయెడల దీనిని గాశ్మీరము పాలించువానికిఁగూడఁ జూపింపుము——ఇట్లు——"

"'రాజునకు' అని సులభముగాఁ జెప్పుటకు బదులు 'కాశ్మీరముపాలించువానికి' అని వ్రాసిన దేమి?" అని మదనకళ విక్రమసేనునిభుజముపైఁ దలనుంచి పలికెను.

"దేవీ! నీవునన్ను నిజముగాఁ బ్రేమించుదాన వైనచో నీయుత్తరమునందలి ప్రత్యక్షరమును విశ్వసించి దీనియుపదేశము ననుసరించుచుండుము. ఈదినమే నీసౌధముచుట్టును భటవర్గము కావలి యుండున ట్లాజ్ఞాపించెదను." అని విక్రమసేనుఁడు ప్రశ్నోత్తరముగా నుత్తరమిచ్చెను.

తనక్షేమముంగూర్చి తల్లడపడుచు నుపదేశించిన తనప్రాణప్రియునియాజ్ఞను బాలించుబాధ్యతకు లోఁబడినచిత్తము గలదగుటచేతను దనకాకస్మికముగా నెట్టియపాయముగలుగునో యని శంకించుచున్నదగు

టచేతను మదనకళ తనమొదటిప్రశ్న మాటయే మఱచి తత్కాలోచిత ముగా విక్రమసేనునుద్దేశించి ,, ప్రియా ! నాకు జ్వరము వచ్చిన దని యో, ప్రస్తుత మవకాశము లేదనియో నాకు చెప్పి యీయుద్వాహ భారమును దప్పించుకొందును.” అని చెప్పెను.

,, అట్లే చేయుము. మరియాదకొఱకు మహారౌరవమును జేర నంగీకరించుట మంచిపని కాదు.” అని బోధించి విక్రమసేనుఁడామెకడ సెలవు గైకొని యటనుండి తిన్నగా సేనాధిపతి యగుసాగరవర్మయిం టి కభిముఖుఁడై పోయెను.

పోవునప్పుడాతఁడు తనలో ,, మేముసూర్యసేనమహారాజు నాక్రమించి యాతనిచేతులలోఁ బడియున్న రాజును విడిపింపఁ బోయినప్పు డిచ్చట మదనకళను గాపాడువా రెవ్వరు ? రవివర్మగర్మవర్మలు నాతో ఘోకేశ్వరపురమునకు రావలసినవారేగదా ? అట్టిసమయములో మదనకళ నొంటరి గా విడిచిపోవు టెట్లు ? నేనించుకంతయుఁ బ్రేమింపని యీప్రపంచము నందు నావిశుద్ధప్రేమ కేకైకస్థానమగు ప్రియపదార్థ మొక్క-మదనకళ యే గదా ! ఎఱిఁగి యెఱిఁగి యట్టిప్రేమైకమూర్తినిఁ జేసులావ దారుణ విపన్మధ్యమున విడిచి పోవుటకు నామన మెట్లొప్పును ? తగినచర్యలను ముందుగాఁ జేయకుండిన నచట సూర్యసేనునితోఁ బోరునప్పుడు నాకు మదనకళ యెట్లున్నదో యని క్షణక్షణమునకును మనసు రాజధానివంక కే పోవుచుండును. అందువలన నుత్సాహముతో, దీక్షతో రాజవిమోచన కార్యమునకును, సూర్యసేననిగ్రహణకార్యమునకును నేనెట్లు శ్రద్ధాసక్తి తో గడంగఁగలను ?” అని యాలోచించుకొని అందుచేతనే యాతఁడు రవివర్మతోనైన నాలోచింపకయే తనప్రేమాస్పదదేవతకుఁ దగినరక్షణమును దత్క్షణమే యేర్పఱచుటకై సేనానిసాగరవర్మయింటి కేగెను.

సాగరవర్మ యూకస్మికముగా రాజు తనయొద్దకు వచ్చుటను

రాజా లేఖను జదివి విసుగుతోఁ బారవైచెను. మదనకళ నవ్వి మఱియొకజాబు తనచేతి కిచ్చి, " ఇదెవ్వఁడో యెచటినుండి వచ్చుచున్నదో యెఱుఁగను." అనెను.

ఊరుపేరును లేని యిట్టివ్రాఁతయే మున్నొకప్పుడు జరుగుచుండినకుట్రలవిషయమై విక్రమసేనుని హెచ్చరించి యుండెను. ఆపరిచయమునుబట్టి యతఁ డాజాబు చక్రసేనదని క్షణములో గ్రహింపఁగలిగెను. అతఁడు దాని నిట్లు చదివెను.

" అక్కా! నేను నిన్నుఁ బ్రేమించి దయఁదలఁచుదానను గాకపోయినను నామేలుకై నీమేలును గోరవలసి యున్నది. ఆదురాత్ముఁడగు ఛేకేశ్వరాధిపతిచేతినుండి భగవంతుఁడు నిన్ను రక్షించుఁగాక! అతనియాహ్వానముల నొక్కటినిగూడ నీవంగీకరిఁపకుము. వెంట పెద్ద సిబ్బంది లేనిదే నీవు కదలకుము. ఎంతపెద్దసైన్యము నిన్నుఁ గాపాడుచుండినను నీవు సురక్షితముగా నుండలేవు. ఏలైనయెడల దీనిని గాశ్మీరము పాలించువానికిఁగూడఁ జూపింపుము—ఇట్లు—"

" 'రాజునకు' అని సులభముగాఁ జెప్పుటకు బదులు 'కాశ్మీరముపాలించువానికి' అని వ్రాసిన దేమి?" అని మదనకళ విక్రమసేనుని భుజముపైఁ దలనుంచి పలికెను.

" దేవీ! నీవునన్ను నిజముగాఁ బ్రేమించుదాన వైనచో నీయుత్తరమునందలి ప్రత్యక్షరమును విశ్వసించి దీనియుపదేశము ననుసరించుచుండుము. ఈదినమే నీసౌధముచుట్టును భటవర్గము కావలియుండున ట్లాజ్ఞాపించెదను." అని విక్రమసేనుఁడు ప్రశ్నోత్తరముగా నుత్తరమిచ్చెను.

తనక్షేమముంగూర్చి తల్లడపడుచు నుపదేశించిన తనప్రాణప్రియునియాజ్ఞను బాలించుబాధ్యతకు లోఁబడినచిత్తము గలదగుటచేతను దనకాకస్మికముగా నెట్టియపాయముగలుగునో యని శంకించుచున్నదగు

టచేతను మదనకళ తన మొదటిప్రశ్న మాటయే మఱచి తత్కాలోచితముగా విక్రమసేనునుద్దేశించి ,, ప్రియా! నాకు జ్వరము వచ్చిన దనియో, ప్రస్తుత మవకాశము లేదనియో నాకు చెప్పి యీదురాహ్వాన భారమును దప్పించుకొందును." అని చెప్పెను.

,, అట్లే చేయుము. మరియాదకొఱకు మహారౌరవమును జేర నంగీకరించుట మంచిపని కాదు.'' అని బోధించి విక్రమసేనుఁ డామెకడ సెలవు గైకొని యటనుండి తిన్నగా సేనాధిపతి యగుసాగరవర్మయింటి కభిముఖుఁడై పోయెను.

పోవునప్పు డాతఁడు తనలో ,, మేముసూర్యసేనమహారాజును నాక్రమించి యాతనిచేతులలోఁ బడియున్న రాజును విడిపింపఁ బోయినప్పు డిచ్చట మదనకళను గాపాడువా రెవ్వరు? రవివర్మగర్మవర్మలు నాతో చక్రేశ్వరపురమునకు రావలసినవారేగదా? అట్టిస్థితిలో మదనకళ నొంటరిగా విడిచిపోవు టెట్లు? నేనింతకంతయుఁ బ్రేమింపని యీప్రపంచము నందు నావిశుద్ధప్రేమ కేకైకస్థానమగు ప్రియపదార్థ మొక్క మదనకళయే గదా! ఎఱిఁగి యెఱిఁగి యట్టిస్త్రీమైకమూర్తిని జేతులార దారుణ విపన్మృత్యుముఖమున విడిచి పోవుటకు నామన మెట్లొప్పును? తగినవ్యవస్థలను ముందుగాఁ జేయకుండిన నచట సూర్యసేనునితోఁ బోరునప్పుడు నాకు మదనకళ యెట్లున్నదో యని క్షణక్షణమునకును మనసు రాజధానివంకకే పోవుచుండును. అందువలన నుత్సాహముతో, దీక్షతో రాజవిమోచన కార్యమునకును, సూర్యసేనగ్రహణకార్యమునకును నేనెట్లు శాంతచిత్తముతోఁ గడంగఁగలను?'' అని యాలోచించుకొని అందుచేతనే యువ తఁడు రవివర్మతోనైన నాలోచింపకయే తనప్రేమదేవతకు రక్షణమును దత్క్షణమే యేర్పఱచుటకై సేనానిసాగరవర్మకడ కేగెను.

సాగరవర్మ యాకస్మికముగా రాజు తనయొద్దకు వచ్చుటకు

సంతోషాశ్చర్యసంభరితుఁడై చాలమర్యాదలు గావించెను. రాజాతనికి రాకుమారిసంరక్షణభారముంగూర్చిచెప్పి సూర్యసేనునిఁగాని, మఱెవ్వరి నిఁగాని సాగరవర్మయు నతనిభటులును వెంటనుండునప్పుడుతప్ప నొంటిగా నామెభవనములోనికి విడువఁగూడ దని కట్టుదిట్టము చేసెను.

"మహారాజా! మీసంశయము నాకు బోధపడినది. సూర్యసేనునికంటెను గూడ మర్యాదలేనివారిని లోకమునందుఁ జూచియున్న నాకెక్కుడుజాగ్రత్త చెప్పవలసినపని లేదు." అని తన తెల్లతలనాడించుచు సేనాని పలికెను.

"ఆర్యా! కొన్నిదినములు నేను రాజధానిని విడువవలసి యున్నది. మూఁడుదినములవఱకును నాకడనుండి నీకేసందేశమును నందకుండినచో, నీకు నేనిప్పుడిచ్చునాజ్ఞాపత్రమును బ్రకటించి సూర్యసేనుని ఛేకేశ్వరంపురాధిపత్యమునుండి తొలఁగించి, యతనికి మాఱుగా నీవే యాయధికారమును బూనవలయును. తరువాత రాజెక్కడ నుండెనో చూపింపవలయునని సూర్యసేనునినిర్బంధింపుము! బోధపడినదా?" అని విక్రమసేనుఁడనెను.

నాగ—సరే! మహారాజా! తమయాదేశమును శిరసావహించి పనిచేసెదను.

విక్ర—"అతఁడు ఇరువదినాలుగుగంటలలో నీకు రాజునుజూపకున్నచో నేమిచేయవలెనో తెలిసినదా?" అని యతఁడు సాగరవర్మనికను సమీపించి భుజముపైఁ జేయివైచి "రాజు చచ్చినాఁడని తెలిసికొనుము! తరువాత రాజుకాఁగలవారి నేరుకొనుభారము నీది. వారెవరో నీవెఱుఁగుదువు కదా?" అనెను.

సాగర—మదనకళారాజకుమారి!

విక్ర—ప్రాణము లుండువఱకు నామెపక్షముననే నిలిచి సూర్య

సేనహంతకునితోఁ బోరాడి యామెను రాణిగాఁ జేసెదనని బాస చేయుము.

సాగర—పంచభూతములసాక్షిగా నాజీవాత్మ సాక్షిగా, నాపర మాత్మని సాక్షిగా మీయాజ్ఞకు బద్ధుఁడను. మీరట్టిఘోరవిపత్తునఁ బడఁబోవుచుంటిరని తలఁచి మహారాజును భగవంతుఁడు కాపాడుఁగాక యని ప్రార్థించుచున్నాను.

విక్రమసేనుఁ డాతనిహస్తములను బట్టుకొని "ఆర్యా! ఇప్పుడు నీయెదుట నిలిచి మాబలాఢ్యపురుషునిగుఱించి వింతవింతకథలను ముందుముందు వింద మని తలఁతును. అంతవింతకథానాయకుఁడెవరైనఁగా నిమ్ము. అతఁ డింతవఱకును రాజ్యమును బాలించినవిధమునుబట్టి యీ తఱిమొదల నీయభిప్రాయమేమి?" అని తనయథార్థస్థితినిగూర్చి సమర్మకముగా వెలువరించెను.

అవృద్ధుఁ డతనిహస్తముల నొత్తి పట్టుకొని, "కాశ్మీరపాలకుల ననేకులను నేనెఱుఁగుదును. మిమ్మును నేను బాగుగా నెఱుఁగుదును. ముందు మనవిధిని భగవంతుఁ డెట్లువ్రాసినను మీరు ధీరత్వమునను, వీరత్వమునను, సమానాదరణభావమునను, పవిత్రప్రేమవిలాసమునను, రాజ్యతంత్రనైపుణ్యమునను బేరొందినవారై ప్రజలను రంజింపఁజేసి రాజవంశమున నిట్టిరామరాజును మఱెప్పుడును జూడ మనుతలంపును నందఱిహృదయములందును నాటింపఁజేసితిరి." అని తనమనసులో నిజమని తోఁచినదానినే చెప్పెను గాని లేనిపోనిమాటలతో స్తోత్రపాఠములను ముఖప్రీతిగాఁ జేయలేదు.

విక్రమసేనుఁ డాతనియింగితజ్ఞానమునకు సంతోషించెను. మఱియు రాజ్యరక్షణమునం దాతనవిశ్వాసమునుగూర్చి ప్రేమార్ద్రహృదయుఁ డయ్యెను. సాగరవర్మ యింకను నేమేమి ఘోరములు సంభ

వింప నుండెనో యని దీనభావముఁ దాల్చి నిట్టూర్పులువిడుచుచుం డెను. విక్రమసేనుఁ డాజ్ఞాపత్రమును వ్రాయఁబూనుచు, " నాచేతి గాయ మింకను బూర్తిగా మానకపోవుటచే వ్రాఁతయుఁ జక్కఁగా వ్రాయలేనేమో యని జంకుచున్నాను. " అనియెను.

సాగరవర్మ " అవును మహారాజా ! వ్రాఁత యింకను మీరెప్పటివ్రాఁతకుఁ గుదురలేదు. ఇంచుక భేదము కనఁబడుచున్నది. కాని నేనే యీయాజ్ఞాపత్రమును ఛేకేశ్వరపురాధిపత్యమునకై యాశపడి సృజించితి నేమో యనుననుమాన మెల్లరిహృదయములందును బుట్టవచ్చు నని జంకుచున్నాను. " అనెను.

" మఱేమియును భయములేదు. రాజముద్రికయున్నదికాదా?" అని విక్రమసేనుఁ డాజ్ఞాపత్రమును ముగించి యాతనికిచ్చెను. సాగరవర్మ దాని నందుకొని విరక్తిసూచకముగనవ్వుచు " మీరు సూర్యసేనునిఁ జూడఁబోయెదరా ?" యనెను.

" అవును. అతనితోఁగూడ దుర్గమందున్న మఱియొకనినిగూడఁ జూడఁబోవుచున్నాను. ఆరెండవవానితోడనే మొదటివానికంటె మన కెక్కువపని యున్నది. అదియే ముఖ్యకార్యము "

" నేనును మీతోఁగూడవచ్చి " అని యించుక యూఁగిపోరుపతరింగితరక్తవర్ణుఁడై సాగరవర్మ తనముసలిమీసమును దువ్వుచు " మీకొఱకును, ధర్మముకొఱకును, సీనామాజ్యముకొఱకును నేనా సూర్యసేనదురాత్మునొక్కదెబ్బ కొట్టి కోపము దీర్చుకొని సంతోషింపవలె నని యున్నది. " అనెను.

" ఆర్యా ! అట్లు కాదు ! నీకు నాపైనున్న ప్రేమ కెంతయు సంతసించితిని. కాని యెయ్యది నాప్రాణములకంటె నెక్కుడుగాఁ బరిగణింపఁబడుచుండునో, ఆయ్యాశ్రమమునకు నాప్రాణమొక నడ్డువేయ

నిచ్ఛగించుచుంటినో యట్టి రాకుమారిని సంరక్షించుభారము నీపై విడి చితిని. నావెంట వచ్చి చేయు సేవలకంటె నిటనుండియే నాకు వేయిన పర్యలు చేసినవాఁడ వగుదువు. నాప్రాణములకంటె నారాజ్యముకంటె నమూల్యమగుదానిని నీసంరక్షణమునకు విడిచి పోవుచున్నాను. ఈభారమంతయు నీవు వహింపవలెను"

"మహారాజా! అట్లే కానిండు. ఆమెను సురక్షితముగా మీకుఁ దిరుగ నప్పగించెదను. లేదా యామెను రాణిగాఁ జేసెదను. లేదా మీయాజ్ఞాపరిపాలనదీక్షయుందే మరణించెదను."

విక్రమసేనసాగరవర్మలు పరస్పరమును కౌఁగిలించుకొనిరి. సాగరవర్మ కన్నీటితో విక్రమసేనుని సాగనంపెను.

విక్రమసేనుఁ డటనుండి తిన్నగా తనసౌధమునకు వచ్చి తాను గావించిన పనిని రవివర్మ ధర్మవర్మల కెఱిఁగించెను. విక్రమసేనుఁడు తన్నడుగకుండఁగనే చేయవలసినపనిచేసి పిమ్మటఁ జెప్పుచున్నాఁ డని రవివర్మ యించుక గొణఁగుకొని కొన్నితప్పులు పట్టెను, మఱికొంతసేపటికి విక్రమసేనునిఁ జాల మెచ్చుకొనెను.

తమకార్యక్రమమును వారు ముందుగాఁ దీర్మానించుకొనిరి. మృగయావినోదమునకై రాజేగుచున్నాఁ డని చాటించి మరునటిదినమే సూర్యసేనునిపై రహస్యముగా దాడివెడలుటకు వారు నిశ్చయించిరి.

సాయంకాలము ప్రజలజయజయధ్వానములతో విక్రమసేనుఁడు మదనకళాసౌధమున కేఁగెను. రాజు తెల్లవారఁగానే వేటకు వెళ్లునని విన్నమదనకళ వియోగభయముచే రాజుకొఱకై యెదురుచూచుచుండెను.

"మీరు వెళ్లుటకు ముందు నాప్రేమను గనఁబఱచుచు మీకొకవిందు చేయలేనందులకు విచారించుచున్నాను. కాని మీరు ఆకస్మి

కముగా నిట్లు వెళ్లుదు రని నేను కలఁగనలేదుకదా ?'' అని మదనకళ పలికెను.

'' రెన్నాళ్లుమాత్రమేకదా నాపోక !''

'' పులివేటకా ?''

'' కాదు. ఏదుపందులవేఁట. ''

'' ఓ ! అవి చాల తీవ్రమైనమృగములు! పందినిఁ జంపినవాఁడే బంటని యీవేఁట భయంకరమైనట్లు చెప్పుచుందురు. కావున మీరు జాగ్రత్తగా నుండవలయును. మనదేశమునఁ జాలకూ్రరమైనట్టియు, నేనుఁగులవలెఁ బెద్దవైనట్టియుఁ బందు లున్నవని విన్నాను. ''

'' నీవింతకుముందు వినియుండనంతటి పెద్దపందినే నేనిప్పుడువేఁటా డఁబోవుచున్నాను. ''

'' యువకుఁడవైననీకుఁ జేఁజిక్కినస్త్రీమనసును వేఁటాడి లోఁబ ఱచుకొనఁ బ్రయత్నింపవలెను గాని నన్ను వియోగదుఃఖమున ముంచి వేఱువేడుకలకై పోవుటకుఁ బ్రేమమూర్తివగునీమనసెట్లు తాళఁగలుగు చున్నది ? మొన్ననేకదా నిన్ను విడిచి యొకనిముసమైన నుండలే నం టిని. నీవును నామాటనే చిలుకవలె వల్లించితివే ! అంతయును మఱచి పోయితివి కాఁబోలు !'' అని యామె ప్రణయకోపముతోఁ బలికెను.

ఆమెను కోపింపఁజేసి యానందపడ నిచ్ఛగించిన విక్రమసేనుఁడు '' దేవీ ! ఆపందినన్నే వేఁటాడివైచునేమో ! మదనకళా ! అది నన్నే మ్రింగివైచునేమో !'' యనెను.

ఆమె మారుపలుక కూరకుండెను.

'' నాయాపదకు నీవు సంతోషింతువా ?''

ఆమె యప్పటికినిగూడ నేమియుఁ బలుకలేదు. ఆమెకన్నులు నీరు గ్రమ్మియుండెను.

విక్రమసేనుఁడు విచారపడి, ,, మదనకళా! నీవులేనివినోదము నాకేమియు లేదని యెఱుఁగవా ? నేను వేటకై పోవుచున్నాననే తలఁచితివా ?—” అనుచుండ మదనకళ యాత్రముతో ,, నీవు పోవుచుండుట లేదా ?” యనెను.

,, మఱొకవిధమైనవేఁటకుఁ బోవుచున్నాను. సూర్యసేను నతని గుహాయందే పట్టఁబోవుచున్నాను.” అని విక్రమసేనుఁ డనుచుండఁగనే మదనకళముఖము తెల్లఁబాఱుచుండెను.

విక్రమసేనుఁడు మఱల నిట్లు చెప్పఁదొడఁగెను. ,, నీవు సూర్యసేనునివిషయమై నన్నుఁ బలుమారు హెచ్చరించుచుంటివి. నీ ప్రియుఁడజాగ్రత్తగా నున్నాఁడని తలంపకుము. నేను త్వరలోఁ దిరిగి వత్తునని యే విశ్వసించుచున్నాను ”

,, నాకు నీక్షేమము నెప్పటికప్పుడు తెలుపుచుండవలెనుసుమీ ! నాహృదయ మెల్లప్పుడుఁ జీకాకుపడుచుండును.”

,, ప్రతిదినము నాహృదయమునే నీకుఁ బంపెదను.”

“ ఏయాపదయును నీకుఁ గలుగదుగద !”

,, ఏమో ! ఎట్లు చెప్పఁగలను ?”

,, ఎప్పుడు వత్తువు ?”

,, అదిమాత్ర మెట్లు చెప్పనగును ?”

“ రాకుమారా ! ఎంతత్వరగా వీలైన నంతత్వరగా నాపైని దయయుంచి—నన్నుఁ దలఁచుకొని—”

“ భగవంతుఁడే సహాయపడవలెను. కాని మఱల తిరిగి వచ్చి నిన్నుఁగనుభాగ్యము లే—”

,, ఉష్ ! ఉష్ !” అని మదనకళ చెవులుమూసికొనెను.

విక్రమసేనుఁడు చెప్పుటను మానలేదు. ,,అట్టిభాగ్యము లేకున్న

నీవు నాస్థానమునఁ గాశ్మీరమును బాలింపవలయును. నాకొఱకు విలపించిన నింకను గష్టములఁబడుట తప్ప మఱేలాభమును లేదు. ”

“ అట్టినిరర్థకజీవయాత్ర నేనుచేయలేను. నాకు నీతోడిదే లోకమగును. ” అని మదనకళ కంట నీరుపెట్టి పలికెను.

విక్రమసేనుఁడు తనపవిత్రప్రేమ ఫలించె నని లోలోన సంతసించెను. కాని తననిజనామనివాసముల నెఱిఁగిన నామెప్రేమ చలించునేమో యని భయపడి, యామె నివ్విధమున మోసగింపక తనసంగతి స్పష్టముగాఁ దెల్పినప్పుడుగూడ నీమె యిట్లే తన్నుఁ బ్రేమించునా యని సంశయించెను. ఎట్లయిన నామెసక్రపుఁబ్రేమను సంపాదింపవలయు నని యాతఁ డాశపడుచుండెను. ఆమెప్రేమయెట్టిదో తెలిసికొని యింకను దానాశపడి యుండవలెనో, లేక యింతటితో నాశ వదలుకొనవలెనో నిశ్చయించుకొనవలె నని యాతఁడు తహతహపడెను. ఇప్పుడే యాతఁడు తనభవిష్యజ్జీవయాత్ర నెట్లుగడపవలెనో నిశ్చయించుకొనఁదలఁచెను. అట్టిహృదయావేగముతో నాతఁడు “నేను నీరాజును గాను. కాకున్నను నీవు నన్నుఁ బ్రేమింతువా ?” అని మదనకళ నడుగఁదలఁచి యంతలోనే యానాఁడు రవివర్మ తనకు బోధించినసంగతి జ్ఞప్తికి వచ్చుటచే నేమడుగుటకును నోరాడక యాతఁడు తనసంకల్పమును వదలుకొనియెను.

“సూర్యసేనుఁడు నీకెట్టిహానియుఁ జేయకుండజాగ్రత్తగనుండుము. మనలను వేరు చేయనీయకుము. నీవు వీరుఁడవు. నీవిజయమునకై కాళినిఁ బ్రార్థించెదను.” అని మదకళ వెక్కి వెక్కి యేడ్చెను.

“ అట్లెన్నఁటికిఁ బోనఁగనీయను. మనోహరీ ! ఊఱడిల్లుము.” అని విక్రమసేనుఁ డామె నూఱడించెను గాని మరల మదనకళను గలిసికొనునాశ విక్రమసేనునకు లేదు.

వారిపునస్సంయోగమునకు సూర్యసేనునికంటె బలవత్తరమైన కంటక మాతనికి మార్గనిరోధకమై యుండెను. ఆకంటకము రాజే! సూర్యసేనుఁడు రాజును జంపియే యున్నవో సూర్యసేనుఁడే విక్రమసేనునకుఁ బ్రతిద్వంద్వి కాగలఁడు. సూర్యసేనునిఁ బట్టివైచిన, విక్రమసేనునిసహాయమున విముక్తుఁడగురాజతనికే ప్రతిద్వంద్వియగును. ఎట్లును నతని కాశలేదు. ఎవని విముక్తునిఁ జేయుటకై విక్రమసేనుఁ డిప్పుడు తన ప్రాణములనుసైతముఁ గోల్పోవ సంసిద్ధుఁడై యుండెనో యట్టిరాజే విక్రమసేనునిప్రేమకు ప్రతిద్వంద్వియై యతనికన్నులయెదుటఁ బిశాచమువలెఁ గనఁబడుచుండెను. సూర్యసేనుని నిర్మూలించి రాజును విముక్తునిఁ జేయుటయో, లేక సూర్యసేనునిచే రాజునే నిర్మూలింపఁజేసి తాను క్షేమముగా రాజధానియందు మదనకళాసముక్షమున యావజ్జీవము రాజుగా నటించుచు నిశ్చింతుఁడై యుండుటో, లేక తనమార్గమును బూర్తిగా నిష్కంటకముగాఁ జేసికొనుటకై సూర్యసేనుని నతనియన్నను, దనరహస్యమెఱిఁగిన రవివర్మధర్మవర్మలనుగూడ మూలచ్ఛేదమొనర్చుటయో యేమి చేయవలెనో నిశ్చయించుకొనఁజాలక విక్రమసేనుఁడు విధి తన్నెట్లు నడపఁదలంచెనో యెప్పటి కెయ్యది ప్రస్తుతమో, యెట్లు బుద్ధి పుట్టునో యట్లు చేయవలయు నని నిశ్చయించెను.

,, విమలముఖాలె గావించుదుర్మాయల
వెఱ్ఱిపురుషుఁ బట్టఁ జిలుకా!
విమలలే రమణులు చిలుకా!
విలయస్వరూపలే చిలుకా!''

అన్నవిక్రమసేనుఁడే సంపూర్ణముగా స్త్రీమోహముగ్ధుఁడై పోయెను. ఈసంగతి నతఁడు తిరిగి యోచింపనైన లేదు. కారణాంతరములచేఁ గుటిలులగు మంచివారిని భగవంతుఁడే లేవఁదీయుఁగాక!

---

## పదునాల్గవ ప్రకరణము.



"God defend the right!"
(Shakespeare.)

చేకేశ్వరపురమునకై దుమైళ్లదూరమున నల్లకొండలదిక్కుగానే యొకసుందరమైన మందిరముకలదు. అది పెద్దజమీాందారుఁడైన ధర్మ వర్మ మామది. ఆయింటిని యజమానుఁడుగాని, యాతనికిష్టులగు మఱి యొకరు కాని తఱచుగా నుపయోగించుచుండిరి. ధర్మవర్మ ప్రార్థించు టచే నచట రాజు తనపరివారముతో విడిసియుండుటకు ధర్మవర్మమామ మిక్కిలి సంతోషముతో నియ్యకొనెను.

పేరుపొందినవీరులు పదుగురు విక్రమసేనుని వెంట నిరంతరమును గాచుకొని యుండిరి. వారు రాజకార్యమందుఁ బ్రాణములనైన నిచ్చు టకు సిద్ధముగా నుండిరి. ఎవరో రాజున కాప్తుఁడొకఁడు సూర్యసేనుని చేఁ గోటలో బంధింపఁబడి యున్నాఁడనియు, రాజాతనిని విడిపింప వచ్చియుండె ననియు నెల్లరును రాజున కాకటిన కార్యమందుఁ బ్రాణము లు ధారవోసి యైనను సేవింప వలెననియు మాత్రమే వారికిఁ దెలియును. రాజతంత్రజ్ఞుఁ డగుఁరవివర్మచేసినకట్టుదిట్టములవలన నందొక్కనికైనను రహస్యము బోధపడలేదు.

విక్రమసేనుఁడటకు వచ్చి యున్నాఁడని సూర్యసేనుఁడు తెలి సికొనియెను. ఎందుకు వచ్చియున్నాఁడో కూడ నతఁడెఱుఁగును. అం దుచేఁ జేయవలసిన పనులన్నియు ముందే జాగరూకుఁడై చేయుచు దుర్గమం దెడఁబాయక కావలి కాచుచుండిన యిరుపురిలో నొకఁడగు వీరవర్మను విక్రమసేనుని బరిహసించుటకై రాయబారిగాఁ బంపించెను.

వీరవర్మ మంచిరాజవంశములోఁ బుట్టి నిశ్చింతుఁడై యుండవలసిన గౌరవసామంతరాజవర్గమందుఁ జేరినవాఁడయ్యును దురాశ కలవాఁడు. మహాసాహసవంతుఁడు. రూపవంతుఁడు, విక్రమవంతుఁడు. తొల్లి కర్ణునిసాహాయ్యముపై నాశతో దుర్యోధనుఁడు యుద్ధమునకుఁ గడంగిన ట్లిప్పుడు సూర్యసేనుఁ డితనిప్రోద్బలముచేతనే యితనిబలమును నమ్ముకొనియే యీద్రోహకార్యమును జేయుచుండెను. తనకుండిన బలరూపయౌవనములకు గర్వించి విజృంభించుచుండెను. అతనివయసు ఇరువదేండ్లను మించి యుండదు. అతఁ డిప్పుడుచేయుచుండిన సాహసమును సన్మార్గము దు వినియోగించినచో నతనిరూపమును బలమునుగూడ దేవతలచేతఁగూడ మెచ్చుకొనఁదగియుండునుకదా!

ఆతఁ డిప్పుడు విక్రమసేనుని దర్శించి తన్నాలింగించుకొని “మహారాజా! తమ్ముఁడు సూర్యసేనుఁడు జబ్బుగానుండుటచేఁ దమదర్శనమునకు రాలేకపోవుచున్నారు. అందుచే నట్టియుపచారమునకు నామూలముగా క్షమార్పణమును గోరుకొనుచున్నారు. వారిపక్షమున నన్నే తమదర్శనమునకుఁ బంపుకొన్నారు” అని వీరవర్మ విక్రమసేనున కెఱిఁగించెను. అప్పు డాయందమైన నీచుపెదవిపై వికృతమగు మందహాసరేఖయొకటి యస్పష్టముగాఁ దోఁచుచుండెను.

„ఆజబ్బు సూర్యసేను నెక్కువగాఁ గష్టపెట్టుట లేదుకదా?’ యని విక్రమసేనుఁడు వీరవర్మమాటలను గ్రహించి పలికెను.

„అతఁడు తనపనిని జూచుకొనుదేహదార్ఢ్యము కలిగియే యున్నాఁడు”

“కోటలో నందఱును జబ్బుగానున్నారని నేననుకొనను. అందుచేతనే సోదరుఁడు కోటను నాకు విడిదిగా నీయఁజాలనని చెప్పి పంపి

నాఁడు. కాని—పోనిమ్ము—కుటిలవర్మఘోరవర్మలకు రాజధానిలో వేసవిగృహములో నెవరో బలమైనగాయములు కలిగించినా రని నావిచారణకు వచ్చినది. వారిగాయములు కుదిరినవా ?" యని విక్రమసేనుఁడు నవ్వుచు నడిగెను.

"ఇంకను లేదు. తగినమందు వారికింకను లభింపలేదు." అని వీరవర్మ బదులుచెప్పెను.

ఆమం దెట్టిదో విక్రమసేనుఁడు తెలిసికొనఁగలిగెను. అదియే సూర్యసేనుఁ డిప్పుడు చేయఁబూనియున్న ప్రతిక్రియ !

తనతోఁగూడ విందారగింపు మని విక్రమసేనుఁడు వీరవర్మను వేఁడెను గాని కోటలోఁ దొందరపను లున్నవనిచెప్పి వీరవర్మ రాజును క్షమింప వేఁడెను. "త్వరలో మిమ్ము మఱలఁ గలిసికొనెదను మహారాజా" యని యదేవికృతహాసముతోఁ బలుకుచు నలక్ష్యభావముతో వీరవర్మ, యింతనఱకును రాజువంక తిరిగి నిలిచియుండినవాఁ డావలికి తిరిగి నిలిచియున్న తనగుఱ్ఱముపై నెగురునప్పుడు గుఱ్ఱమువంక వీపుకలవాఁ డయ్యుఁ గూర్చుండులోపలనే సరిగాఁ గూర్చుండి యుండెను. వీఁడు సామాన్యశత్రువు కాదని విక్రమసేనుఁ డాశ్చర్యపడుచుఁ గనఁబడక పోవునంతదూరమువఱకు వానిదిక్కే చూచుచు నిలువఁబడి యుండెను.

ఆరాత్రి మదనకళను దలంచుకొనుచు విక్రమసేనుఁడు విరహవేదన ననుభవించుచుండెను. ఆసమయమున నామెపొందునకై యతని హృదయమునం దెన్నియోదురాలోచనలు పన్నుగడలును బయలుదేఱుచుండెను. ఆవెంటనే యంతరాత్మ తన్ను నిందింప నొచ్చుకొని విక్రమసేనుఁడు పశ్చాత్తాపపడుచుండెను.

తెల్లవారుకొలఁది నలినిహృదయము స్వచ్ఛత నందుచు డెను. అతఁడు తన్నుఁ దా నిందించుకొనుచుఁ బ్రపంచమును దూఱుచు నెదుటనే యుండినతోఁటలోనికిఁ బోయి వీణియను మీటుచు నొకయరుగుపైఁ గూర్చుండెను.

“ రమణిచూపులు తూపు-లమరులె మరణింత్రు,
యముఁ డంగజుఁడె కాఁడ చిలుకా ?
మము నిట్లు బాధింపఁ గడకా
జముఁడంగనయె మూవె చిలుకా ?”
విమలముఖాలెగా-వించుదుర్మాయల
వెఱ్ఱిపురుషుఁ బట్టఁ చిలుకా !
విమలలే రమణులు చిలుకా !
విలయస్వరూపలే చిలుకా !
సిరి నారులే లేని-ధర పవిత్రత నందుఁ
దురితపిశాచముల్ చిలుకా !
పరమోత్తమునిఁ గూడఁ జిలుకా !
పట్టి బాధించునే చిలుకా !
దురితాత్ములనుచు నం-దఱిని నిందించుట
పొరపా టగును గాని, చిలుకా !
పురుషు లొండొరులతోఁ జిలుకా !
పోరి మీఁకై యేద్పిచిలుకా !
రమణీవిమలముఖ-కమలము లొక్కొ-క్క
సమరానఁ బురుషుల జిలుకా !
తమకాశలేనప్డు చిలుకా !
మమతులఁ జేయునే చిలుకా !

అమలులై యిలజీవ-యాత్రి చేయుట కోర్కి-
యాశయే కల దింకఁ జిలుకా !
అడవినిఁ జేరుటే చిలుకా !
కడుదూరముగ నీఁదుఁ జిలుకా !"

అని విక్రిమసేనుఁడు పాడుకొనుచుండఁగా దైవభీతి కాని, భయపడఁదగు మఱియెద్దానిభీతి కాని లేక నీఁటెనపడుచువాఁ డగువీర వర్మ యచటికి వచ్చి రాజుతో రహస్యముగా మాటలాడఁ గోరెను. విక్రిమసేనుఁడు తనవెంటనుండిన పరిచారకుల నావలకుఁ బొండని యాజ్ఞాపించెను.

"రాజుగారు ప్రేమతప్తుఁడై నట్లున్నదే." 'అని వీరవర్మ విక్రిమసేను నెత్తిపొడిచెను.

"అవును. వైరాగ్యప్రేమతప్తుఁడను." అని విక్రిమసేనుఁడు పలికెను.

"అది యుండనిమ్ము. మన మేకాంతముగా నున్నాము. లంకారాజకుమారా ?——" యనుచుండఁగనే విక్రిమసేనుఁడు లేచి నిలువఁబడెను.

"ఏమిసంగతి ?" అని వీరవర్మ ప్రశ్నించెను.

"నాభటునిఁ బిలువఁ దలఁచుచుంటిని. రాజసమ్ముఖమున నెట్లు మాటలాడవలయునో నీకుఁ దెలియకపోయినప్పుడు మాతమ్ముఁడు నీకు బదులుగా మఱియొకదూతను బంపవలసియుండెను."

"ఓహో ! ఏకాంతమునందును నీకీనటనము లెందులకు ?"

"నానటన ముగియువఱకు నేనిట్లే రాజుగా గౌరవింపఁబడుచుండవలెను. నేనవమానితుఁడనైన నేఁగూర్చుండుసింహాసనమున కవమానముకలిగినట్లుగాదా ?"

"అలాగే కానిమ్ము. నీయందుఁ గలప్రేమతో నేనట్లు పిలుచు చుంటిని. మనచిత్తవృత్తు లొక్కటియే గదా!"

"ధర్మమునందు తప్పు."

వీరవర్మ కోపదృష్టితో విక్రమసేనునిఁ జూచెను.

"నీతల్లి బ్రతికి యున్నదా?" యని విక్రమసేనుఁ డాతనికోప మును రేపెట్టునుద్దేశముతోఁ బలికెను.

"లేదు. మరణించినది." అని వీరవర్మపండ్లు బిగఁబట్టి పలికెను. కొడుకు పరమనీచుఁడై పోవుచుండుట నెఱిఁగి యాతనితల్లి హృదయము పగిలి మరణించిన దని విక్రమసేనుఁడు వినియుండెను. అందుకే యీ యెత్తిపొడుపు.

తమమార్గమునుండి తొలఁగిపోవుటకు నీకు సూర్యసేనుఁడు లక్ష వరహాల లంచము నియ్యఁదలఁచి యున్నాఁడని వీరవర్మ విక్రమసేను నకుఁ జెప్పెను. విక్రమసేనుఁడు తిరస్కారముతో నవ్వెను.

"నీవు సమ్మతింప వని యెఱిఁగియుఁ గృష్ణునివలె నేనీరాయబా రమునకుఁ బూనుకొంటిని."

విక్రమసేనుఁ డామాటలకుఁ బెద్దగా నవ్వసాగెను. మఱికొంత సేపటికి—

"మీబందీ యెట్లున్నాఁడని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

"ఎవరు? రా—?"

"అవును, ఆబందీ!"

వీరవర్మ లేచి నిలువఁబడెను. అతఁ డెంతో మక్కువ కలవాని వలె "పోయివచ్చెదను." అనుచు విక్రమసేనునిచేయి పట్టుకొని "దయమాత్ర ముంచుము." అని యతనిని గాఁగిలించినట్లు కౌఁగి లించి మొలనుండిన పిడిబాకుతో నాతనిఁ బొడిచెను. విక్రమసేనుఁడు

బాలసూర్యునికిరణములలోఁ దళతళమని కత్తి పై కెత్తఁబడుటను జూచి యుంచుక తొలఁగెను గాని లేకున్న చో నది యిప్పుడే యతనిహృదయమును జీల్చివేసియుండును.

ఐనను వీరవర్మవంటి వీరునికత్తి పోటూరకపోలేదు. అది యూతనిపక్కలో గాయ మొనర్చెను. విక్రమసేనుఁడు „ హా! ” యని యఱచి పడిపోయెను. అందఱును వచ్చి రాజు హెచ్చరిక తప్పియుండుటను జూచిరి. అశ్వవిద్యలో గట్టివాఁ డగువీరవర్మ యేమార్గమునఁ బోయె నని వెదకుట కాతనిగుఱ్ఱపుడెక్కలజాడయైనను జిక్కలేదు.

రాజు కన్నులు తెఱచి చూచునప్పటి కతనియెదుట సూర్యసేనునిభటుఁ డగుమోహానుఁడు బంధింపఁబడి యుండెను.

„ ఇతఁ డిచ్చటి కెట్లు వచ్చెను. ” అని రాజుతనపక్క నుపచరించుచుఁ గూర్చుండియున్నరవివర్మను బ్రశ్నించెను.

„ మనము మనగద్దలములో నుండఁగా వీఁడు మనసౌధముఁ జొచ్చి చిక్కినయాయుధము లన్నియు దోచుకొనుచుండెను. ” అని రవివర్మ బదులుచెప్పెను.

వానితో నేకాంతముగా మాటలాడుటకై రవివర్మవిక్రమసేనులు తదితరులను బోవ నాజ్ఞాపించిరి.

„ ఓరీ! నీవెందు కిట్లాయుధములను దొంగిలించుచుంటివి ? ” అని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

„ అయ్యా —! ” అని వాఁడనుచుండ రవివర్మ „ ఏమిరా! రాజుగారితో నెట్లు మాటాడవలెనో యెఱుఁగవఁటరా ? ” యని భూమినిఁ దన్నుచు బెదరించెను.

„ ఇతఁడు రాజు కాడని నేనెఱుఁగుదును బాబూ ” అని మోహానుఁడు భయపడుచుఁ బలికెను.

రవివర్మ కోపించి యేమో పలుకఁబోవుచుండ నారకుండు మని విక్రమసేనుఁడు సైగచేసి, కోపించుకొన్న లాభము లేదని, మంచిమాటలతో దుర్గరహస్యములను గనుఁగొన నెంచి,

"ఓరీ! అక్కడున్న రాజెవరు?" అనెను.

మోహనుఁడమాయకుఁడు కాన "రాజుమాప్రభువుగారికోటలో బంధితుఁడై యున్నాఁ"డని విన్నవించెను.

"నీప్రభు వాతని నెందుకు బంధించినాఁడు" అని విక్రమసేనుఁ డడిగెను.

"ఇంకెందుకు బాబూ! అతనిరాజ్యమును తానే యేలవలెనని."

"అదిపాపమని నీకుఁ దోఁచుట లేదా?"

"పాపములో గొప్పపాపము. అట్టిదానియందైనను ఈపొట్ట ప్రాఁగొనఁజేయుచున్నది. ఏమిచేయఁగలను మహారాజా! పాడుపొట్ట! అతఁడు ప్రభువు. వినకుండిన చావు తప్పదు." అని మోహనుఁడు తన పొట్టను ఎదను గొట్టుకొనుచుఁ బలికెను.

వాఁడు నిర్బంధముచే నానీచులను గొల్చుచుండెనని రవివర్మ విక్రమసేనులెఱిఁగి "మేము నిన్నును నీకుటుంబమును భరించెదము. ఆదురాత్ములకొలువువిడుతువా?" యనిరి. వాఁడు సంతోషముతో నియ్యకొని కృతజ్ఞతతో వారిపాదములపైఁ బడెను.

పిమ్మట వాఁడు రాజెచ్చట బంధింపఁబడియుండెనో, యెవరెవ రెచ్చటెచ్చట నెట్లుండిరో మొదలైనదుర్గరహస్యము లన్నియుఁ జెప్పివైచెను.

"ఓరీ! నీవు రాజును సంరక్షించినవాఁడ వగుదువు. రాజు తప్పించుకొన్నంతనే నీకు పెద్దమాన్యముల నిప్పింతుము. నీవు మమ్ములను ద్వేషించువానివలెనే సూర్యసేనునిఁ గొలుచుచు నదటిరహస్యముల నెఱిఁ

గించుచుందుము." అని వానిని గొప్పగా బహూకరించి రవివర్మనిక్రి మనేనులు పంపివైచిరి. అర్థవిజయము నందినట్లే వారు సంతసించిరి.

రాజును విడిపించుటకై రవివర్మాదులు దండెత్తివచ్చినట్లు గ్రహింపఁగలిగినచో రాజును సూర్యసేనుఁడు తత్క్షణమే చంపివేయు నని మోహనుఁడు చెప్పియుండెను. అందుచే వారు రహస్యముగా రాత్రివేళ దుర్గమును ముట్టడింప నిశ్చయించి తగినప్రయత్నములలో నుండిరి.



## పదునేనవప్రకరణము.

---

"The miserable have no other medicine,
But only hope."

(Shakespeare,)

దుర్గమందు బందీయైయున్నరాజు పుల్లవలె చిక్కి శల్యమై, తెల్లఁబాఱినమోముతో దినదినము నిరాశఁ జెందుచుండినహృదయముతోఁ గుట్టూపిరితో జీవించియున్నాఁ డని మోహనుఁ డెఱిఁగించెను. విక్రమ సేనునికంట నీరు వచ్చెను. ప్రపంచదుఃఖానుభవ మంతయు నతనిహృదయములో నున్నట్లుండెను. దుఃఖమయప్రపంచము నతఁడు తలఁచుకొని కంపించి రోసెను.

ఇట్టియసహ్యమునే, యిట్టిరోతనే యచట రాజనుభవించుచుండెను. తనరాజ్యముగతి యేమైనదో, సూర్యసేనుఁడు తన్నెందుకు జీవములతో నుంచియున్నాఁడో రాజెఱుఁగఁడు. క్రొత్తగావచ్చినబంధువు తన రాజ్యమును గాపాడుచున్నాఁడని యతని కెట్లు తెలియును? తనదుస్థితి జీవన్మృతిగా నాతనికిఁ దోఁచుచుండెను. ఐనను నొక్కమాఱుగాఁదన్నుఁ జంపఁదలఁపనివిధాత యెముకలమేనిలోఁ గొనప్రాణ ముంచి కాపాడుట తాననుభవింపవలసినదుష్కర్మఫల మనియుఁ, దనకర్మ తెగిపోయి త్వరలోఁ దనకు విముక్తి కలుగవచ్చుననియు రాజునిరాశలో నాశాంకురములు మొలకెత్తుచుండెను. అందుచే నాఱిపోవుచుండినయాతని యాత్మజ్యోతియందు నూతనజీవనకళలు దోఁచుచుండెను.

రాజధానియం దంతటను దమరాజు వేఁటాడుచుండఁగా నొక ఘాతుకమృగ మాతనిని బలముగా గాయముచేసె ననువదంతి పుట్టెను.

నాశీర్వదించి పుచ్చుకొనెను. ప్రజాహృదయములందు స్థిరపడెను.

సూర్యసేనుని దుర్గమున దీవార్త మఱియొకవిధముగా వ్యాపించెను. వీరవర్మ రాజును బొడిచివచ్చి తనపౌరుషమును నలుగురితోఁ జెప్పుకొనెను. విక్రమసేనుఁడు వెంటనే క్రిందపడుటచేఁ దనఘాతము ఘనమైనదని వీరవర్మ తలఁచెను. ఆతలఁపుతో నతఁడును నచటివారును బాగ పడునట్లుగా, రహస్యముగా నిప్పుడు రాజపరమైన మోహానుఁడు, విక్రమసేనునకు బలమైనగాయము కలిగినదనియు, రెన్నాళ్ళవఱకు కాలనికి స్మృతికలుగుటే కష్టమని రవివర్మాదు లనుకొనుచుండి రనియుఁ, జచ్చుటే మూఁడుపాళ్లు నిజముగాఁ దోఁచుచుండె నని యతనియనుచరులు విలపించుచుండి రనియు నతిశయోక్తులతో నమ్మఁబలికెను. ఈమాటలు నమ్మి దుర్గమువా రించుకయుజాగ్రత్తతో నుండిరి. నిజముగా నెప్పటివలె నుత్సాహముతోఁ బనిచేయుచున్న విక్రమసేనాదు లారాత్రియే తమ దుర్గమును ముట్టడింతురని వారెట్లు తలఁపఁగలరు?

విక్రమసేనుఁడు తనప్రాణములవిషయమై తలఁపకే తనపనిని జేయుచుండెను. అంగరక్షకుల నందఱిని తనకడనుండి తొలఁగింపుమని రవివర్మతోఁ బలికెను. అతఁడు పిచ్చివానివలె రవివర్మాదులుచెప్పిన మాటలను వినక తనధర్మముయొక్క విజయమునుమాత్రమే యాశించి చావుబ్రతుకులమధ్య సంచరించుచుండెను. ఆతఁడు సురక్షితుఁడుగాఁ గాపాడఁబడునను నాశకూడ రవివర్మకుఁ బోయినది. విక్రమసేనుఁ డతి నిహితమును వినుట లేదు. నీచులైనశత్రువులు కంటఁబడగా, నెందరున్నను మదగజయూథముపైఁ బాఱుసింహమువలె నెదుర్కొనుచుండెను. ఒక్కఁడను జయింపఁగలనా యని యోచించుటలేదు. చస్తునేమో యని జంకుటలేదు. అతనియావేశ మేమో తెలియదు కాని విక్రమసేనుఁ డరచేతఁ బ్రాణములు పట్టుకొని తిరుగుచుండెను. ఎచ్చట తమ

రహస్యము జారవిడుచునో యని రవివర్మాదులు భయపడిరి కాని, వారేమియుఁ జేయులేక విధి యెట్లైనఁ గావింపనిమ్మని విక్రమసేనుఁడాడినట్లు తామాడుచు, నతఁడు పాడినట్లు తాము పాడుచు నన్నిట నతని ననుసరించుచుండిరి.

అర్ధరాత్రివేళకు విక్రమసేనాదులు దుర్గమునకు ముట్టడివైచిరి. త్రోవలో శత్రులెవ్వరును వారి నాటంకపఱుపలేదు. విక్రమసేనుఁ డింకను మృత్యుశయ్యపై నుండెననియే పగవారు విశ్వసించి యుండిరి.

అగడ్తవంతెన తీయఁబడి యుండెను. అది దాటుటే యొకించుక కష్టమని వారు తలంచిరి కాని శత్రులెవరైన నడ్డగింతురను భయము దీరిపోయినది.

అంతయు నిశ్శబ్దముగా నుండెను. రాత్రి గాఢాంధకారము. కాని, దుర్గమందు వినవచ్చుచుండినమూల్గుడుశబ్దము, దుర్గమందచ్చటచ్చట మిణుకుమిణుకుమను దీపములును రాత్రియొక్క నిశ్శబ్దమునకు నంధకారమునకు నించుక భంగము కలిగించుచుండినను మొత్తమునకు రాత్రియొక్క ఘోరముమాత్రము తగ్గకుండెను.

రవివర్మ దగ్గరనే యుండినవృక్షమున నొకత్రాడు కట్టెను. వలదని యెందఱు వారించినను విక్రమసేనుఁడు ఖడ్గమును నోటఁగఱచుకొని త్రాటిసాయమునఁ గందకములో దిగి మెల్లఁగా నీఁదుకొని దుర్గమునుండి మూల్గుడు వినవచ్చుచుండినదిక్కుగాఁ బోవుచుండెను. దుర్గమున రాజేమూల నుండెనో మోహనుఁడు వీరి కెఱిఁగించి యుండెను.

విక్రమసేనునకు నేల యందుచునే యుండెను. అతఁడు మెల్లగా కోటగోడవంకకు నడచిపోవుచుండెను. ఎదుట నొకచిన్నపడవ యుండెను. దానినిఁ జూచి యతఁడు తటాలున నాఁగిపోయెను. ఆపడవలో నెవ్వరో పరుండి నిద్రించుచున్నట్లు పిల్లికూతవలె వినవచ్చుచున్నగుఱ్ఱునుబట్టి

యూతఁడు గ్రహించెను. వాఁడొకరక్షకభటుఁడని తలఁచి తనకు వాని వలన నేమైననపాయము సంభవించు నని కత్తితోఁ జంపఁబోయెను. కాని నిద్రించువానిని జంపుట పాడియా యని యతఁ డొక్కింతతడవు యోచించి వానిజుట్టు పట్టి లాగి లేపెను. వాఁడదరిపడి లేచి తనయొర నుండి ఖడ్గము నూడదీసెను కాని యంతలోనే విక్రమసేనుఁ డాతనిపైఁ బడి వాఁడఱవకుండఁ గంఠమును గట్టిగా నొక్కిపట్టుకొనియెను. బల మైన విక్రమసేనునిపట్టునకు వాఁడు తత్క్షణమే యూపిరాడక మరణించెను.

వాని నచటనే పడవైచి విక్రమసేనుఁడు ముందునకుఁ బోయెను.

అచట నెవరో మాటలాడుకొనుచున్నట్లు విక్రమసేనునకు విన వచ్చెను.

"నాకిట్టిదీర్ఘమరణము నేల కలిగించెదరు? ఒక్కసారిగాఁ జంపి వేయరాదా?"

"నీతమ్మున కది యిష్టము లేదు."

"అట్లైన యమదూతవలె నిచ్చట నుండుటెందుకు? వెడలి పొమ్ము."

"స్వర్గమునుగూర్చి కలఁగనుచున్నావా?"

అనుచు నావ్యక్తి వెడలిపోవుచున్నట్లు తోఁచెను. ఆపోవువాఁ డెవ్వఁడో విక్రమసేనునకుఁ దెలిసిపోయెను. రాజట్లు కుటిలవర్మయంత టినీచునితో నిట్లవమానితుఁడగుటకాతఁడు కోపించెను. కాని యాతఁ డాకోపము నడంచుకొని దుర్గమందందఱు నింకను మేల్కొనియుండుటచే నిది ముట్టడికిఁ దగినసమయము కాదనియు, రాజును రహస్యముగా విడి పించుటకు వీలు లేదనియు నింకొకసారి సమయముచూచుకొని వచ్చుటే మేలనియుఁ దలఁపోసి యెప్పటివలె వచ్చినదారినే యీదుకొని పోలేక, పడవపైఁ గూర్చుండి యెంతమాత్రమును జప్పుడుగాకుండ మెల్లగాఁ

దీప్తు వైచుకొనుచు నవతలికిఁ బోయి, తనకై యెదురుచూచుచుండిన రవివర్మాదులకు సైగచేసి, వారందించిన త్రాటిసహాయమునఁ బైకెక్కిపోయి వారిని గలిసికొనియెను.

ఇంతలోఁ గందకముపై వంతెన వేయఁబడిన ట్లయ్యెను. ఆ వెంటనే యశ్వపదధ్వనులుకూడ వినవచ్చెను. చూచుచుండఁగనే మువ్వురు యోధులు రవివర్మాదులపైఁ బడిరి. అందు విక్రమసేనుఁ డొకనితోఁ దలపడెను. ఆయాశ్వికుఁడు గర్జించుచు ,, వీరవర్మపరాక్రమము నెఱుఁగనివాఁడును, అతనితోఁ దలపడి పోరఁదలఁచువాఁ డెవఁడురా ?" యనెను.

,, స్నేహభావమును నటించి దొంగతనముగా రాజును బొడిచిన పరాక్రమవంతుఁడవా ? మన యిరువురిని భగవంతుఁడే యిప్పుడు కూర్చినాఁడు. ''

వీరవర్మ విక్రమసేనునికంఠమును గుర్తించి ,, ఓహో ! దొంగరాజువా ? దొంగను వంచించినఁ బాపములేదు !'' అనుచు వెట్టించినకోపముతో ఖడ్గమును విసరి విక్రమసేనునిఖడ్గమును విరుగఁగొట్టెను.

ఇంకను ప్రక్కలోని గాయము సరిగా మాననందున నుత్సాహమున్నను శక్తిలేనివిక్రమసేనుఁడు మహాబలవంతుఁడును, ఖడ్గవిద్యానిపుణుఁడును నగువీరవర్మయెదుట నిలువలేక రాజుకొఱకైనఁ దనప్రాణములను గాపాడుకొనవలయు నని యాయంధకారములోఁ నాతని దప్పించుకొని యదృశ్యుఁడయ్యెను.

ఇంతలో రవివర్మాదులు వీరవర్మయనుచరులను దమనిశితఖడ్గములకు బలిచేసి విజయోత్సాహముతో వీరవర్మ నాక్రమించుటచే నసహాయుఁ డగునాతఁ డిఁకఁ జేయునది లేక కందకములో దుమికి కోటగోడదగ్గఱఁ దేలెను.

“ ఈవీరుఁ డన్నివిద్యలలో నసాధ్యుఁడు. ఇట్టివానిని విడిచిపెట్టుకొంటిమి. నిద్రించువానిని లేపి చంపు పిఱికికార్యముతప్ప నేనేపౌరుషకార్యమును జేయలేను. ” అని విక్రమసేనుఁడు తనవారిని గలిసికొని మిక్కిలి సిగ్గుపడుచుఁ బలికెను. రవివర్మ యాతనికి ధైర్యము చెప్పి బుజ్జగించెను. తమరహస్యము కోటలోనివారికి వెల్లడియగుటచేఁ దాము రాజును విడిపించుటకు మఱలఁ దిరిగి వచ్చులోపల రాజు చంపఁబడునేమో యని రవివర్మధర్మవర్మ విక్రమసేనులు దిగులుపడి దైవమును బ్రార్థించిరి. రాజు నెట్లైన విడిపింపవలెననుపట్టుదలతో వారు ప్రాణపణముగఁ బ్రయత్నించుచుండిరి.

మధ్యాహ్నము విక్రమసేనుఁడును రవివర్మయుఁ గొంతపరివారముతోఁ జల్లనియడవియందుఁ దిరుగుచుండిరి. ఎదుటఁ గొంతదూరముగా వచ్చుచుండినమనుష్యులగుంపును జూచి రవివర్మ తనవారిని హెచ్చరించెను. ఇంచుక సమీపించుకొలఁది వచ్చుచుండినవా రొకమృతదేహమును వైభవముతోఁ గొని వచ్చుచుండిరని రవివర్మాదులు తెలిసికొనిరి. ఓహో! రెండుమృతదేహములు! అవి వీరులదేహము లగుటచేఁ గాబోలు ఖడ్గధారులచే మోయఁబడి వీరోచితముగాఁ గొనిరాఁబడుచుండెను.

ఏమి విక్రమసేనునియాశ్చర్యము! ఆజనులగుంపున కంతకు నధినాయకుఁడై ముందుగా దారితీయుచు నశ్వారూఢుఁడై ప్రబలవైరి యగువీరవర్మయే వచ్చుచుండెను. విక్రమసేనుఁ డొకించుక సంతోషముతో నిప్పుడైనఁ బగ తీర్చుకొనవలె నని తలంచెను.

వీరవర్మ సామాన్యుఁడు కాఁడు. అతఁడు నక్కయొక్కటక్కరితనమును సైతము కలిగిన పొగరెక్కిన పెద్దపులివంటివాఁడు.

సమీపించుటతోడనే వీరవర్మ రాజునకు వంగి వినయముగా

జోహారొనరించెను. మరుక్షణముననే యతనిముఖమున వికటహాసము తోఁచి విక్రమసేనుని హాస్యముచేయుచుండెను. విక్రమసేనుఁడు బ్రిత్య పహాసముతో,

,, నిన్న మీకోటదగ్గఱ గొప్పకలహ మైనదని వింటిని. అందు మరణించినవారేనా వీరు ?'' అనెను.

,, వీరెవరో మహారాజుగారెఱుఁగఁగోరెదరా ? వీరు నాకును సూర్యసేనునకును ప్రాణమిత్రులై మాకొఱకుఁ బ్రాణములు విడిచిన ఘోరవర్మకుటిలవర్మలు. ''

,, మీప్రాణస్నేహితులు మరణించినందుకు చాల విచారపడు చున్నాను. ''

,, మహారాజుగారిదయకు మిక్కిలి సంతోషము. నామిత్రుల మృతికిఁ జింతించుచున్నారు. అపును. ఇతరులుకూడ వీరివలెనే భూమి పాలుకావలెను. ''

,, అవును. చాల వేదాంతముగా మాటాడినావు. 'ఎన్నాళ్లు బ్రతికినను కాటికే' యని జ్ఞాపక ముంచుకొనవలెను. ''

" రాజులుకూడనంతే!—'' అని వీరవర్మ యొకించుక కఠోరస్వ రముతోఁ బలికెను. రవివర్మ కోపకంపితహస్తము ఖడ్గముపై నాడు చుండెను.

,, మాతమ్ముఁడైన సూర్యసేనునిజబ్బు కుదిరినదా ?" యని విక్రమసేనుఁడు వెక్కిరించెను.

ఇట్టివెక్కిరింపులలోసైతము విక్రమసేనుని మించినవాఁడగువీ రవర్మ ,, ఆహా ! కుదిరినది. అతఁడొకించుక కులాసాగానున్నాఁడు. పూర్తిగా స్వస్థత కలిగినంతనే రాజధానికిఁ బోవఁదలఁచుచున్నాఁడు. '' అనెను.

,, మొత్తమునకు బాగున్నాఁడనే యనుము ''

,, ఆహా! ఒకటిరెండు చిన్నకష్టములుమాత్రమున్నవి.'' అని వీరవర్మ జగతిలోలేని ధూర్తవిస్మయముతోఁ బలికెను.

అతఁడు రాజునకు నమస్కరించి పరివారమును బొమ్మని సైగ చేసి వారివెంటఁ బోవుచుండెను. మాటలసందడిలోఁ బగమాట మఱచిపోయిన విక్రమసేనుఁడు పొంగెశిరక్తవిజృంభణముతో, నొడ్డును దాఁకుతరంగమువలె నొక్కపరుగున వీరవర్మవెన్నంటి తాఁకెను.

,, నిన్న నీవు మహావీరునివలెఁ బోరితివి'' అనుచుండ వీరవర్మ "నేనెప్పుడును వీరునివలెనే పోరుదును '' అని నిన్నటివిక్రమసేనునిపిఱికి తనము నెత్తిపొడుచుచుఁ బలికెను.

,, రమ్ము. రమ్ము. మన మొండొరులకుఁ దగినప్రతిద్వంద్వుల ము. అధర్మపథమునఁ బడి చెడిపోక రాజును మాకిచ్చివేయుము. మన ము మిత్రులుగా నుండవచ్చును.''

వీరవర్మ యించుక సమీపించి ,, ధర్మముఁ బట్టుకొన్న ప్రపంచ ములో మనము బాగుగా నిశ్చింతులమై బ్రతుకలేము. ధర్మ మని మొ ఱ్ఱలుకొనుచున్న నీవును రాజును నెట్లు బాధింపఁబడుచున్నారో యెఱుఁగ వా? నీవును, రాజును కాటిలో నొకకాలు, గూటిలో నొకకాలు కల వ లయెదుటిగువ్వలరీతి బుద్బుదప్రాణులరై యున్నారు. కావున మనము మైత్రిగా నుండుట కొకయుపాయము చెప్పెదను వినుము. రాజుకంటె ముందుగా రవివర్మధర్మవర్మలు మరణింపవలెను—'' అనుచుండ నాశ్చ ర్యముతో ,, ఏమీ ?'' అని విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

" పరమనీచుఁడైన సూర్యసేనునిగూడ విడువరాదు. బందీయైన రాజునకుఁగూడ నదేగతి పట్టింతము. ఇరువురుమాత్రమే మిగిలెదరు. కాశ్మీరరాజ్యమై నీవును, ఛేకేశ్వరాధిపతినై నేనును—. భూధవము నా

యోచన యెంతచక్కగా నున్నదో. ఒకసామ్రాజ్యమునకై మునుపటి వాటిసుందరి నీహస్తగతము కాఁగలదు! ధర్మమని యెల్లప్పుడు నీవు భూలోకస్వర్గములనుండి తొలఁగవలసినచ్చును."

ఈవిచిత్రమైనట్టియు, ఘోరమైనట్టియు కుట్రకు విక్రమసేనుని తల తిరిగిపోయెను. తనమనసును ధర్మమునందే దృఢపఱచుకొన్న విక్రమసేనుఁ డట్టహాస మొనర్చి "నీవు చనిపోయినపిమ్మట తప్పక నరకలోక నాయకుఁడ వగుదు వని తలంతును." అనెను.

"సరే. బాగుగా యోచించుకొమ్ము."

"నీవు నీమిత్రుఁ డగుసూర్యసేనునకును ద్రోహము సేయుదువా?" అని యతనికుటిలత్వముయొక్క యగాధత్వమును గనుఁగొన విక్రమసేనుఁడు ప్రశ్నించెను.

"అతఁడు నన్నిప్పు డసహ్యించుకొనుటకుఁ గారణముకలదు. అందుచే నాకతఁడుగూడ మార్గకంటకమే—"

"మిత్రులవైరమునకు ధనమో స్త్రీయో కారణమై యుండవలెను. ఈరెంటిలో నేది?" అని యాక్షేపించుచు విక్రమసేనుఁడు పలికెను.

"ధనముకంటె నందమైన రమణీవదన మొక్కటే మిత్రభేదము కల్గించు నని యెఱుఁగవా? ఆసుందరిని నీవును చూచియేయున్నావు—చక్రసేన."

"ఓ! ఆమె సూర్యసేనునే వలచినది కదా?"

"అవును. ఆసుకుమారి నావంటియువకుని నూనూగుమీసాల యందము నైనఁ దలంపలేదు. దాని నెట్లైన సాధింపవలయునన్నదే నా ప్రయత్నము. నీవును నాసహాయ్యతంత్రములోఁ గలసెదవా? బాగుగ యోచించుకొనుము." అనుచు నీలవర్మ కన్నుల నదలించెను.

విక్రమసేనుఁ డింతటివింతపురుషునిగూర్చి యోచించుచు, నరకమునకుఁ గోష్ఠకులు కల్గియుండిన, వారైన నింతటినీచులై యుండ రని తలంచుచుఁ, దనచేత కాశ్చర్యపడుచుఁ, దనకెదురు చెప్పలేక వీరవర్మ మూలమునఁ దన కెట్టియాపదకలుగునో యని భీతినందుచు నిలిచియుండిన రవివర్మాదులను గలిసికొనెను.

దుర్మార్గులఁ బెక్కురను విక్రమసేనుఁడు చూచి యుండెను గాని యింతటివింతదుర్మార్గునిఁ జూడలేదు.



# పదునాఱవ ప్రకరణము



"O fear not in a world like this,
And thou shalt know ere long,
Know how sublime a thing it is
To suffer and be strong."

(Longfellow.)

రాజు రాజధానికి రాక చాలదినము లాలసించుచుండె నని ప్రజలలో గుసగుసలు పుట్టెను. వివాహమును దప్పించుకొనుట కేదో కారణ మని మంత్రివర్గమునందు ముప్వురు తిరుగఁబడి తిన్నగా రాజుకడ కేతెంచి వివాహవిషయమున నీయుద్దేశ మేమో స్పష్టముగాఁ జెప్పు మని నిర్బంధింపసాగిరి. సూర్యసేనునియనుచరులచే రాజు తమరాణిని నిరాకరించుచుండె నని బోధింపఁబడినప్రజలు సూర్యసేనునిపక్షమును జేరి చాల నాందోళన పెట్టుచుండిరి. సేనాధిపతి సాగరవర్మ యతికష్టముతో శాంతిని నెలకొల్పుచు రాజునకు జరుగువిశేషములను గుఱించి యెప్పటికప్పుడు వార్తావహులను బంపుచుండెను.

ఈసంక్షోభము నెట్లైనఁ దగ్గించి ప్రజలను రాజుపక్షమువారిగాఁ జేయుటకు విక్రమసేనుఁడు నాఁటికిఁ బదునైదవనాఁడు తనవివాహదిన మని తన్ను బాధించుచుండిన మంత్రులతోఁ జెప్పి పురమందుఁ జాటించుఁ డని పంపెను. పదునైదుదినములలో నతఁడు రాజును విడిపింప వలెను.

సాయంకాలము మోహనుఁడు వచ్చి దుర్గరహస్యముల నీవిధముగా విక్రమసేనున కెఱిఁగించెను.

"బ్రహ్మచారి యొకఁడు మీరు వివాహముహూర్తమును జాటించినసంగతిని సూర్యసేనునితోఁ జెప్పునప్పుడు నేనచ్చటనే యుంటిని. ఆవార్త కతనిముఖము కందినట్లు నల్లఁబడిపోయెను. మీరు మదనకళను ప్రేమించి యున్నా రనియుఁ, దప్పక మీరు రాజై యంతవఱకు నెల్లరను మోసగించి చాటించినట్లే యామెను జేపట్టక పోరనియు, వీరవర్మ సూర్యసేనునకుఁ గోపము వచ్చునట్లు నొక్కి వక్కాణించుటయే కాక, చక్రసేనదిక్కు మొగమై "నీప్రతిద్వంద్వి నీమార్గమునుండి తొలఁగుచున్నది లెమ్మ" అనికూడఁ జెప్పెను. ఆమాటకు సూర్యసేనునిచేయి ఖడ్గముపైఁ బాఱెను; గాని వీరవర్మ లక్ష్యపెట్టలేదు. వీరవర్మ సూర్యసేనున కింకను గోపము గలిగించుతలఁపుతో "నీవు నిష్కారణముగా నమాయకుఁడై సర్వమును నీయధికారమందే విడిచిన యన్నచే బంధించి, దానికిఫలముగా నంతకంటెను జతురుఁడును, నసాధ్యుఁడును, మాయావియు నగువిక్రమసేనుఁడు రాజై నిన్నుఁ బలుతెఱఁగుల బాధించుచుండఁ జేయునదిలేక యూరక సమయము రాలే దని మిన్నకుంటివా? నీకు దూరదృష్టిలేదా? పౌరుషము లేదా? బలము లేదా?" అని సూర్యసేను నాతఁడు నిందింపఁదొడఁగెను.

ఊరక కూయక నోరుమూయు" మని సూర్యసేనుఁడు కోపముతో గద్దించెను. వీరవర్మ జంకు గొంకు లేక సూర్యసేనునిప్రక్కనుండిన చక్రసేనహస్తమును బలవంతముగఁ బట్టుకొని యొక్కముద్దుపెట్టుకొని వెడలిపోయెను. సూర్యసేనుఁడు మండిపడి ఖడ్గమును జళిపించుచు నతినిపై నురుకఁబోయెను గాని చక్రసేన వీరవర్మచేఁతకుఁ గుపితయయ్యు నిది సమయము కాదని తనప్రియుని వారించెను."

మోహనుఁడు చెప్పిన విశేషములలో నిది యంత ముఖ్యమైనది కాదు. ఇంతకంటె ముఖ్యమైనది రాజవిషయము. రాజు నిరాశతో

సొనాఁటికిఁ గుర్రింగిపోవుచుండె ననియు, నతఁడు కొనప్రాణములతో నుండుటను దానే స్వయముగాఁ జూచితిననియు మోహనుఁడు తెలియఁ జేసెను. రాజు మరణించు నేమో యని భయపడి మూర్యసేనుఁడు రాజధానినుండి భిషగ్వరు నొక్కనిఁ బిలిపించి రాజుచికిత్సకై నియోగించెను; కాని యావైద్యుఁడు రాజును గాంచినవెంటనే సూర్యసేనుని మోసమును గనుఁగొని వడఁకి, నేనిందేమియు జోక్యము చేసికొన నని చెప్పి నన్నుఁ బోనిం డని ప్రార్థించెను. ఆతనిమూలమున రహస్యభంగ మగునని శంకించి వైచెను. రాజునకుఁ గేవలమునిరాశచే మనోరోగము జనించినది. అంతేకాని యతనికి శరీరరోగ మేదియులేదనికూడ మోహనుఁడు చెప్పెను.

దుర్గమును మఱల ముట్టడించుటకుఁ గావలసినసంగతుల నన్నిటిని విక్రమసేనుఁడు మోహను నడిగి తెలిసికొని,

"ఓయీ! నీవానీచులయింట నీదినమునమాత్రమే యుండవలసియున్నది. రేపటినుండి నీవు మాయొద్దనే యుందువుగాక! ఇదిగో! ఈధనము తీసికొమ్ము. నీ వీనాఁడు గొప్పపని చేయవలసి యున్నది. సరిగ నర్ధరాత్రివేళ నీవు కోటతలుపులు రహస్యముగాఁ దెఱచి యుంచవలయును. మఱేమియుఁ బ్రశ్నింపక పొమ్ము" అని వానిని బంపివైచెను.

పిమ్మట విక్రమసేనుఁడు తాను కావించినపనిని రవివర్మధర్మవర్మల కెఱిఁగించెను.

రవివర్మ తలయూచి "తొందరపని చేసితివి. ఇంచుక నిదానింపలేకపోయితివా?" యనెను.

"నిదానించిన రాజు మరణించును. వారు చంపకపోయినను

రాజు త్వరలోఁ జచ్చును. అతఁడు నిరాశతో మనోరోగపీడితుఁడై మర
ణశయ్యపై నున్నాఁడని మోహనుఁ డెఱిఁగించెను.''

,, అతఁడు బ్రతుకును. భయము లేదు.''

,, మంచిదే కదా! పదునైదుదినములలో పెండ్లి నిలిచినది.''

ధర్మశర్మ విక్రమసేనునిభుజముపైఁ జేయివైచి ,, మనము త్వర
పడుటే మంచిది. పని ముందే ముగించుకొన్నచో మన కంతవిచార
ముండదు. పిమ్మట నెట్లైన నట్లు గానిమ్ము.'' అనెను.

"ఔను మనమందఱము నేఁడే ముట్టడింపవలెను.'' అని విక్రి
మసేనుఁ డనెను.

,, నీవుకూడ వత్తువా?'' అని ధర్మశర్మ యడిగెను.

,, ఔను.''

"వలదు. వలదు. మేమెట్లో యొకట్లు సూర్యసేనుని సాధించె
దము. నీవు వచ్చి పట్టువడుట సంభవించిన రాజుతోఁగూడ మరణిం
తువు. నీవిచ్చటనుండినచో రాజు మరణించినను నీవైన దక్కుదువు.
రాజ్యము దుష్టులపాలఁ బడక దక్కును.''

,, దుష్టులపా లేల యగును? మదనకళ రాజ్యమును బాలిం
చును. ఆమెను బ్రజలు తల్లివలెఁ బ్రేమించుచున్నారు కదా? నేను
మాత్రి మిచ్చట సోమరినై యుండుట కొప్పుకొనను. నేనిన్నిదినము
లొకనికొఱకై ఛద్మవేషముతోఁ బ్రపంచమును మోసగించితిని. ఇంత
వఱకు చాలదా? ఇఁక నాకొఱకై, రాజు చనిపోయినపక్షమున, మఱల
ఛద్మవేషము వేసికొని నీచరాజ్యముకొఱకై ప్రపంచమును మోసగిం
చుచు నుండఁజాలను. పవిత్రచరిత్రయగు మదనకళను వంచింపఁజాలను.
రాజు చనిపోయి నేనే బ్రతుకవలసివచ్చిన యథార్థముఁ జెప్పి తీరుదును.
కానున్నది కాని''మ్మని విక్రమసేనుఁడు గంభీరముగాఁ బలికెను.

రవివర్మ యతనిధీరవాక్యములకు, ధర్మపరాయణతకు సంతసించి కౌఁగిలించుకొని ,, సరే, నీవును రమ్ము. '' అనెను.

ఈసారి మోహనునిసహాయమునఁ దమకు విజయము తప్పక కలుగునని వారు నమ్మి యుండిరి. ఎట్లు ముట్టడింపవలయునో, యెవ రెవ రేయేపని చేయుచు నెవ్వ రెచ్చట నుండవలెనో ముందుగా వారు నిర్ణయించుకొనిరి.

రవివర్మాదు లింకను ముట్టడిని గుఱించి తలఁపెట్టలేదని కోట వారిని మోసగించుటకై తామేదో వినోదమందున్నవారివలె రాత్రి జాము న్నరవఱకు నాటలతోఁ బాటలతో గందరగోళముగాఁ గాలము పుచ్చిరి.

రాజు రేపటిసాయంకాలము లోపల రాజధానికి తిరిగి వచ్చు ననియు, నట్లు రాకుండిన సేనాధిపతి వెంటనే దుర్గమును ముట్టడించి రాజును జూపవలె నని సూర్యసేనుని నిర్బంధింపవలె ననియు, సూర్య సేనుఁ డగపడకుండినను, రాజున కేదో యపాయము కలిగిన దని తోఁచి నను, తత్క్షణమే రాజధానికిఁ బోయి మదనకళను రాణిగాఁ జాటి, సూ ర్యసేనునికుట్రలను లోకమునకు వెల్లడించి, పెద్దసేనతో సూర్యసేనుని వెన్నంటి వేఁటాడవలె ననియు విక్రమసేనుఁడు నాగరవర్మకు సందేశ మంపెను.

విక్రమసేనుఁడు గాఢముగా యోచించియే యీసందేశమంపిం చెను. సూర్యసేనునకుఁ గాని, రాజునకుఁ గాని, తనకుఁ గాని యొకదిన ముకంటె నెక్కుడుగా బ్రతుకునాశ లేదని విక్రమసేనుఁడు జంకుచుం డెను. తనకార్యసాఫల్య మెట్లైనఁ గాని మ్మనియు, రాజ్యముమాత్ర ము రాణికైనఁ దక్కునుగదా యనియు నతనిసంతోషము. రాజు చచ్చి

నను సరే బ్రతికినను సరే—ఇఁకఁ దనవిషయమో? అతఁడు తనవిషయమై యోచింపలేదు.

నిశ్చింతుఁడై మానవప్రపంచమునుండి తొలఁగి బ్రతుకఁదలఁచువిక్రమసేనున కీప్రపంచకోలాహలములు సరిపోలేదు. ఐనను ధానారంభించిన ధర్మకార్యము ముగియువఱకుఁ గదలరా దని యతఁ డుత్సాహముతో నిరీక్షించుచుండెను. ఆధర్మకార్యమందు మరణించిన మఱియు మంచిదే యని యతఁడు తలంచెను.

నిర్ణీతసమయమునకు రవివర్మాదులతో విక్రమసేనుఁడు వివిధాయుధములతో నుచితపరికరములతోఁ గోటవైపునకుఁ బోవుచుండెను.

రవివర్మాదులు కోటయెదుట మోహనుఁడు తెలుపుతీయువరకు నగడ్త కివతలనే దాగి యుండి పిమ్మట మెల్లగా నగడ్త నీఁదియో, వంతెనయుండిన, దానిపైగాఁ బోయియో గోటను బ్రవేశించి కోటవారి కందఱికిఁ బని కల్పింపవలెను. విక్రమసేనుఁ డొంటిగా రహస్యముగాఁ గోటవెనుకప్రక్క నీఁదుకొని పోయి, రాజుబంధింపఁబడినగది కెగఁబ్రాకి, రాజును జంపివేయక ముందే విడిపించి క్షేమమైనస్థలములో నెచటనైన శత్రులకంటఁ బడకుండ రక్షించుచుండవలెను. విక్రమసేనుఁడు త్వరగా రాకుండిన నతఁడు మరణించె నని తలఁపవలెను. విక్రమసేనుఁడు చచ్చిన మఱుక్షణమే రాజును మరణించును; గావున రవివర్మాదులలోఁ గొందఱు వెన్వెంటనే రాజధానికిఁ బోయి కొంతసేనను బిలుచుకొని వచ్చి దురాత్ముల నందఱిని శత్రుశేషము లేకుండఁ బట్టుకొనియైన, వధించియైన మదనకళను రాణిగాఁ జేయవలెను—ఇదియే వారి యేర్పాటు.

విక్రమసేనుఁడు చేసిన యీయేర్పాటునకు రవివర్మ సంతసించెను. తనపని నారంభించుటకు విక్రమసేనుఁడు ముందుముందుగాఁ బోయెను.

కందకముపై వంతెన యింకను దీయఁబడియుండలేదు. ఇంతకు ముందువలెనే విక్రమసేనుఁడు రాజుండినగదివంకకు నీదుకొని పోయెను. కోటవారందఱు రవివర్మాదులచేత నాకర్షింపఁబడినప్పుడే తాను రాజుక డకుఁ బోవలె నని యతఁ డచటఁ దగినసమయమునకై నిరీక్షించుచు గోడ కంటుకొని గోడనీడలో నొదిగి యుండెను.

చంద్రుఁడు లేకపోయినను నొకవిధమైన తెల్లనికాంతి రాత్రియంధ కారము నించుక తొలఁగించుచుండెను.

ఉన్నట్టుండి మేడపైఁ గిటికీతలుపులు తెఱవఁబడెను. ఆకిటికీచెంత నొకమనోహరాంగి యగుయువతి నిలిచి యుండెను. ఆమెప్రక్కనే నిలిచి యొకపురుషుఁడు దీనముగాఁ బ్రార్థించుచు నామెను గౌఁగిలింపఁబోవు చుండెను. కాని యామె తిరస్కరించుచుఁ దొలఁగిపోవుచుండెను. ఆపు రుషుఁడు వీరవర్మ యనియు, నాస్త్రీ చక్రసేన యనియు నచట నెలుఁ గుచుండిన దీపపుసహాయమున విక్రమసేనుఁడు గుర్తించెను. అప్పుడే పైకెక్కి యాదురాత్ముని డీకొనవలయు నని యతఁడు తలఁచెను గాని తొందరపడఁగూడ దని యోపికతో నాతఁడు వారిసంభాషణను వినుచు నచటనే నిలిచిపోయెను.

చక్రసేన—"మానవతు లగుస్త్రీలు దుర్జనులమధ్యమున బ్రతు కలేరు. స్త్రీజన్మ మతిహేయమైనది. ఈకందములోఁ బడి ప్రాణ ములు విడువవలె నని కోరిక పుట్టుచున్నది."

వీరవర్మ—(నవ్వుచు) "కందక మీావేసంగిలోఁ జల్లగా హాయిగా నుండును. అందు దిగుపు మనెదవా?" అని పలుకఁ జక్రసేన యేమి యుఁ బలుకకుండెను.

వీరవర్మ కిటికీతలుపులను గ్రుద్దుచు మఱల నిట్లు పలుకుచుండెను. "సూర్యసేనునిపై నేమని మక్కువఁ జూపెదవు? మహారాణి యౌ

తిరుగఁ జాలదనియా ? నాకంటె యౌవనుఁ డనియా ? అందగాఁ డనియా? మఱియే సందముఁ జూచి నీవు సూర్యసేనుని వలచుచుంటివి ?''

"నీమాటల నన్నిటిని నాతనికిఁ జెప్పిన——"

"సరే. చెప్పుకొమ్ము. నేను వెఱచువాఁడను గాను. అతఁడు నీపైఁ బ్రేమ లేక మదనకళను వలచుచుండుటచే నీమాట లాతనిచెవికి రుచిగా నుండవు. అందుకే యతఁడు రాజైనసోదరుని, నటించుచుండిన రాజును జంప దివారాత్రములు యోచించుచున్నాఁడు. ఆనటనా రాజును జంపిన నతఁడు నా కేమిచ్చెద నన్నాఁడో యెఱుఁగుదువా ?'' అని వీరవర్మ యలక్ష్యభావముతో ననెను.

పాపమాయబల భగవంతునిఁ బ్రార్థించుచుఁ జేతులొకసము వంక కెత్తి యేమియుమాటలేక చిత్రప్రతిమవలె నైపోయెను.

ఇంతలోఁ దలుపులు తెఱవఁబడినశబ్దము వచ్చెను. సూర్యసేనుఁ డాగదినిఁ బ్రవేశించుచుండుటను విక్రమసేనుఁడు చూచి, యిప్పు డేమైన నాప్రతిద్వంద్వులకు గందరగోళము తప్పక పుట్టు నని భావించెను.

సూర్యసేనుఁడు వీరవర్మ యచట నుండుటకుఁ జకితుఁడై యాతని చేయి పట్టుకొని, "రాజునకు ఎఱతగాఁడవు కాఁదలఁచుచుంటివా ?" యనెను.

"ఓహో ! సూర్యసేనా ! నీవు నన్ను బెదరించుచుంటివా?"

"నా బెదరింపే శత్రువులను జంపఁజేయునని యెఱుఁగవా ?''

"బెదరింపఁబడియు దొంగరా జింకను బ్రతికియే యున్నాఁడని యెఱుఁగుదును.''

ఆసంభాషణ విని వారిలో వారి కిట్లు కలహములు సంభవించుట తమధర్మదిగ్విజయమును సూచించుచుండె నని విక్రమసేనుఁడు తలఁచుచుండెను.

సూర్యసేనుఁడు శాంతముఁ దెచ్చుకొనుచు, "చాలుచాలు! మనలో మనము కలహింపరాదు. ఈసమయమున నది తప్పక మూఁడవవానికి లాభ మగును. ఇట్టికుటిలబుద్ధిని విడిచి జాగ్రత్తగనుండుము!— పొమ్ము పొమ్ము! మఱేమియు మాటాడకుము. నీయిప్పటితప్పు లేమియున్నను క్షమించెదను. ద్రోహమును దలంపఁబోకుము. వెళ్ళుము. నీకు సుఖనిద్ర పట్టుఁగాక! రాత్రి మీఱిపోవుచున్నది పొమ్ము." అనెను.

వీరవర్మ మెల్లగా వెళ్ళిపోయెను. పోవునప్పు డతనివంచినతలయు, గడ్డముక్రిందిచేయియు నతఁ డేదో దీర్ఘముగా యోచించుచుండె నని చెప్పుచుండెను. అదేదో కుటిలాలోచనయే యని విక్రమసేనుఁ డూహించెను.

సూర్యసేనుఁడు రెండునిమిషములుమాత్రమే చక్రసేనతో మాటలాడి కిటికీతలుపులు వైచి, వాకిటితలుపులు బంధించుకొని పోయెను.

వీరవర్మ యట్లే యాలోచనాపరుఁడై వంతెనమీఁదుగా నడుచుచుండెను. అతఁ డేదో తలఁచుకొని వెనుకకు మఱలెను. మరల నీవలికి వచ్చెను. మరల నేదో తలఁచుకొని పండ్లు పటపటఁ గొఱికెను. ఖడ్గము నొరనుండి యూడఁదీసెను.

అనుకొన్నట్లే వీరవర్మ యేదో ఘోరమైనకార్యముఁ జేయఁబోవుచున్నాఁ డని విక్రమసేనుఁడు తలఁచెను. అప్పటివీరవర్మ మనోహరాకృతి పిశాచస్వరూపమువలె విక్రమసేనునకు భీతిఁ గొల్పెను. ఈప్రపంచకోలాహల మాతని కసహ్యముఁ గొల్పెను. విసుఁగుఁ గలిగించెను. విరక్తి మితిమీఱెను. ఈనీచప్రపంచముతో నొకనిముసమైన సంబంధము గలిగించుకొనక రవివర్మాదుల కెఱిఁగింపకుండఁగనే తనదారిని బోవవలె నని యతఁడు తలఁచియుఁ, దనమహాకార్యమును దలంచుకొని

యోపికతో జరుగుచుండినదానిని వీక్షించుచు, మహాకుటిలుఁడును, దన్నొకసారి గాయపఱచి యొకసారి యోడించిన వాఁడునునగు వీరవర్మపై దూకి పగదీర్చుకొనవలెనని కుతూహలపడుచున్నను తనమనసునందలియావేశమును దగ్గించుకొనుచుఁ దగినసమయమునకై నిరీక్షించుచుండెను. ఆవీరవర్మతన్నుఁ జంపునేమో యని జంకికాదు. తాను జచ్చిన సర్వకార్యనాశనమగుననియే—రాజుకొఱకై యాతఁడు తనప్రతిద్వంద్వినీచత్వమును జూచుచుండియు సహించియుండెను !



## పదునేడవ ప్రకరణము



"O, What may man within him hide,
Though angel on the outward side!"

(Shakespeare.)

వీరవర్మ కుటిలహాసముతో మఱల దుర్గములోనికిఁ బోయెను. బీగము తెఱచినచప్పుడయ్యెను. మోహనుఁడే తాను చెప్పినట్లు చేయుచుండె నని విక్రమసేనుఁడు తలఁచెను. తలుపులు త్రోయఁబడినట్లయ్యెను. విక్రమసేనుఁడు మేనెల్లఁ జెవులు కన్నులు చేసికొని చీమచిటుక్కుమన్న వినుచు, నలుదిక్కులఁ జూచుచుఁ; గొట్టుకొనుచుండిన గుండెతోఁ దెఱవఁబడిన నోటితో దేవుని ధ్యానించుచుండెను.

మేడపైఁ జక్రిసేనగదియొక్క కిటికీతలుపులు మూయఁబ[illegible]డెను. కాని విక్రమసేనున కెవ్వరును గనఁబడలేదు. దీపము [illegible] త్రోసినట్లయ్యెను. అంతయు నంధకార మయ్యెను. "సూర్య[illegible] రక్షింపుము! రక్షింపుము!" అను నార్తనినాదము వెడలెను. సమయము నిరీక్షించుచు నోపికతో నిలిచియున్న విక్రమసేనుని కేయూ ర[illegible]నాదము దుస్సహ మయ్యెను. అతఁడు వడివడిగా నీఁదుకొని పోయి వంతెనపై కెక్కి ఖడ్గధారియై నిలిచెను.

ఇంతలో భయకోపసూచక మగునొకకంఠస్వరము "ఎవరది? తలుపు తీయుము. తత్‌క్షణము తెరువుము." అని గద్దించినట్లయ్యెను. ఆకంఠము సూర్యసేనుని దని విక్రమసేనుఁడు గుర్తించెను.

"అయ్యో! వీరవర్మ!—సూర్యసేనా! రక్షింపుము! రక్షింపుము!" అని దీనప్రార్థన లోపలినుండి మఱల వినవచ్చెను. వెలుపల

సూర్యసేనుఁడు గర్జించెను. తలుపులను బ్రద్దలుచేసి తోసికొని యతఁడు లోపలఁ బడెను. “ఛీ! నీచుఁడా!” యని మఱియొకగర్జన వినఁబడెను. అంతే కాని మఱియేశబ్దమును లేదు. అంతయు నిశ్శబ్దమయ్యెను. దడదడమను నడుగులరాపిడియు, ఫళఫళమనుకత్తులసంఘర్షణమును స్పష్టముగా వినఁబడుచుండెను. వెంటనే దెబ్బదిన్న పెద్దపులివలె సూర్యసేనుఁడు మఱల బొబ్బరించెను. వీరవర్మ కిటికి కొకసారి యానుకొని దానితలుపులను జక్కఁగాఁ దెఱచి ముందునకు లంఘించెను.

“శూరవర్మా! మోహనా!—హా!—ఊ—ర—క్షి—హా!”

పరుగుపరుగున దుర్గము నలువంకలనుండి యనేకు లాగదివంకకు సరభసమున ఖడ్గపాణులై పోవుచుండిరి. ఎడమప్రక్క రాజుగదివంకకు శూరసేనుఁడు మఱియొకనితోఁ బరుగెత్తుచుండుటను విక్రమసేనుఁడు చూచెను. వారు రాజును వధింతురేమో!

సూర్యసేనునియార్తనాదము విని వచ్చినవారందఱితో వీరవర్మ యొక్కఁడే పిశాచమువలెఁ బోరుచుండెను. వారందఱును వీరవర్మను జుట్టుకొనిరి. కాని యతఁ డట్టహాసముఁ జేయుచు ఖడ్గమును భయంకరముగాఁ ద్రిప్పుచుఁ గిటికీలోనుండి గుభాలునఁ గందకములోనికి దూకెను. విక్రమసేనుఁ డతనికంటఁ బడకుండ దుర్గకవాటముగోడతోఁ గలియు మూలయందు దాఁగుకొనెను.

ఇప్పుడు విక్రమసేనుఁడు రవివర్మాదులకొఱకై యెదురుచూచుట సర్వనాశనమునకుఁ గారణమని తలఁచెను. తనవారు వచ్చులోపల రాజు చంపఁబడునేమో యని యతఁడు భయపడెను. శూరసేనుఁడు రాజుగదికిఁ బరుగెత్తుట నాతఁడు చూచెను. సమయము మించిన సర్వనాశన మగును. అతనిమన సంతయు రాజుకడనే యుండెను.

విక్రమసేనుఁడు సాహసించి తలుపులు తెఱచి తిన్నగా రాజగృహముఁ జొరఁ దలఁచెను. అతఁ డట్లు తలఁచుచుండఁగా నెవఁడో కిటికీ ద్వారమునందు దలదూర్చి వీరవర్మ దుమికినచోటును జూడవచ్చెను. వాఁడు కిక్కురుమనకుండఁగనే విక్రమసేనుఁడు వానితలను దెగనరికి, తన్నాటంకపఱుచువా రచ్చట నెవ్వరును లేకుండుటకు సంతసించి మెత్తగా నడుగులు వైచుచుఁ దొందరగా రాజగృహకవాటముముంగిటికి వచ్చెను.

"ఆగడ్డల మేమి?"

"రాజమిత్రులే ముట్టడించి యుందురు. రాజును జంపుదమా?"

"తొందరపడరాదు. చేఁజిక్కినవాని నెప్పుడైనఁ జంపవచ్చును. నిదానించి చంపుటే మేలు. మీఁకిప్పుడు తొందరపడుటఁ బ్రయోజనము లేదుకదా. సూర్యసేనుఁడే యాజ్ఞను బంపును."

అని శూరవర్మయు నతనియనుచరుఁడును మాటలాడుకొనుచుండిరి. సూర్యసేనుఁడు వీరవర్మచేతనే వధింపఁబడెనని వారెఱుఁగ రని విక్రమసేనుఁడు తెలిసికొనెను.

విక్రమసేనుఁడు శత్రుమందిరమునఁ దీరికగాఁ దడయుఁజాలకముం దునకు వేయఁబడియుండినతలుపులను ద్రోసికొని వారిపైఁ బడెను. శూరవర్మయనుచరుఁడు ఖడ్గవిద్యయందుఁ దగినంత నైపుణ్యము లేనివాఁడైనను మహాధైర్యముతోఁ బోరి తుదకు విక్రమసేనునిచేత మడిసెను.

విక్రమసేనుఁడు రెండవశత్రువుతోఁ బోర నీవలికి తిరిగెను గాని శూరవర్మ కనఁబడలేదు. సూర్యసేనునియాజ్ఞకు బద్ధుఁడై యతఁడా మువ్వదియడుగులదూరమం దినుపసంకెళ్లచేఁ గట్టఁబడియుండినరాజుపై ఖడ్గము నెత్తుచుండెను.

"ఆహా! ఆహా!!" యనుచు రాజున కించుకదూరమునను

బంధింపఁబడియుండిన యొకపురుషుఁ డఱచెను. ,, ఒహో! అహో!!" యని విక్రమసేనుఁడుసైత మించుమించుగ నొక్కసారిగానే యఱచెను. గది యంతయు రెండుసార్లు ,, ఒహో! అహో!!" యని ప్రతిధ్వనించెను. కతుక్కున కత్తిదెబ్బపడెను. ,, హా!" యను కేక వెడలెను. శరీరము చటాలునఁ బడుశబ్దములో దానిప్రతిధ్వని వినఁబడలేదు.

శూరవర్మ రెండవసారి కత్తినెత్తెను. ఇప్పు డెవరిపై? రాజుపైనే! రాజింకను మరణిపలేదు. అప్పుడు వధింపఁబడినవాఁడు సూర్యసేనునిచే బంధింపఁబడియుండిన వైద్యుఁడు. అతఁడు తనరాజు చంపఁబడఁబోవుటను సహింపలేక కేకలు వేయుచు శూరవర్మఖడ్గమునకును రాజునకును నడ్డమువచ్చెను. తనయద్వితీయరాజభక్తిసి గనఁబఱచుచు నతఁ డట్లు మరణించెను.

రెండవసారి శూరవర్మఖడ్గము క్రిందికి దిగకముందే విక్రమసేనుఁ డాతనిపైఁ బడెను.

,, సరే రమ్ము! రాజు నాహ్వానించుటకు ముందేగఁదలఁచుచున్నావేమో! ' యని శూరవర్మ విక్రమసేనుని డీకొనెను.

శూరవర్మయును వీరవర్మవలె నసాధారణశూరుఁడే. సులభముగా నాతని జయింపఁజాల నని విక్రమసేనుఁ డాతను వదలి పోరుచుండెను.

చిన్నప్పటినుండియు వైరాగ్యముతోఁ బెరిగిన విక్రమసేనుఁడు క్రూరమైనఖడ్గాదిలోకవిద్యల నసహ్యించుచు, నంతగాఁ బరిశ్రమ చేయ లేదు. ఐనను నతఁడు సహజముగా భీమబలుఁడు. మేరుధీరుఁడు.

,, రాజా! నీకై పోరుచుంటిని. నేనసమర్థుఁడనై మరణింపవచ్చును. సహాయుపడియైన నీప్రాణములు గాపాడుకొను"మని చెప్పుచుండిన చూపులతో విక్రమసేనుఁడు రాజువైపుఁ జూచెను.

రాజాశ్చర్యపడి, ' ఒహో! బావా! విక్రమసేనా! నేను నీకు

సహాయము చేసెదను.” అని యొకలగుడము బంధింపబడిన రౌడు చేతులతోఁ బట్టుకొని శూరవర్మకాళ్లను మోదఁబోయెను. శూరవర్మ భయంకరముగా గర్జించి రాజును గాలితోఁ దన్నెను. బలహీనుఁడైన రాజు కేకవైచుచుఁ బడిపోయెను. అంతతోఁ జచ్చెనో లేదో యను రాజువని నొక్కమారే ముగింపనెంచి శూరవర్మ రాజుపైఁ గత్తి నెత్తెను.

విక్రమసేనుఁడు తనఖడ్గమును బారవైచి యెత్తఁబడియుండిన శూరవర్మఖడ్గము నూడఁబెఱికి మదగజముపై లంఘించుసింహమువలె నతనిపై నుఱికెను.

వారుభురికిని ఘోరమల్లయుద్ధమయ్యెను. అందును శూరవర్మ దుర్జయుఁడని విక్రమసేనుఁడు తెలిసెను. కాని ధర్మమునకుఁజయ మిప్పింపు మని యతఁడు భగవంతుని బ్రార్థించుచుండెను.

అలనాఁడు శ్రీకృష్ణుఁడు భీమజరాసంధులమల్లయుద్ధమున భీమునకుఁ దోడ్పడిన ట్లిప్పుడు విక్రమసేనునకును దోడ్పడెను. శూరవర్మపోరుచు వెనుక వైద్యునిమృతశరీరము తట్టుకొని ముందున కడుగువైవగా నాతనిరక్తములోఁ గాలుజారి క్రిందపడెను. విక్రమసేనుఁడు క్షణములో నాతనియెదపైఁ గూర్చుండి ముక్కు, ముఖము పగులఁగొట్టి యెదపై గ్రుద్దెను. శూరవర్మ రక్తముఁ గ్రక్కుచుఁ జచ్చెను.

రాజు మరణించె నేమో యని యాతఁడు భయపడి యతనినాడి యాడుచుంటను గనిపెట్టి సంతోషముతో రాజుశరీరమును మోసికొని తనవారింకను రాలేదేమో యని భయపడుచు రాజును సురక్షితునిగా దుర్గరకమునుండి వెలుపలికి కెట్లు దెచ్చుటో యని యోచించుచుండెను.

శత్రుభయ మేమియు నాతనికిఁ గనఁబడలేదు. అందఱును వీరవర్మపుట్టించినకోలాహలములో నుండిరి. భగవంతుఁ డది తనకొఱకే చేసె నని విక్రమసేనుఁడు భావించెను.

వంతెనపై ఖడ్గహస్తుఁడై నిలిచి వీరవర్మ భయంకరముగా నవ్వుచుండెను. "సూర్యసేనా ! ద్వంద్వయుద్ధమునకు—మనకలహము పూర్తిగానిమ్ము." అని యతఁడరచెను.'

దుర్గమువారందరతని నెదిరించుచు నిలిచి యుండిరి. కాని యందరున్నను నావీరుని పైఁబడి యాక్రమింపలేక వెనువెనుకకుఁ బోవుచుండిరి.

"సూర్యసేనా !" అని యతఁడు మరలఁ కేకవైచెను.

"అతఁడు చనిపోయినాఁడు" అనియొకఁడు బిగ్గఱగానఱచెను.

"ఆపంది యొక్క దెబ్బకే చచ్చెనదా ? సరే. ఇఁక మీాయాయుధములను గ్రిందఁ బారవైచి మీారు నాకు లొంగుఁడు. నేనే మీాకు నాయకుఁడను.'' అని వీరవర్మ గర్జించెను.

అతని నెవ్వరు నెదిరింపలేక పోవుటచే వారాతనిమాటలకియ్యకొనుటయో మానుటయో, యెవరియభిప్రాయము లెట్లున్నవో యని యొండొరులఁ జూచుకొనుచుండిరి.

విక్రమసేనుఁడు వెనుకనుండి యది చూచి తానొక్కఁడే పోయి నీచాధముఁడగు వీరవర్మపై దుమికి సంహరించి వారందఱిని రాజపక్షముగాఁ జేయఁదలఁచి తాను మోసికొనితెచ్చియుండిన రాజునొకచో దింపెను.

ఇంతలో నొకయువతి వీరవర్మవైపు ఖడ్గధారియై నడుచుచుండెను. అట్లు నడుచుచు పిడికత్తిని గుఱిచూచి వీరవర్మపై వైచెను. అతఁడు దానిని దప్పించుకొని నవ్వెను. ఆమె యతనిని సమీాపించి మరల ఖడ్గము నెత్తెను.

అతఁడు బిగ్గరగా నవ్వుచు "చక్రసేనా! నేను స్త్రీపై—అందు నాప్రియురాలిపై ఖడ్గమునెత్తను. నీకోపము చల్లారువఱకు నేను నీయె

దుట నుండకుండుట మంచిది '' యని యతఁడు కందకములో మెల్లగా దిగి నీట మునిఁగెను.

ఇంతలో వెలుపలనుండి సింహానాదములు చెలఁగెను. వారు తన వారని గుర్తించి విక్రమసేనుఁడు తనపని యచ్చట నేమియు నిఁక లేదని రాజు నచ్చటనే విడిచి బద్ధవైరి యగువీరవర్మను వెన్నంటి తనపగను దీర్చుకొని నీచాధముని శత్రుశేషము లేకుండ నొకసారిగానే సంహరింపఁ దలఁచి యాతని వెన్నంటుతలఁపుతోఁ దానును గందకములోదుమికెను.

,, నిలుము ! వీరుఁడవైన నిలువుము వీరవర్మా !'' యనుచు విక్రమసేనుఁ డతని ననుసరించుచు నీఁదుచుండెను. వీరవర్మ వెనుకకుఁ జూచి భయంకరహాసమును యథాప్రకారమున వెడలించి మరల నీఁదు కొని పోవుచుండెను.

వీరవర్మ, విక్రమసేనుఁడు దిగి వచ్చియుండినత్రొటిసహాయము ననే యెక్కి మరల విక్రమసేనునిఁ జూచి నవ్వి గుఱ్ఱము నెక్కి పరుగుఁ దీసెను.

,, ఇంకొకసారి కలిసికొనెదను.'' అని వీరవర్మ పలుకుటను విక్రమసేనుఁడు వినెను. వానిని వెన్నంటుటా కాదా యని యతఁ డొకతడవ యాలోచించెను. తాను రాజుకడ నుండుటే యుత్తమమని యతఁడు తిరిగి త్రొంటివిధమున ఖడ్గహస్తుఁడై తనకు దోడుగా దనవారున్నారను నుత్సాహముతో రాజుకడనే నిలిచియుండెను.

దుర్గమును బట్టుకొనుటలో రవివర్మాదుల కెట్టికష్టమును లేక పోయినది. ఎవరును దప్పించుకొనకుండఁ బ్రతిద్వారముకడను దనవారిని రవివర్మ యుండఁబంచెను.

,, ఓహో ! వీరులారా ! చావెట్లునుదప్పదు. శత్రువులచేత దారుణమరణముఁబొంది సూర్యసేనునకుఁ గళంకముఁ దేకుఁడు. వీరిలో

మీారే పోడుచుకొని మీానాయకునియెదుట వీరోచితముగాఁ జచ్చిపోం డు!" అని చక్రిసేన వారందఱికి నుదాహరణమును జూపుచు సూర్య సేనుపాదములు పట్టుకొని ఖడ్గముతోఁ బొడుచుకొని తనప్రియునిప్రక్కనే పడిపోయెను. మోహనుఁడుతప్పఁ దక్కినవారందఱు నట్లే కావిం చిరి. కాని యొకఁడుమాత్రము కిటికీలోనుండి యగడ్తలోనికి దూకి, తప్పించుకొని గుఱ్ఱము నెక్కి వీరవర్మ పోయినదిక్కుగానే పాఱిపోయెను.

రవివర్మధర్మవర్మలు రాజును గాపాడుచు రక్తసిక్తఖడ్గముతో, గాయపడినమేనితో నిలిచియుండినవిక్రమసేనునిజూచి యుద్ధగొక్కమాఱే కౌఁగిలించి "మహావీరుఁడా! నీకు జయము." అనిరి.

రాజు రహస్యము నింకను వెలిపెట్టరాదని రవివర్మ తనయనుచ రులతో "రాజును మేము పిలుచుకొని వచ్చెదము. మీారేఁగి రాజ ధానిలోఁ దగినప్రయత్నములను జేయించుఁ"డని సేనాధిపతితోఁ జెప్పు మని కొందఱిని, రాణితోఁ జెప్పుమని కొందఱిని బంపివైచెను. దుర్గవీరు లందఱు—వీరవర్మతప్ప—మరణించిరికదా యింకేమిభయ మని యాతఁ డట్లు గావించెను.

రాజును రాజధానివరకు సురక్షితముగాఁ జేర్చి తనరహస్యము కాశ్మీరమునకుఁ దెలియకుండఁ దనదారినిఁ బోయెద నని విక్రమసేనుఁడు రవివర్మతోఁ జెప్పెను.

"ఔను. నీవును వచ్చినచో జరిగినసంగతులన్నియు బోధపడి జనులహృదయమును, రాణిహృదయమునుగూడ కలవరపడును. ఇరు వురువిక్రమసేనులు తమ్ము పాలించి రని వారికిఁ దెలియనీయఁగూడదు." అని రవివర్మ కంటఁ దడి వెట్టుకొని విక్రమసేనునిగడ్డము పట్టుకొని ప్రార్థనాసూచకముగాఁ బలికెను.

రాజును, నతనికుడిప్రక్కను రవివర్మయు, నెడమప్రక్కను ధర్మ వర్మయు, వెనుక విక్రమసేనుఁడు గుఱ్ఱముల నెక్కి రాజధానివంక మెల్లగా నడచుచుండిరి. వారందఱియానందమునకును మేరయే లేదు.

వారర్ధభాగము పోయియుండిరి. ఇంతలో నిరువురాశ్వికులు శరవేగముగా వచ్చి వారిపైఁ బడిరి. వారిలో నొకఁడు వీరవర్మ. రెండవ వాఁడు దుర్గమునుండి తప్పించుకొనిపోయినవాఁడు. ఈ రెండవవాని పేరు బలవర్మ. ఇతఁడు నుక్షత్రియుఁడే యైనను కుటిలజీవనము చేయుచుండువాఁడు. వీరవర్మబలరూపముల కచ్చెరువంది యతనిపై నొకవిధముగు గౌరవము కలిగియుండెను. తమవారందఱుఁ జావగా మిగిలినయొక్కఁడే యగువీరవర్మను గొలిచి యతఁడు బ్రతుకఁదలఁచెను.

రాజును వెనుక నైచుకొని రవివర్మధర్మవర్మ విక్రమసేనులు వీరవర్మబలవర్మల నెదిరించిరి.

వీరవర్మ తటాలున గుఱ్ఱముపైనుండి క్రిందికి దుమికి, తన్నడ్డగింపవచ్చుచుండిన విక్రమసేనునిగుఱ్ఱమును జంపి, యతఁడు క్రింద పడునట్లుగాఁ జేసి, యొక్కపెట్టున రాజును సమీపించి, క్రిందికి లాగి కత్తితోఁ బొడిచివైచెను. రవివర్మధర్మవర్మవిక్రమసేనులనుండి హాహాకారములు వెడలెను కాని వారొక్కరును గదలకుండ బలవర్మ యడ్డగించి పోరుచుండెను.

వీరవర్మ భీకరముగా నవ్వుచుఁ బరమశాంతముగా ,, విక్రమసేనా! రాజు చచ్చినాఁడు. నీవైన నేనైన రాజు కావలయును. నీవు ధర్మపరుఁడవైన, నీయనవసరకలహము నాపి మనమిరువురముమాత్రమే ద్వంద్వయుద్ధము చేయుదము. జయలక్ష్మి యెవనినైన వరింపనిమ్ము. ” అనెను.

చిరకాలమునుండి యతనితో నొంటిగాఁ దలపడి పోర నభిలషించు విక్రమసేనుఁడు ధర్మచిత్తుఁడై, రవివర్మధర్మవర్మలతోఁ గలిసి యాతని వధింప నిష్టపడక యట్లే యని యొప్పుకొనెను. రవివర్మధర్మవర్మలు వలదనియు, యానీచు నెట్లైనఁ బొరిగొనుటయే ధర్మ మనియు, నీచుఁ డని కర్ణుని నర్జునుఁ డధర్మముగానే చంపెననియు నెంతో బోధించిరి కాని విక్రమసేనుఁడు వినలేదు.

"ఖడ్గములతోఁ బోరుదమా ? ముష్టియుద్ధము చేయుదమా" యని విక్రమసేనుని యోచింపనీయక యతనిఁ ద్వరగా సమ్మతింపఁజేయుటకై వీరవర్మ ప్రశ్నించెను.

ఖడ్గయుద్ధమునఁ దనకు విజయము సులభసాధ్యము కాదని విక్రమసేనుఁడు వీరవర్మను మల్లయుద్ధమున కాహ్వానించెను. వారిరువురును ఖడ్గములను దూరముగాఁ బాఱవైచి బాహాబాహిని దలపడి పోరుచుండిరి. బలిష్ఠుఁ డగువిక్రమసేనుని దెబ్బలకు రెండుసార్లు వీరవర్మ పడి లేచెను.

వీరవర్మ యలసిపోవుచు మల్లయుద్ధమున కేల యియ్యకొంటి నని ఖడ్గములు పాఱవైవఁ బడియుండు దిక్కునకు మెల్లమెల్లగా జరుగుచుండెను. అతనికుట్రను రవివర్మధర్మవర్మలుగాని, విక్రమసేనుఁడుగాని కనుఁగొనలేదు. వీరవర్మ క్రిందపడినవానివలె నేల కొరిగి ఖడ్గమును బట్టుకొనెను.

అతఁడు లేవకముందే "ఓరీ! నీచా ! నీ వెన్నిసార్లు నాకు ద్రోహము చేసినను దయఁ దలఁచి యీసారి నమ్మి నీయిష్టప్రకారమే పోరుచుంటిని. ఇఁక నీ పాపము దాఁగదు." అనుచు వీరవర్మపై దూకె విక్రమసేనుఁ డతఁడు పట్టుకొనియుండినకత్తితో నతని చేతితోడనే యతనిని జంపివైచెను.

"దురాత్మా! చావ్రము! నీవంటిరూపవంతుని నీవంటికుటిలాత్ముని నేను చూడలేదు. నీదేవస్వరూపములో రాక్షసహృదయ మున్నది." అని విక్రమసేనుఁ డాయాసపడుచుఁ బలికెను.

బలవర్మ వీరవర్మను జంపినవిక్రమసేనుని జంపి తీరెద నని ఘోరముగా శపథముచేయుచుఁ బాఱిపోయెను.

---

## పదునెనిమిదవప్రకరణము.



" Repentance comes too late."

అచట లంకలోఁ బరిస్థితులు బాగుండలేదు. రాణి యగుసూర్యప్రభ ప్రజలను ఘోరముగా శిక్షించుచుండెను. తాను దొంగసాక్ష్యములను జూపి విక్రమసేనునిపై మోపిననేరము నెప్పుడైన బయటపెట్టుదురేమో యని ధనగుప్తుని, భయంకరునిఁ జెఱపెట్టెను.

శుకవాణి రాజునకుఁ దన్నెప్పుడు వివాహము చేయుదు వని రాణికి లేఖపై లేఖ వ్రాయుచుండెను. రాణి విసిగి "విక్రమసేనుని నీయింటఁ జంపింపఁదలఁచి యట్లాశపెట్టితిని. అంతే కాని సవతి నెట్టిమూర్ఖురాలైనఁ దెచ్చిపెట్టుకొనునా?" యని శుకవాణికి బదులువ్రాసెను.

శుకవాణిపైఁ బిడుగుపడిన ట్లయ్యెను. నిరపరాధి యగువిక్రమసేనునిపై నిష్కారణముగా నొకరిమాటలు విని దురాశ పడి, నేరము మోపినందుకుఁ దగినశిక్ష భగవంతుఁడు కావించె నని యామె తలఁచెను. అది విక్రమసేనునిశాపమే యనియు, పోవునప్పుడు విక్రమసేనుఁ డాకసమును జూపుటను జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. ఆమె జరిగినసంగతి నంతను దండ్రి కెఱిఁగించి విలపించెను. శత్రుసింహుఁడు రాణికావించిన కుతంత్రమునుగూర్చి రాజునెదుట నభియోగము తెచ్చెను.

సేనాని శత్రుసింహుఁ డభియోగము తెచ్చుటను విని యిదే సమయ మని ధనగుప్తభయంకరులును రాణికి జంకి కావించినతప్పిదము నొప్పుకొనుచు రాజునకు జాబులు వ్రాసిరి. విక్రమసేనుని జంపుమని రాణి శుకవాణికి వ్రాసినజాబు రాణికుట్రకుఁ బ్రబలసాక్ష్య మయ్యెను. ఇఁద ని, ముఖ్యముగా స్వహస్తలిఖితమగునా లేఖను తిరస్కరించి పలుకఁ

జాలక రాణి తనతప్పిదము నొప్పుకొని క్షమించుమని భర్తయగుఘోరసింహునిపాదములపైఁ బడెను. ఇదే సమయమని రాణిచేఁ గష్టపెట్టఁబడినప్రజ లందఱు నామెముఖమునెదుటనే యామెను నిందించి యామెయొక్కొక్కని నేయేవిధమునఁ గష్టపెట్టినదియు వెల్లడించిరి.

మహాసద్గుణవంతుఁ డగుతమ్ముని గోలుపోయితినే యని రాజు మిక్కిలి శోకించి, రాణిమూలమున విక్రమసేనునకుఁ గలిగిన దేశభ్రష్టత్వశిక్షను రాణిపైనే వేసెను. మఱఁదిని క్షమార్పణ వేఁడి యెందుండినను నతనిఁ దోడ్కొనివచ్చినప్పుడే యామె లంకయందుఁ గాలిడవలయును.

ఘోరసింహునకు దివారాత్రములు విక్రమసేనునిప్రశాంతముఖము కన్నులఁగట్టినట్లే యుండెను. ,, అన్నయ్యా! ఎంత చేసితివి? నా జీవితమునంతను నీమూలముననే యసహ్యించుకొనుచు నిరంతరము భగ్నహృదయుఁడనై యున్నాను.'' అనుపలుకులు విక్రమసేనుఁడు చెప్పుచున్నట్లాతనికిఁ దోఁచెను. ,, తమ్ముఁడా! తమ్ముఁడా!'' యనుచు నాతఁడు తమ్మునికై యెల్లచోట్ల వెదకించి నిరాశతోఁ బవిత్రమూర్తి యగుతమ్మునిఁదలఁచుకొనుచుఁ బిచ్చిపట్టి కొన్నిదినములకే మరణించెను.

విక్రమసేనునకుఁ దాను గావించినయపరాధము దొలఁగించుకొనుటకు నాతనినే త్రికరణశుద్ధిగాఁ బ్రేమించి వరించి క్షమార్పణ వేఁడవలెనని శుకవాణి తలఁచి పురుషవేషము ధరించి యాతని నన్వేషించుటకు బయలుదేఱెను. ఏకపుత్రి పోవఁగా, రాజు మరణింపగా నటఁ దన కేమి సుఖ మని శత్రుసింహుఁడు బిడ్డవెంట బయలుదేఱెను. తానును నాతనికి గొప్పయపరాధమును సలిపితి నని శత్రుసింహుఁడు పశ్చాత్తాపపడి యతనిచిత్రపటమును లంకయందంతటను బవిత్రరూపముగాఁ బూజింపఁబడునట్లు శాసించెను.

సూర్యప్రభ తనతండ్రియొద్దఁ దలదాఁచుకొనఁదలఁచెను గాని

యాపుణ్యాత్ముఁడు బిడ్డతప్పిదము నెఱిఁగి యామె కాశ్రియము నియ్య లేదు. ఇఁక నాపుణ్యాత్ముఁ డగువిక్రమసేనుని వెదకి యతనియడుగుల కెరఁగి క్షమార్పణ వేఁడి బ్రతుకుట తప్ప గత్యంతరము లేదని యామె మిక్కిలి పరితపించి, యెవనిని దనయెదుటనుండఁ జూచి యసహ్యించు కొనుచుండెనో యట్టివిక్రమసేనునే తన వెనుకఁబోయినదేవునిగాఁ దన హృదయమున నిలుపుకొని „ విక్రమా ! తమ్ముఁడా ? నీవంటిలక్ష్మణుని మఱఁదిగాఁ బొందినసీత నయ్యుఁ గుటిలనై యాభాగ్యమును గ్రహింప క నీజీవితము నంతను బాడుచేసితిని. నీయన్నను జంపుకొంటిని. నీదివ్య సందర్శనముఁ గలిగించుకొని నీపాదములను బట్టుకొన్నను నీవు నన్ను క్షమింతువా ?" యని విలపించుచు „ లంకారాజసోదరుఁడు విక్రమ సేనుఁడనువాఁ డిట్టివానిని జూచితిరా ?" యని యడుగుచు, నుస్సురనుచు బోవుచుండెను.

„ రాజసోదరుఁడైనవాఁ డెచ్చటికిఁబోవును ? కాశ్మీరరాజు పట్టాభిషేకము కొన్నిదినములక్రిందట జరిగినది. అచటి కేమైనఁ బోయి యుండునేమో" యని యొకఁ డామె కెఱిఁగించెను. కాశ్మీరస్త్రీయుఁ, దనమూలమూర్తియు నగుప్రభావతిపైని మక్కువచే విక్రమసేనుఁ డా పట్టాభిషేకము నచ్చటఁ జూడఁబోయియుండవచ్చు నని, తనమఱఁదిని గలిసికొనఁగలనను నాశతో నామె కాశ్మీరము నతికష్టముతోఁ జేరెను. రాజుతోడనే తనభంగపాటును జెప్పుకొని తానెవ్వరైనది తెలియఁజేసి, రాజున కాప్తబాంధవవర్గములోనివాఁడై రహస్యముగా విక్రమసేనుఁ డుండు నని యామె రాజసందర్శనమునే మొదట గోరఁదలఁచెను. కాని రాజు వేటకుఁబోయి యెప్పుడు తిరిగివచ్చునో యెవరును జెప్పలేకపోవుట కామె మిక్కిలి చింతించుచుఁ దన్ను భగవంతుఁ డూరక విడువఁ డని యామె యీశ్వరుని హృదయపూర్వకముగా క్షమార్పణకై ప్రార్థించెను.

---

## పందొమ్మిదవప్రకరణము



"Of your philosophy you make no use,
If you give place to accidental evils."
(Shakespeare,)

రవివర్మ కస్సీరుఁ గార్చుచు రాజునకుఁ ద్వరత్వరగా నుత్తరక్రియలు చేసి యొకచోఁ బాతిపెట్టెను. విక్రమసేనుఁ డాతనిగూఢాంతరాత్మను గనుఁగొనలేక తడివడినకన్నులతో నివ్వెరపడుచుండెను. ధర్మవర్మ బాలునికై పడి అంతయు వ్యర్థమేనా ?" అని యేడ్చుచుండెను.

రవివర్మ తనపని ముగించి, "ఇంతవఱకుఁ బాలించినరాజే యిప్పుడును రాజగుఁగాక !" అని పలుకగా విక్రమసేనుఁ డదరిపడి యాశ్చర్యముతో రవివర్మను గనుఁగొనుచుండెను.

ధర్మవర్మవిస్మయపడి " ఏమి ?" యనెను.

రవివర్మ—కుమారా ! మనమేలుకొఱకే భగవంతుఁడు రాజును జంపించినాఁడు. రాణి మదనకళ యీవిక్రమసేనునే ప్రేమించి యున్నది. కావున రాజు బ్రతికియుండిన, మన కింకను గష్టము లుండి యుండును. ఇన్నిదినములు పాలించిన మదనకళామనోహరుఁడే యెప్పటివలె రాజ్యమందు నిలుచుఁగాక ! రాజ్య మరాజకము కాకుండ నింతకంటె మంచి పనిని మనము చేయలేము. ఇతఁ డుత్తమక్షత్రియుఁడు. ఈరాజునకు బంధువు

మదనకళాపరిగ్రహణకుతూహలుఁడై విక్రమసేనుఁ డెట్టిఘోరతంత్రములను బన్నవలెనని తలఁచెనో యవి యన్నియు నాతనిపవిత్రజ్యోతిర్నేత్రముచే దహింపఁబడెను. సూర్యసేనుఁడు మరణించెను.

రాజును మరణించెను. ప్రేమశత్రువు లిరువురును దొలఁగిరి. రవివర్మ ధర్మవర్మలు తామై రాజ్యారమతో మదనకళ నతని కప్పగింప నుండిరి. సిరికోఁటకుఁ గాకపోయినను, సుందరికై పోరఁదలఁచిన విక్రమసేనుఁ డేమనెను ?

" ప్రపంచముతోఁ దగులము నాకుఁ దెగినది. నన్ను వెడలిపో నిండు. నేను రోయుచుండిన నీచమానవజాతికి, నీచధనమునకు నేను ప్రభువును కాజాలను. నన్నుఁ బ్రేమించినమదనకళ పవిత్రయైన నేనా మెను గొని యడవులందుఁ బవిత్రముగా సంచరింతును గాని మానవా ధములమధ్య జీవింపలేను. యముఁడు ధర్మాత్ముఁ డయ్యు, ధర్మరా జయ్యు, నరకాధిపతి యగుటచే భయంకరుఁ డయ్యెను. క్రూరుఁడుగా గణింపఁబడుచున్నాఁడు. ప్రపంచమందుండిన నెట్టిసచ్చరిత్రుఁ డైనను, గొన్నినీచచిత్తవృత్తులకు లోనగును. నేనొకప్పు డెట్టిఘోరతంత్రము నా లోచించితినో యెఱుఁగుదురా ? మిమ్మును, రాజును సైతము వధించి, మదనకళను బొంద నాశించితిని. నేనట్టిపరమనీచుఁడ నైతిని.

ఎందుకు ? ఈమానవులమధ్య నివసించుటచేతనే నేను ధర్మయు క్తముగా మదనకళను గూడఁ బరిగ్రహింపఁజాలను. ఆమె యొకరిసొత్తు. రాజ్యముసైతము నాదికాదు. నేనీరెంటిని దొంగిలించుటే కాక యిం కను ధర్మవేషముఁ దాల్చి యందఱను, గడకు బవిత్రప్రేమమయియగు మదనకళను వంచింపఁజాలను. తండ్రీ ! నేను చేసినసాయమును దలఁచు కొనియైన నన్ను విచ్చలవిడిగాఁ బోనిమ్ము. నావేదాంతమును, నాపవి త్రాత్మను వంచింపకుము. అధోగతిఁ ద్రోయకుము. " అని విక్రమసే నుఁడు రవివర్మపాదములపైఁ బడెను.

రవివర్మ యతని ననేకవిధములఁ బ్రార్థించెను. వేయివిధముల నాశపెట్టెను. ఇంతకంటె నింద్రపదవియో యనెను. అరాజకము గాకుం

డునట్లు నాథుఁడులేని ప్రజలకు నాథుఁడై పాలించుట యొకధర్మకార్యమనెను. ఏమన్నను నతనిదృఢచిత్తము చలింపలేదు.

రవివర్మ దీర్ఘముగా యోచించి, "ఓమహానుభావా! నీవెవఁడో యవతారపురుషుఁడవు. నీపని యైనంతనే యొకక్షణమైన నాగననుచున్నావు. ఐనను నేఁడో యొకత్రోవ చూపించి మమ్మధోగతి పాలుచేయక కాపాడుము. నీవు రాజధానికి వచ్చి నీస్వహస్తములతో రాణికిఁ బట్టముకట్టి, రాణియుఁ బ్రజలును సమ్మతించునట్లు వైరాగ్యము నుపన్యసించి, యడవులనుండియే మిమ్ముఁ బాలించుచు మీక్షేమము నారయుచుఁ దగినహితమును జెప్పుచుండెద నని భోధించి ప్రజలును రాణియు గౌరవించి సాగనంపఁగా సన్యసింపుము. నీ విచ్చటనుండియే పోయిన రాజెచ్చట యనుప్రశ్నకు మేమేమి బదులొసఁగవలెను? చనిపోయినాఁడనియా? సన్యసించె ననియా? ఎట్లు చెప్పినను జనులయాందోళనమును బాపలేము." అని విక్రమసేనుని వేఁడికొనెను.

విక్రమసేనుఁ డిందులకు సమ్మతించి వారివెంట రాజధానికి బయలుదేరెను. రాజు చాలదినములకు వచ్చుచున్నాఁ డని పట్టాభిషేకము నాఁడువలెఁ బురమును శృంగారించి, మహోత్సవములు చేసి, ప్రజలందఱు నాతని మహావైభవముతో నెదుర్కొనిరి. కాని విక్రమసేనుని మోము జాలితోఁ జిన్నఁబోయియుండెను.

విక్రమసేనుఁడు తనచేఁ గాఁగలకార్యమును ద్వరగాఁ జేయింపుమని రవివర్మను దొందరపెట్టెను.

"ఇఁకను నీపట్టును వదలవా?" యని రవివర్మ ప్రార్థించెను.

"నన్ను మన్నింపవలెను." అని విక్రమసేనుఁడు సవినయముగా బదులుచెప్పెను.

"ఈరాత్రి బాగుగా యోచించుకొని తెల్లవారగానే నీదృఢని

శ్చయమును జెప్పుము. చక్కఁగా నాలోచింపుము. నీపిచ్చిపట్టును వదలుము.”

“ ఎన్నాళ్లు యోచించినను నింతే.”

“ అట్లనకుము. మానవస్వభావ మతిచంచలమని యెఱుఁగవా?”

“ అది తప్పు. ‘ మనసు విరిగెనేని మఱి యంటనేర్చునా ’ యని వినవా ?”

ముసలివాఁడు తనసూక్ష్మదృష్టులతో విక్రమసేనుని జూచి యుతనినిశ్చయమున కాశ్చర్యపడియు, నీమనసు చలింపఁజేసెదను చూడు మని మనసులోనే ప్రతిజ్ఞ చేసికొని, రాజు రాలేదని బెంగపెట్టుకొనియున్న మదనకళ నారాత్రి రాజసౌధమునకు సగౌరవముగాఁ గొనివచ్చి మదనకళావిక్రమసేనులను మనోహరమందిరమున నేకాంతముగా మాటలాడ విడిచి మనోజునిచే విక్రమసేనుని బంధింపనెంచెను.

ధీరచిత్తుఁడగువిక్రమసేనుఁడు ముసలివానికుట్ర నెఱిఁగి, తన దృఢచిత్తము చెదురునేమో యని లోకనైచ్యమును బోధించుచు నామెను నిద్రపుచ్చి, తనచిత్తమును భగవంతులీలలను గనుఁగొని, యింకను దృఢపఱచుకొన నచ్చటియుద్యానవనమునందు విహరింపఁబోయెను.

ఆరాత్రి మిక్కిలి ప్రశాంతమై నిశ్శబ్దమై భగవంతునియాత్మవలె నిర్మలమై యుండెను. ప్రపంచకోలాహలమునకు దూరమై యరణ్యజీవనము, మృత్యువును నట్లే ప్రశాంతమైయుండు నని యతఁడు తలఁచుచుండెను. అతఁ డొక్కసారి తనజీవితచరిత్రము నంతను జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. పదినె తన్ను తరుముట. శుకవాణి తన్ను తురుమఁదలంచుట. ఆవల నిటు వచ్చి మదనకళారూపబద్ధుఁడై తనయంతటిధీరచిత్తుఁడే మహాఘోరకార్యములను జేయఁదలంచియుఁ దనదురాత్మను బలుయుంచుట.

“ అహో ! మానవస్వభావమే నీచము. నేనుమాత్ర ముత్తముఁడ నని చెప్పరాదు. కావున నిర్మలజీవన మరణ్యమందుఁ దక్క మఱొండు చోట లభింపదు. నీచులమధ్య వసించిన నీచబుద్ధియే పట్టును. కావున నీచమానవప్రపంచమధ్యమునుండి తొలఁగవలెను. స్త్రీలు—సిరి— ఈ రెండు నధర్మప్రవృత్తిప్రేరకములు. ”

విక్రమసేనుఁడు తానుచిత్రించియుండిన స్త్రీపటమును దీసి కన్నీటితోఁ జుంబించి,

“ రమణీమాపులు తూపు-లమరులె మరణింతు
యముఁ డంగజుఁడె కాఁడచిలుకా ?
మము నిట్లు బాధింపఁ గడకా
జముఁ డంగనయెచూవె చిలుకా !

విమలముఖాలె కా-వించుదుర్మాయల
వెఱ్ఱిపురుషుఁ బట్టఁ జిలుకా !
విమలలే రమణులు చిలుకా !
విలయస్వరూపలే చిలుకా !

కోమలముఖు లయ్యు-గోప్యస్వభావలు
గోముఖవ్యాఘ్రము ల్చిలుకా !
కొమ్మ నమ్మఁగ నెట్లు చిలుకా !
కొఱవిదయ్యాలెపో చిలుకా !

ఏమని నెదకుదు-నేమాత్రమును నమ్మ
రామి, నీజాతిని జిలుకా ?
భామలు బాకులే చిలుకా !
భీమమహిమాత్మలే చిలుకా !

తరుణిలోకమున నీ-కరణి సచ్చరిత్రలై
పరగుటే యరుదయ్యెఁ జిలుకా !
వరియింప నినుఁ దప్ప జిలుకా !
మఱి యెవ్వరిని గాని చిలుకా !

విరహసాగరవారి-వెడలింపఁ దరణివై
తరుణి నీవుండంగఁ జిలుకా !
వెఱపేల మరుసకుఁ జిలుకా !
వేరొక్క-చెలియేల చిలుకా ?

సిరి నారులే లేని-ధర పవిత్రిత నందు
దురితపిశాచము ల్చిలుకా !
పరమాత్మునిఁ గూడఁ జిలుకా !
పట్టి బాధించునే చిలుకా !

దురితాత్ములనుచు నం-దఱిని నిందించుట
పొరపాటగును, గాని చిలుకా !
పురుషు లొండొరులతోఁ జిలుకా !
పోరి మీకై యేడ్త్రు చిలుకా !

రమణీవిమలముఖ-కమలము లొక్కొక్క-
సమయానఁ బురుషులన్ జిలుకా !
తమ కాశ లేనప్డు చిలుకా !
భ్రమతులఁ జేయునే చిలుకా !

అమలులై యిలజీవ-యాత్ర చేయుట కొక్క-
యాశయే కలదింకఁ జిలుకా !
అడవిని జేరుటే చిలుకా !
కడుదూరముగ నింకఁ జిలుకా !

స్త్రీజనం బంతియు-ఛీ ! సీచు లని నింద
సేయు నేనే యిప్పుడిలుకా !
చిత్తభ్రమలఁ బొంది చిలుకా !
ఛీయని రోసితేఁ జిలుకా !
సాజమా మానవ-జాతి కీవిపరీత
చేత మొక్కొ-కసారి చిలుకా !
ప్రాతమా నీమోహముఁ జిలుకా !
చూతు నిప్పట్లు చిలుకా ?—"

అని విక్రమసేనుఁడు కడపటిచరణమును బాడుచుండఁగనే యొక మూలనుండి రివ్వుమనుశబ్దము పుట్టెను. వెంటనే విక్రమసేనునిహృదయమున నొకకత్తి గ్రుచ్చుకొనెను. "హా ! చిలుకా ! పవిత్రమూర్తీ! హా ! ఈశ్వరా ! పవిత్రజ్యోతీ !" యని యఱచుచు విక్రమసేనుఁడు నేలఁగూలెను.

ఆకేకలు విని మదనకళారవివర్మభరవర్మలు పరుగెత్తుకొని వచ్చిరి. పడియుండినవిక్రమసేనునిఁ గాంచి యిదియేమని ప్రశ్నించిరి.

"ఎవరో గురిపెట్టి యీకత్తిని నాపై విసరినారు." అని చెప్పుచు నతఁడు వేదనాభరమున మూర్ఛనందెను.

హంతకునిఁ బట్టుపట్ట వెదకుఁడని రవివర్మ కొందఱినిఁ బంపెను. వారతిత్వరితముగానే బలవర్మను బట్టుకొని వచ్చిరి. బలవర్మ నవ్వుచు "నాయజమానుఁ డగువీరవర్మను జంపినయీతనిని నేనెల్లప్పుడుఁ గసిపెట్టుకొనియే యుంటిని. నాప్రతిజ్ఞను మఱచిపోయితిరా ? నేఁడు నాప్రతిజ్ఞ తీఱినది. మావారందఱిపగను నేను తీర్చుకొంటిని. నాపని ముగిసినది. ఇఁక మీరు నన్నేమైనఁ జేయుఁడు." అనెను.

రవివర్మకోపమును బట్టఁజాలక పెదవి తెగిపోవునట్లు కొఱికి,

విక్రమసేనునియొద్దఁ గుచ్చిన ఖడ్గము నూడఁదీసి దానితోడనే బలవర్మను జంపివైచెను.

విక్రమసేనుని హంసతూలికాతల్పముపై సౌధమందుఁ బరుండజేసి, యతఁడు మృతిఁజెందెనేమో యని మదనకళ యాతనిదేహముపైఁ బడి హోరని యేడ్చుచుండెను. ధర్మవర్మయు నామె ననుసరించెను. రవివర్మ నిశ్శబ్దముగాఁ గన్నీరుఁ గార్చుచుండెను.

విక్రమసేనుఁడు మెల్లగాఁ గన్నులువిప్పి యేడ్చుచుండినవారినిఁ జూచి తానును గంటతడి పెట్టెను. రాణి యాతనిగడ్డము పట్టుకొని యేమియు మాటలాడఁజాలక దీనదృష్టులతోఁ జూచుచుండెను.

„ మదనకళా ! నీవు నన్ను క్షమింపవలెను. ” అని విక్రమసేనుఁ డామెపాదములు పట్టుకొనెను.

„ ఏల ? నీవెంటనే నేనును నరుదెంచెదను. ” అని మదనకళ వెక్కి వెక్కి యేడ్చెను.

„ అట్లుఁ గాదు. నామాటలను బూర్తిగా వినుము. నేనెక్కువగా మాటాడఁజాలను. నేను లంకారాజపుత్రుఁడను. సూర్యసేనుఁడు రాజును బంధించి యుండఁగా, రవివర్మధర్మవర్మలపార్థనము నియ్యకొని సింహాసనమును గాపాడుచుంటిని. నీచుల నందఱిని జంపి రాజును విడిపించితిని గాని, యాతనిప్రాణములను గాపాడలేకపోయితిని. నా జీవిత మీధర్మకార్యముతో ముగిసెను. నీవిఁక రాణివై లోకమును సంరక్షింపవలెను. నీవు నాయందుఁ గ్రొత్తఁదనము కాన్పించుచున్నదని పలుమారు పలుకుచుంటివి కదా ? అందుకు నేను క్రొత్తవాఁడగుటే కారణము. నీవు నాకొఱకు విలపింపవలదు. లోక మంతయు నీబిడ్డలు. నీకుఁ దగినరాజును బెండ్లియాడి నీబిడ్డలను బాలింపుము. ”

విక్రమసేనునికంఠము రుద్ధమయ్యెను. రాణి యావిచిత్రకథను

విని " అట్లైన నేను రాజును ప్రేమింపలేదు. మఱొక్కఁడ వగునిన్నే ప్రేమించితిని. ధన్యురాలను. నేను నీవెంటనే వచ్చెదను. కడసారి యీ లోకములో నొక కౌఁగిలి నిమ్ము." అనుచు నాతనికౌఁగిలించుకొని యామె విలపించెను. ఆమెకౌఁగిటనే విక్రమసేనుఁడు ప్రాణములు విడిచెను.

తెల్లవారెను. ఇరువురుస్త్రీలు నొకవృద్ధుఁడును రాజును దర్శింపవలె నని వచ్చిరి. రవివర్మవచ్చి వారు లంకారాణియు, లంకాసేనాధిపతియు, నతనిబిడ్డయు నని వారివలన నెఱిఁగి, వారేలవచ్చియుండిరో గ్రహించి, రహస్యముగా జరిగినవృత్తాంతము నెఱిఁగించి, మృతుఁడైన రాజు తమవిక్రమసేనుఁ డని వెలిపెట్టకుఁ డని వారిని ప్రార్థించెను. వారి హృదయములు పగిలిపోయెను. విక్రమసేనుఁ డెట్లు భగ్నహృదయుఁడై పోయెనో తాము నట్లనుభవింపవలసివచ్చెఁ గదా యని కడ కాతనిశవమైనఁ జూడనిమ్మని కోరిరి. రవివర్మ వారిని రాజుశవముకడకుఁ గొని పోయెను.

పుర మంతయు శోభాహీనమై రోదనధ్వనులతో నిండిపోయెను. పుర మంతయు శోకముతోఁ గదలి వచ్చి రాజసౌధముముంగిట నుండెను.

రాజుశవ మతివైభవముతో వెడలెను. బంగారుపల్లకిలోఁ బెట్టి రవివర్మధర్మవర్మలు కన్నీటితో మోసికొనిపోయిరి. శుకవాణీ మదనకళాసూర్యప్రభలు తలలు విరియఁబోసికొని విలపించుచు వెంటఁబోయిరి. ఇట్టిమంచిరాజును గోలుపోయితి మని ప్రజలును నేడ్చుచువారివెంటఁ బోయిరి.

రాజుశవమును గంధపుచెక్కలచితిపైఁ బెట్టిరి. నిప్పు ముట్టించిరి. అందఱు నక్కజపడునట్లుగా మదనకళచిఱునవ్వుతో విక్రమసేనునిప్రక్కనే పోయి పరుండెను. "నాథా! క్షమింపుము." అనుచు శుక

వాఁడియు నుండుచున్న చితిలోఁ బడి విక్రమసేనునిఁ గౌఁగిలించెను.

“ నిన్నింతదశకుఁ దెచ్చినసీవదినేను క్షమింపవా ?” యనుచు సూర్యప్రభ యతనికాళ్ళను బట్టుకొని యందుఁ గాలిపోయెను.

ఇట్టిదుఃఖమును బ్రజ లెన్నఁడును మఱచిపోక ప్రతిదినము సాయంకాల మచ్చటికి వచ్చి చితిలో మరణించినమదనకళాశుకవాణీసూర్యప్రభావిక్రమసేనుల జ్ఞాపకార్థమై చల్లనితోఁటమధ్యమందలిమందిరమునఁ జలువరాతితోఁ గట్టఁబడిననాలుగుసమాధులను సందర్శించి పోవుచుండిరి. మదనకళావిక్రమసేనులసమాధులు ప్రక్క ప్రక్కనే యుండెను. వాని కెదుటగాఁ గట్టఁబడినసమాధులు తెల్పుశుకవాణీసూర్యప్రభ లెవరో యెందు కందుఁ బడి మరణించిరో యెవరు నెఱుఁగరు.

రవివర్మ, మదనకళావిక్రమసేనులచిత్రములను సింహాసనముపైఁ బెట్టి వారిపేర రాజ్యము చేయుచుండెను. తనదేశము నరాజకము కాకుండ నట్టి మదనకళావిక్రమసేనులపటములు పెట్టి శత్రుసింహుఁడును లంకయందు రాజ్యము చేయుచుండెను.

రవివర్మ విక్రమసేనునివిచిత్రగాథను బంగారునీటితో వ్రాసి పదిలముగా దాచెను. ఈరహస్యము చాలదినములు గడచినతరువాత బయటపడెను. అంతటి ధర్మాత్ముఁడైన యాశౌకముఖుఁడు తప్పక మహావైరాగ్యమును బోధింపవచ్చిన శుకమహర్షియే యని యప్పటి నుండి కాశ్మీరమునఁ గొంతకాలమువఱకును శుకమహర్షిని బూజించుటాచారమై యుండెను.

సమాప్తము.

---

# ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

పిఠాపురము.

నవలలు—నవరసభరితములగు నవలలు—పుణ్యచరిత్రములు 200-250 పుటలకు మించకుండ—రెండుమాసములకొక్కటిగా వెలువడును.

## —• నిబంధనలు. •—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా 0-4-0 చెల్లింపవలయును.

2 ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు మంచి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనీఆర్డరు కమీషన్లు మేమే భరించి రు 1-0-0కే మా మే చందాదారులకుఁ బంపుచుందుము.

3. చందాదారులగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొనవలయునను నియమములేదు. కాని కోరినచో వెనుకటి పుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను

4. ఇందుఁ బ్రకటింపఁబడు అనుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందుప్రకటింపఁబడు ఆరుపుస్తకములకు రు 4-8-0 లు ముందుగఁ బంపువారికి ఆరుపుస్తకములవరకు ప్రతిపుస్తకమును అన్‌రిజిస్టర్డుపార్సిలుగా పంపుచుందుము. అందువలన రు 1-8-0 లు లాభము కలుగును.

## సిద్ధముగనున్న నవలలు.

చరిత్రాత్మకములు.

| | | రు. | అ. | పై |
|---|---|---|---|---|
| * 1 | నూర్జహాను | 1 | 8 | 0 |
| 2 | ప్రమదావనము | 1 | 8 | 0 |
| 3 | ఛత్రసాలుఁడు 1. | 1 | 8 | 0 |
| 4 | డిటో. 2. | 1 | 8 | 0 |
| 5 | శ్యామల | 1 | 8 | 0 |
| 6 | ధర్మసామ్రాజ్యము | 1 | 8 | 0 |
| 7 | కమల 1. | 1 | 8 | 0 |
| 8 | కమల 2. | 1 | 8 | 0 |
| 9 | ధర్మపాలుఁడు 1. | 1 | 8 | 0 |
| 10 | డిటో. 2. | 1 | 8 | 0 |
| * 11 | అశోకుఁడు | 1 | 8 | 0 |
| 12 | లలిత | 1 | 8 | 0 |
| 13 | మృణాళిని | 1 | 8 | 0 |
| 14 | నాయకురాలిదర్పము 1. | 1 | [illegible] | 0 |
| 15 | డిటో. 2 | 1 | 8 | 0 |
| 16 | రాణీభవాని 1. | 1 | 8 | 0 |
| 17 | డిటో. 2. | 1 | 8 | 0 |

* టెక్స్టుబుక్కు కమిటీవారిచే అప్రూవు చేయబడినవి.

## డిటెక్టివు నవలలు.

| | | | |
|---|---|---|---|
| 1 మాయావి (జామీలియాకథ) | 1 | 8 | 0 |
| 2 మనోరమ డిటో. | 1 | 8 | 0 |
| 3 మాయావిని | 0 | 12 | 0 |
| 4 జయాపజయములు | 1 | 8 | 0 |
| 5 ఘాతగృహము 2. | 1 | 8 | 0 |
| 6 ప్రతిజ్ఞాపాలనము | 1 | 8 | 0 |
| 7 సమానప్రతిభ | 1 | 8 | 0 |
| 8 "264" 1. | 1 | 8 | 0 |
| 9 "264" 2. | 1 | 8 | 0 |
| 10 లక్షరూపాయిలు | 0 | 10 | 0 |
| 11 రహస్యశోధనము | 1 | 8 | 0 |
| 12 లీలావతి | 1 | 8 | 0 |
| 13 శశిరేఖ | 1 | 8 | 0 |

## సంసారికనవలలు.

| | | | |
|---|---|---|---|
| 1 విషవృక్షము | 1 | 8 | 0 |
| 2 విశ్వప్రయత్నము | 1 | 8 | 0 |
| 3 భారతీభాస్కరము | 1 | 8 | 0 |
| 4 క్షమార్పణము | 1 | 8 | 0 |
| 5 మాధవీలత | 1 | 8 | 0 |
| 6 మధుర | 1 | 8 | 0 |
| 7 అపరాధిని | 1 | 8 | 0 |
| 8 లక్ష్మీకాంతము | 1 | 8 | 0 |
| 9 తిరుగుపెండ్లి | 1 | 8 | 0 |
| 10 ప్రణయచాంచల్యము | 1 | 8 | 0 |

## సాంఘికనవలలు.

| | | | |
|---|---|---|---|
| *1 గోరా 1 | 1 | 8 | 0 |
| 2 గోరా 2. | 1 | 8 | 0 |
| 3 రామాశ్రయము | 1 | 8 | 0 |
| 4 కృష్ణకాంతుని మరణశాసనము | 1 | 8 | 0 |
| *5 రాధారాణి | 0 | 6 | 0 |
| *6 నీరద | 0 | 12 | 0 |
| *7 రజని | 0 | 12 | 0 |
| *8 ట్రోజన్ యుద్ధము | 0 | 6 | 0 |
| *9 భ్రాంతివిలాసము | 0 | 12 | 0 |
| 10 సీమంతిని | 1 | 8 | 0 |
| 11 అన్నపూర్ణ 1. | 1 | 8 | 0 |
| డిటో 2. | 1 | 8 | 0 |

## పౌరాణికములు.

| | | | |
|---|---|---|---|
| 1 శ్రీకృష్ణచరిత్రము 1. | 1 | 8 | 0 |
| 2 శ్రీకృష్ణచరిత్రము 2. | 1 | 8 | 0 |
| *3 లలితచంద్రహాసము | 1 | 8 | 0 |
| *4 శకుంతల | 0 | 12 | 0 |
| *5 సీతావనవాసము | 0 | 12 | 0 |
| *6 విదురుడు | 0 | 12 | 0 |
| *7 భారతమహిళ | 0 | 12 | 0 |
| *8 చిరంజీవులు | 0 | 10 | 0 |

## పద్యకావ్యములు.

| | | | |
|---|---|---|---|
| *1 నీతిముక్తావళి | 0 | 8 | 0 |
| *2 నీతికథాముక్తావళి | 0 | 8 | 0 |
| *3 వీరమహిమ | 0 | 10 | 0 |
| 4 ఏకాంతసేవ | 0 | 8 | 0 |
| 5 హారావళి 2. | 0 | 4 | 0 |
| 6 జాతీయగీతము | 0 | 1 | 0 |
| *7 సంజీవనము (హెల్తుడ్రామా) | 0 | 2 | 0 |
| 8 శ్రీరామరాజనీతి | 0 | 4 | 0 |
| *9 నీతికథావల్లరి | 0 | 4 | 6 |

## ఇతరపుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 పిఠాపురసంస్థానము | 0 | 1 | 0 |
| 2 వీరపత్ని | 0 | 1 | 0 |
| 3 సుశీల | 0 | 1 | 0 |

* [illegible] ఇప్పుడు [illegible] చేయబడినవి.